# ల్యాప్‌టాప్ వలనే ఛాన్స్!

## -మేఘా ఆకాష్

పేరుకు తెలుగు సినీరంగమేకానీ, ఇక్కడ ఏలుతున్న వారిలో చాలామంది మలయాళీ ముద్దుగుమ్మలే! నేరుగా అక్కడినుంచి దిగుమతి అయినవారే! వారి చెంతనే చేరుతుంది 'లై' ముద్దుగుమ్మ మేఘా ఆకాష్. కాకపోతే మేఘా ఆకాష్ పూర్తిగా మలయాళీ భామ కాదు. తల్లి కేరళ, తండ్రి ఆంధ్ర. మేఘా పుట్టింది మాత్రం చెన్నై. ఇలా మూడు ప్రాంతాల వారసత్వాన్ని కల బోసుకున్న మేఘా ఆకాష్ తన తొలి సినిమాతోనే ప్రేక్షకుల హృదయాల్లో చెరగని ముద్ర వేసుకుంది. తన సినీరంగ ప్రవేశం గురించి మేఘా మాటల్లో...



**'లై' సినిమా సక్సెస్‌ను బాగా ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?**

మొదటి సినిమా సక్సెస్ ఎవరికైనా గొప్ప ఆనందాన్నే కాదు, మంచి ఉత్సాహాన్నీ ఇస్తుంది. ప్రస్తుతం నేను దాన్నే అనుభవిస్తున్నాను. కాకపోతే ఈ సినిమా నా మొదటి సినిమా కాదు. కోలీవుడ్‌లో రెండు సినిమాలు చేశాను. కొన్ని కారణాల వలన వాటి విడుదల ఆలస్యం అయింది. దాంతో తెలుగులో నేను చేసిన 'లై' సినిమానే నా మొదటి సినిమా అయింది. నా తొలి సినిమాను ఇంతగా ఆదరించినందుకు చాలా సంతోషంగా ఉంది.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

ల్యాప్‌టాప్‌తో వచ్చింది. నా ఫొటోలు గౌతమ్‌మీనన్‌గారి ల్యాప్‌టాప్‌లో ఉన్నాయి. ఒకసారి ఆయన హైదరాబాద్ వచ్చినప్పుడు వాటిని నితిన్‌గారికి చూపించారట! వెంటనే నితిన్‌గారు 'లై' సినిమా దర్శకులు హను రాఘవపూడిగారికి చూపించారు. నా ఫొటోలు నితిన్‌గారికీ, హనుగారికీ నచ్చడంతో వెంటనే నన్ను ఎంపిక చేశారు. అలా ల్యాప్‌టాప్ కారణంగా తెలుగులో నాకు అవకాశం వచ్చింది.

**నిజజీవితంలో ఎలా ఉంటారు?**

'లై' సినిమాలో చైత్ర పాత్రకూ, నిజజీవితంలో నాకూ ఎలాంటి పోలిక ఉండదు. సినిమాలో నేను చలాకీగా కనిపిస్తాను. నిజానికి నేను బయట చాలా రిజర్వ్‌డ్‌గా ఉంటాను. పెద్దగా ఎవరితో కలవను. నా స్వభావానికి విరుద్ధమైన పాత్ర చేయడం మొదట్లో కొద్దిగా ఇబ్బంది అనిపించినా, షూటింగ్ మొదలయ్యాక ఈజీగా చేయగలిగాను.

**ఈ సినిమా హీరో, దర్శకుల గురించి...**

ఎంత చెప్పినా తక్కువే! సినిమా షూటింగ్ సమయంలో నితిన్ అందించిన సహకారం మరచిపోలేనిది. తనతో చేయడం చాలా సౌకర్యంగా ఉంటుంది. అందుకే తన తరువాతి సినిమాలో కూడా నేనే హీరోయిన్‌గా చేయబోతున్నాను. దర్శకులు హను రాఘవపూడిగారి గురించి చెప్పాలంటే ఎంత చెప్పినా తక్కువే! షూటింగ్ సమయంలో నాకు తెలియని ఎన్నో విషయాలను చాలా ఓపికగా చెప్పేవారు. కొన్నిసార్లు విసిగించి ఉంటాను కూడా! కానీ ఆ విసుగు ఎక్కడా కనిపించకుండా ఓపికగా చెప్పేవారు.

**మీకు ఈ అవకాశం రావడానికి పరోక్షంగా సహాయం చేసిన గౌతమ్‌మీనన్ గురించి...**

ఈ విషయంలో ఆయనకి చాలాసార్లు కృతజ్ఞతలు తెలియజేశాను. వాస్తవానికి ఆయన సినిమాలో చేయాలి. కానీ కొన్ని కారణాల వలన ఆ అవకాశం మిస్ అయింది. త్వరలోనే ఆయన సినిమా చేయబోతున్నాను.

**రామ్ సినిమా నుంచి తప్పుకున్నారట?**

గౌతమ్‌మీనన్‌గారి సినిమా కోసమే రామ్‌గారి సినిమా నుంచి తప్పుకున్నాను. డేట్లు అడ్జస్ట్ కాలేదు. రెండు సినిమాలు దాదాపు ఒకేసారి మొదలవుతాయి. అందుకే చేయనన్నాను. భవిష్యత్తులో రామ్‌గారితో తప్పకుండా నటిస్తాను.

**అభిమాన హీరోయిన్లు...**

దక్షిణాదిన త్రిష. తన నటన నాకు చాలా నచ్చుతుంది. ఎలాంటి పాత్రలోనైనా ఇట్టే ఒదిగిపోతుంది. బాలీవుడ్‌లో ఆలియా భట్. కుటుంబ నేపథ్యం నుంచి కాకుండా స్వయంగా పైకి వచ్చిన హీరోయిన్ తను.

**ఎలాంటి పాత్రలు చేయాలనుకుంటున్నారు?**

తెలుగులో ఇప్పుడిప్పుడే నా ప్రయాణం మొదలైంది. మంచి పాత్ర వస్తే చేయడానికి రెడీ! అదే సమయంలో గ్లామర్ పాత్రలు కూడా చేస్తాను. ఎందుకంటే యూత్‌కి దగ్గర కావాలంటే గ్లామర్ పాత్రలు తప్పనిసరి అని నా అభిప్రాయం. గ్లామర్ పేరుతో అసభ్యంగా చూపిస్తానంటే మాత్రం ఒప్పుకోను.

–దేవి

## సరదాగా....

### నన్ను విననివ్వండి

చరణ్ ఆఫీసు నుంచి లేటుగా ఇంటికి వచ్చాడు. భార్య ఏమంటుందోనని తనే ముందుగా కారణం చెప్పటానికి రెడీ అయిపోయాడు. "డార్లింగ్... నేను ఆఫీసు నుంచి వస్తుండగా దారిలో ఒక గాడిదా...".

అని ఏదో చెప్పబోయాడు. ఇంతలో అతని కూతురు పింకీ "మమ్మీ... అన్న నా బొమ్మను విరగ్గొట్టాడు..." అంటూ ఏడుపు లంకించుకుంది. చరణ్ కూతుర్ని సముదాయించి, భార్య దగ్గరకొచ్చి, "ఆ.... ఎక్కడ ఆగిపోయాను... నేను వస్తుండగా దారిలో ఒక గాడిదా..."

ఈసారి కొడుకు బన్నీ లేచి "మమ్మీ నా కారును పింకీ విసిరేసింది" అంటూ కోపంగా పింకీని కొట్టబోయాడు. అసలే భర్త ఆలస్యంగా వచ్చాడని కోపం మీద ఉన్నదేమో, భార్య వాడికి నాలుగు తగిలించి, "మీరిద్దరూ నోళ్ళు మూయండి. ముందు నన్ను ఈ గాడిద మాట విననివ్వండి" అంటూ భర్తదగ్గరకొచ్చింది.

### ఒక ప్రశ్న?

కీన్...! డిటెక్టివ్ ఆది నడుపుతున్న ప్రైవేట్ డిటెక్టివ్ ఏజెన్సీ. చిన్న చిన్న దొంగతనాల నుంచి పెద్ద పెద్ద హత్యానేరాల వరకూ పరిశోధిస్తుంటాడతను. ఒక రోజు అతను ఆఫీసులో ఉండగా, జయనగర్ కాలనీలో ఎవరో ఆత్మహత్య చేసుకున్నారని ఫోన్ వస్తే, తన అసిస్టెంట్లతో అక్కడికి వెళ్ళాడు ఆది. నాలుగంతస్తుల భవంతి అది. ఇంటిముందు లాన్‌లో శవం బోర్లాపడి ఉంది. అప్పటికే అక్కడికి చేరుకున్న పోలీసులతో మాట్లాడి వివరాలు తెలుసుకున్నాడు. అతను కిటికీ నుంచి దూకి ఆత్మహత్య చేసుకున్నట్టుగా చెప్పారు పోలీసులు. పైకి చూశాడు ఆది. శవం పడివున్న వైపు ఉన్న గదులన్నిటికి, నాలుగంతస్తుల్లోనూ కిటికీలున్నాయి. తన అసిస్టెంట్లకు క్లూస్ కలెక్ట్ చేయమని చెప్పి, తాను మొదటి ఫ్లోర్‌కి వెళ్ళాడు. శవం పడివున్న దిశగా ఉన్న గదిని చేరి, ఓ సిగరెట్టు వెలిగించాడు. నెమ్మదిగా ఆ గది కిటికీ తెరచి, కిందికి చూసి, సిగరెట్ పీకను బయటకు విసిరేశాడు. తరువాత రెండో ఫ్లోర్‌లోకి వెళ్ళి అదేవిధంగా చేశాడు. మూడు, నాలుగు ఫ్లోర్స్ చేరుకొని అదేవిధంగా అంటే కిటికీ తలుపు తెరవడం, సిగరెట్ వెలిగించడం, కిటికీలో నుంచి సిగరెట్ పీక పడేయడం చేశాడు. అన్ని ఫ్లోర్లూ అయిపోయాక, తీరిగ్గా లిఫ్ట్‌లో కిందకి దిగాడు. ఇన్‌స్పెక్టర్‌ని కలిసి, ఇతను ఆత్మహత్య చేసుకోలేదు... ఇతన్ని ఎవరో హత్య చేశారు అన్నాడు ఆది. అంతే అక్కడున్న వారంతా ఆశ్చర్యపోయారు. అసలు అతను ఆత్మహత్య చేసుకోలేదని ఆది ఎలా కనిపెట్టాడు? సమాధానం ఆలోచించండి మరి.

**సమాధానం**

ఆది నాలుగుఫ్లోర్లూ తిరిగి శవం పడివున్న దిశవైపు ఉన్న గది కిటికీలు తానే స్వయంగా తెరిచాడు. ఒకవేళ చనిపోయినతను ఆత్మహత్య చేసుకునుంటే, కిటికీ తలుపులు తెరిచే ఉండాలి. అంటే అతనితో పాటు ఇంకెవరో ఉండి ఉండాలి. ఇలా ఆలోచించి చనిపోయినతను హత్య చేయబడ్డాడు అని చెప్పాడు ఆది.
















8

## తల్లికి తెలియకుండానే పుట్టేశారు

ఆమె యుద్ధరంగంలో ఓ సైనికురాలు. తాను గర్భవతినని ఆమెకు తెలియదు! యుద్ధరంగంలోనే బిడ్డకు జన్మనిచ్చింది. మరొకామె విమానంలో ప్రయాణిస్తూ బిడ్డకు జన్మనిచ్చింది. ప్రెగ్నెంట్ అనే విషయమే ఆమెకు తెలియదు. ఎందరో స్త్రీలకు ఇలాగే జరిగింది. ఆ వింతలేమిటో చదవండి

38

### ఇలా కూడా బతికేస్తున్నారు!

ఏ జీవికైనా తిండి, నిద్ర, నీరు అవసరం. కానీ కొందరు మనుషులు మాత్రం ఎన్నో ఏళ్ళుగా కేవలం గాలిభోంచేస్తూ బతికేస్తున్నారు! వారి జీవన రహస్యం ఏమిటో తెలుసుకుందాం!

54

### బుల్లిపెట్టెలో బ్లూవేల్ ఛాలెంజ్

ఓ రష్యన్ సైకో అంతర్జాలంలో మృత్యుక్రీడకు తెరతీశాడు. ప్రపంచదేశాల్లో ఇప్పటికే ఎందరో దీనిబారినపడి మరణించారు. ఇదిప్పుడు మనదేశానికీ పాకింది.

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: కాజల్ అగర్వాల్
ఫోటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### పరీక్ష

అమెరికన్ సీక్రెట్ సర్వీస్ సంస్థ సిఐఎకు కిరాయి హంతకులు కావాల్సి వచ్చారు. పాల్గొన్న అందరినీ పరిశోధించి, చివరాఖరి పరీక్షకి ఇద్దరు మగాళ్ళనూ, ఒక స్త్రీనీ ఎంపిక చేశారు. ఎంపిక చేసిన ఆ ముగ్గురినీ తలుపు మూసిన ఓ గది దగ్గరకు తీసుకుని వచ్చారు. చెప్పారిలా.

"మేము చెప్పిందాన్ని మీరు తు.చ. పాటిస్తున్నదీ లేనిదీ తెలుసుకునేందుకే ఈ పరీక్ష."

మొదటిమగాడికి ఓ గన్ను ఇచ్చారు అధికారులు.

"లోపల నీ భార్య ఉంది. ఆమెను ఈ గన్నుతో నువ్వు కాల్చి చంపాలి, వెళ్ళిరా." అన్నారు.

"అసాధ్యం. కట్టుకున్నభార్యను ఎవరైనా కాల్చి చంపుతారా? నావల్ల కాదు." అన్నాడతను.

"అయితే నువ్వు మాకు పనికిరావు. వెళ్ళిపోవచ్చు." అన్నారతన్ని. రెండో మగాణ్ణి పిలిచారు. అతనికీ అదే మాట చెప్పారు.

"లోపల నీ భార్య ఉంది. ఆమెను ఈ గన్నుతో నువ్వు కాల్చి చంపాలి, వెళ్ళిరా."

సరేనని గన్ తీసుకుని ధైర్యంగా గదిలోనికి వెళ్ళాడతను. వెళ్ళి చాలా సేపైంది. గన్ పేలిన శబ్దంకానీ, కేకలు కానీ ఏవీ వినరాలేదు. కాసేపటికి కన్నీళ్ళతో ఆ మగాడు గదిలోంచి బయటికి వచ్చాడు. చెప్పాడిలా.

"గుండెను ఎంతగా రాయి చేసుకుందామన్నా నావల్ల కాలేదు. నా భార్యను నేను చంపలేకపోయాను" అన్నాడు.

"అయితే నువ్వు కూడా మాకు పనికిరావు. వెళ్ళిపోవచ్చు." అన్నారు. స్త్రీవంతు వచ్చిందిప్పుడు. ఆమెకు చెప్పారిలా అధికారులు.

"లోపల మీ భర్త ఉన్నాడు. అతన్ని ఈ గన్నుతో మీరు కాల్చి చంపాలి."

"తప్పకుండా" అన్నది స్త్రీ. గదిలోనికి వెళ్ళింది. గన్ పేలిన శబ్దాలు వినవచ్చాయి. తర్వాత దభీదభీ గుభీగుభీమన్న శబ్దాలు కూడా వినవచ్చాయి. ఆ తర్వాత అరుపులూ కేకలు కూడా వినవచ్చాయి. కాసేపటికి అలసి, చెమటలుపట్టిన స్త్రీమూర్తి గదిలోంచి బయటికి వచ్చింది. ఉస్సురని నిట్టూర్చింది. నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుంటూ అధికారులతో అన్నదిలా.

"ఏంటండీ ఆ గన్ను. పేలిస్తే సౌండ్ తప్ప బుల్లెట్లు రావట్లేదందులోంచి. దాంతో ఏం చెయ్యాలో తెలియక నా భర్తను గోడకేసి బాది, అక్కడ ఉన్న కుర్చీతో మోది మోది చంపాను. ఓకేనా ఇప్పుడు?"

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 27

6-9-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

### ప్రేమ:వృత్తి

పుట్టి పెరిగిన ఊరు. పెద్దది అయింది. ప్రముఖమైంది. పర్యాటకస్థలం అయింది. దానిని చూడాలని ఒకటే కోరిక. వెళ్తానంటే అక్కడ ఎవరున్నారు? ఎక్కడ ఉంటావు? లాంటి ప్రశ్నలు ఎదురవుతాయని భర్త రాయుడిని అడిగిన పాపానపోలేదామె. వూరుకున్నది. అలా వూరుకుంటూనే అరవయ్యో ఏట అడుగుపెట్టింది. రాయుడి ఆశీస్సులు తీసుకుంది. పుట్టిన రోజు కానుక, దేవిగారికి ఏం కావాలో? కోరుకోమన్నట్టుగా పలికాడు రాయుడు. అదే అవకాశంగా అడిగిందామె. పుట్టి పెరిగిన ఊరు చూడాలన్నది. ఆమె ఊహించినట్టుగా అక్కడ ఎవరున్నారు? ఎక్కడ ఉంటావు? లాంటి ప్రశ్నలు ఎదురుకాలేదు. బయల్దేరండి మరి అన్నాడంతే రాయుడు.

కార్లో బయల్దేరారిద్దరూ. శివసతీపురానికి ఏభై కిలోమీటర్లదూరంలో ఉంది పాలెం. అక్కడంతా ఆకుపచ్చదనమే! ఎటు చూసినా జలపాతమే! ఆ అందాలుసహా ఎన్నో వందలయేళ్ళనాటి సూర్యాలయం ఉన్నదక్కడ. ఆ దేవుణ్ణి దర్శించుకోవాలి. ఉబలాటపడిందామె. పర్వతప్రాంతం. ఏ క్షణం పాలెంలో వర్షం పడుతుందో ఏ క్షణం పడదో చెప్పడం కష్టం. గొడుగుపట్టినట్టు పాలెంను మబ్బు పట్టి ఉంటుందెప్పుడూ.

చలిగాలి వీస్తోంది. సన్నగా వర్షం కురుస్తోంది. సాయంత్రం అయిదుగంటలైంది. అప్పుడక్కడకి చేరుకున్నారు రాయుడు దంపతులు. చేరుకుంటూనే ముందుగా సూర్యుణ్ణి దర్శించుకున్నారు. తర్వాత పాడుబడిన తండ్రులూ, తాతల దేవిడీలను చూశారు. అక్కడ తాను ఆడుకున్న స్థలాలను చూపించిందామె. దాచుకున్న చందనపుబొమ్మలకోసం వెదకి చూసింది. లేవు. బాధపడింది. ఓదార్చి, పదండి అన్నాడు రాయుడు. వెనుతిరిగి వస్తోంటే గాలివాన ప్రారంభం అయింది. పాలెంలో ఆ రాత్రి ఉండక తప్పని పరిస్థితి ఏర్పడింది.



పెద్దహోటల్స్ నాలుగైదు ఉన్నాయి. వాటిలో రూంకోసం ప్రయత్నించి చూశారు. లేవు. ఓ చిన్నహోటల్ ఉంది. అక్కడా అడిగి చూశారు. లేవన్నాడు మేనేజర్. శని, ఆదివారాలు సెలవులుకావడం, సూర్యాలయంలో ఏవో ఉత్సవాలు జరగడం... పాలెంకు పర్యాటకులు పెరిగారన్నాడు. సారీ చెప్పాడు. హోటల్ చిన్నదైనా పరిశుభ్రంగా ఉంది. ప్రశాంతంగా ఉంది. మేనేజర్ కుర్రాడైనా మర్యాదగా ఉన్నాడు అనుకుని, రాయుడు వెళ్ళబోతూ ఉంటే సార్ అని పిలిచాడు మేనేజర్. ఈ గాలివానలో ఎక్కడకి వెళ్తారు? మీకు అభ్యంతరం లేదనుకుంటే ఓ పని చెయ్యండి. మేనేజర్ రూం అంటూ నాకో రూం ఉందిక్కడ. చిన్నదైనా పర్వాలేదు, బాగుంటుంది. ఏసి కూడా ఉంది. ఎడ్జస్ట్ అవుతామంటే రండి, చూపిస్తాను అన్నాడు మేనేజర్. చూపించాడు. బాగానే ఉంది. సరిపెట్టుకున్నారు రాయుడుదంపతులు. వేడిగా కాఫీ పంపుతారా? అడిగారు. కాఫీ రెస్టారెంట్ క్లోజయిపోయింది సార్! మీకు అభ్యంతరం లేదనుకుంటే అదిగో అక్కడ నా ఫ్లాస్కు ఉంది. అందులో ఇంటినుంచి నేనుతెచ్చుకున్న అల్లంటీ ఉంది. తాగుతానంటే తాగొచ్చు అన్నాడు మేనేజర్. నవ్వి, టీ తీసుకున్నాడు రాయుడు.

ఆ రాత్రి గడిచింది. తెల్లారింది. రాయుడు బయల్దేరుతూ హోటల్‌బిల్ పే చేసేందుకు మేనేజర్‌ని కలిశాడు. డిన్నర్‌బిల్ మాత్రమే పే చెయ్యమన్నాడు మేనేజర్. రూంరెంట్ అవేవీ అక్కరలేదన్నాడు. మీరిద్దరూ నా గెస్ట్సార్. మీరు హోటల్‌రూంలో లేరు, నా రూంలో ఉన్నారన్నాడు. పార్వతీపరమేశ్వరుల్లా ఉన్నారు, వెళ్ళిరండన్నాడు. నేనంటూ హోటల్ పెడితే దానికి నువ్వే మేనేజర్‌వి అన్నాడు రాయుడు. థాంక్యూ అన్నాడు మేనేజర్. పెద్దగానవ్వాడు. ఆ నవ్వుకి ఆరేళ్ళ వయసొచ్చింది. అప్పుడతనికో ఫోన్ వచ్చింది. రాయుడు మాట్లాడాడు. బయట కారు సిద్ధంగా ఉంది. కారెక్కి పట్నానికి రమ్మని ఆహ్వానించాడు. వచ్చాడు మేనేజర్. హోటల్ రాయుడు అని పేరు గల ఓ పెద్ద హోటల్ ముందు కారాగింది. చూసి ఆశ్చర్యపోయాడు మేనేజర్. వెల్‌కం చెబుతున్నట్టుగా కార్‌డోర్ తీసి నిల్చున్న రాయుడుని చూసి ఇంకా ఆశ్చర్యపోయాడతను. ఈ హోటల్‌కి నువ్వే మేనేజర్‌వి అన్నాడు రాయుడు. మేనేజర్ భుజమ్మీద ఆప్యాయంగా చేయి వేసి ముందుకు నడిచాడు.

వృత్తికన్నా ప్రేమగొప్పది! ప్రేమించడమే పెద్దవృత్తి!

నవ్య




**బుధవారం: 30 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** నవమి తె. 5.17 తదుపరి దశమి

**నక్షత్రం:** జ్యేష్ఠ రా. 1.53 తదుపరి మూల

**వర్జ్యం:** శే. ఉ. 7.03 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 11.52 నుంచి 12.41 వరకు

**అమృతఘడియలు:** సా. 4.01 నుంచి 5.48 వరకు

**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు

**సూర్యోదయం:** 6.05

**సూర్యాస్తమయం:** 6.27

**గురువారం: 31 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** దశమి పూర్తి

**నక్షత్రం:** మూల తె. 4.47 తదుపరి పూర్వాషాఢ

**వర్జ్యం:** ఉ. 10.51 నుంచి 12.39 వరకు, రా. 2.59 నుంచి 4.47 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 10.12 నుంచి 11.02 వరకు, మ. 3.09 నుంచి 3.58 వరకు

**అమృతఘడియలు:** రా. 9.37 నుంచి 11.25 వరకు

**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు

**సూర్యోదయం:** 6.05

**సూర్యాస్తమయం:** 6.27

**శుక్రవారం: 1 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** దశమి ఉ. 7.37 తదుపరి ఏకాదశి

**నక్షత్రం:** పూర్వాషాఢ పూర్తి

**వర్జ్యం:** మ. 3.26 నుంచి 5.12 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.33 నుంచి 9.23 వరకు, మ. 12.40 నుంచి 1.30 వరకు

**అమృతఘడియలు:** రా. 2.05 నుంచి 3.52 వరకు

**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు

**సూర్యోదయం:** 6.05

**సూర్యాస్తమయం:** 6.26

**శనివారం: 2 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** ఏకాదశి ఉ. 9.23 తదుపరి ద్వాదశి

**నక్షత్రం:** పూర్వాషాఢ ఉ. 7.24 తదుపరి ఉత్తరాషాఢ

**వర్జ్యం:** సా. 4.08 నుంచి 5.53 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 6.06 నుంచి 6.55 వరకు

**అమృతఘడియలు:** రా. 2.38 నుంచి 4.23 వరకు

**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు

**సూర్యోదయం:** 6.06

**సూర్యాస్తమయం:** 6.25

**ఆదివారం: 3 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** ద్వాదశి ఉ. 11.13 తదుపరి త్రయోదశి

**నక్షత్రం:** ఉత్తరాషాఢ ఉ. 9.37 తదుపరి శ్రవణం

**వర్జ్యం:** మ. 1.54 నుంచి 3.37 వరకు

**దుర్ముహూర్తం:** సా. 4.46 నుంచి 5.35 వరకు

**అమృతఘడియలు:** రా. 12.11 నుంచి 1.53 వరకు

**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు

**సూర్యోదయం:** 6.06

**సూర్యాస్తమయం:** 6.24

**సోమవారం: 4 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** త్రయోదశి మ. 12.15 తదుపరి చతుర్దశి

**నక్షత్రం:** శ్రవణం ఉ. 11.18 తదుపరి ధనిష్ఠ

**వర్జ్యం:** మ. 3.29 నుంచి 5.09 వరకు

**దుర్ముహూర్తం:** మ. 12.39 నుంచి 1.28 వరకు, మ. 3.07 నుంచి 3.56 వరకు

**అమృతఘడియలు:** రా. 1.32 నుంచి 3.12 వరకు

**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు

**సూర్యోదయం:** 6.06

**సూర్యాస్తమయం:** 6.24

**మంగళవారం: 5 సెప్టెంబర్ 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**

**తిథి:** చతుర్దశి మ. 12.41 తదుపరి పూర్ణిమ

**నక్షత్రం:** ధనిష్ఠ మ. 12.24 తదుపరి శతభిషం

**వర్జ్యం:** రా. 7.46 నుంచి 9.24 వరకు

**దుర్ముహూర్తం:** ఉ. 8.33 నుంచి 9.22 వరకు, రా. 10.13 నుంచి 10.58 వరకు

**అమృతఘడియలు:** తె. 5.35 మొదలు

**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు

**సూర్యోదయం:** 6.06

సూర్యాస్తమయం: 6.23

## మెయిల్ బాక్స్

### గుండెచాటు మనసు మాయ

మనిషికి ఎన్నో రకాల అనుభవాలు, ఆటుపోట్లు, కష్టసుఖాలు పరిస్థితులవల్ల, వ్యక్తులకారణంగా ఎదురవుతాయి. మరికొన్ని ఆటుపోట్లు మాత్రం మనసుచాటు సర్కస్ మాయాజాలం కారణంగా ఎదురవుతాయి. ఈ వారం మొదటిపేజి 'సర్కస్' చిన్నకథ ద్వారా ఈ విషయమే తెలిసింది. సర్కస్‌లోని వింతలు, విడ్డూరాలు చూడాలనుకునే బాబు తండ్రితో బయలుదేరడం, టిక్కెట్టుకోసం జనం హడావుడి, తొక్కిసలాటలో బాషా అంకుల్ నేలమీద పడివున్నట్టు బాబు చూడటం, డబ్బు పోగొట్టుకున్న బాషాకు బాబుతండ్రి తనడబ్బు ఇవ్వడం, తండ్రిని కౌగలించుకుని బాబు ముద్దాడటం చదివాం. తండ్రి ఔదార్యం, మంచితనం అర్థంచేసుకున్న కొడుకు ఉండటం ఆ తండ్రికే గర్వకారణం అని భావించాం. సర్కస్ భాషలో చెప్పాలంటే, అది నిజంగా గుండె చాటు మనసు కలిగించే ఆనందమే మరి! కాసేపు గుండెను కుదిపేసి కళ్ళను చెమరింపజేయడం కూడా మనసు కదలికలో ఓ తిరకాసు! ఈ కథలో చివరి పేరాలోని వాక్యాలు నిత్య సత్యాలు. అందుకే మనసులో ఏదైనా ఓ ప్రవాహంగా సాగుతుంది. మంచికథ అందించిన జగన్నాథశర్మగారికి ధన్యవాదాలు.

**–భమిడి వెంకటేశ్వర్లు, మెహదీపట్నం, హైదరాబాద్–28**

### ఎన్ని మార్పులు ఎన్నెన్ని ఆకర్షణలు!

చాలా కాలం తర్వాత నవ్య వీక్లీ చదివాను. ఎన్ని మార్పులు, ఎన్ని ఆకర్షణలు! ఎన్నెన్నో విషయాలతో వెలువడుతున్న నవ్యవీక్లీలో మార్పు ఊహించనిది. నిజం చెప్పాలంటే పాఠకులను మెప్పించాలంటే ఇన్ని ఆకర్షణలు ఉండాలి.

**–కరణం శివానందరావు, కళానిలయం, కర్నూలు**

### సీరియల్స్ ఆసక్తికరం

అన్వేషణ, నిధి సీరియల్స్ చాలా ఆసక్తికరంగా ఉంటున్నాయి. రోల్‌మోడల్స్ కథ చాలా బాగుంది. 'ఆరోగ్యమే మహాభాగ్యం' ఫీచర్‌లో కెఫిన్ ఆరోగ్యానికి ఎలా మేలుచేస్తుందో తెలుసుకున్నాం. కార్టూన్లు బాగుంటున్నాయి. సినిమాల కబుర్లు బాగుంటున్నాయి.

**–ఎస్.కె.యాకుబ్‌పాషా, ఖమ్మం**

### సలీం సీరియల్‌కే అగ్రతాంబూలం

'రోల్‌మోడల్స్' కథ ఈనాటి మన వ్యవస్థలోని లోటుపాట్లను చక్కగా తెలియజేసింది. సూర్యం లాగే బాధపడటం మినహా మనం ఏమీ చేయలేమా? అని అనిపిస్తోంది. సీరియల్స్ అనన్యసామాన్యంగా ఉంటూ ఆసక్తికరంగా చదివిస్తున్నాయి. సలీంగారి 'అన్వేషణ' సీరియల్‌కు అగ్రతాంబూలం ఇవ్వకతప్పదు.

*–గుంటూరు శ్రీహరిరావు, గంగవరంగ్రామం, నెల్లూరుజిల్లా*

### హరివంశం బాగుంది

జగద్గురువు శ్రీమహావిష్ణువు కథ హరివంశం చాలా బాగుంది. కథనం తీరు, వర్ణన చాలా బాగుంది. మురళీ మోహన్ జీవితకథ సరళంగా సాగిపోతోంది. ఎంతటి వాడికైనా చావుతప్పదన్నట్లు పాకిస్థాన్‌లో నవాజ్ షరీఫ్ తొలగింపు అంతే. ఆగస్టు 15 శుభాకాంక్షలు.

**–వాస్తు రామచంద్ర, నెల్లూరు**

### సెల్ఫ్ వెడ్డింగ్ ఓ వింత

జీవితంలో నిరాశా నిస్పృహలకు గురైన ఒంటరి మహిళలు తమను తామే పెళ్ళి చేసుకునే సెల్ఫ్ వెడ్డింగ్ విధానం చాలా విచిత్రంగా అనిపించింది. బాధ కలిగింది. సమాజంపట్ల విసిగివేసారిపోయిన మహిళల జీవిత అనుభవాలు వారిని అలాంటి పరిస్థితుల్లోకి నెట్టాయేమో అనిపించింది. ఒంటరి స్త్రీ జీవితంలో ఎవరినీ నమ్మలేని పరిస్థితులు రావడం మరొక కారణం.

**–వల్లీపద్మావతి, ఎస్సార్‌నగర్, హైదరాబాద్**

# హ్యూమన్ లైబ్రరీ !

లైబ్రరీ అనగానే మనకు గుర్తుకువచ్చేవి పుస్తకాలు. కానీ అక్కడ పుస్తకాలు ఏమీ ఉండవు. వాటి స్థానంలో మనుషులు ఉంటారు. వాళ్లే మనకు అనేక సందేహాలు తీరుస్తారు. లండన్‌లో మొదలైన ఈ హ్యూమన్ లైబ్రరీలో వివిధ విషయాలను పుస్తకాల నుంచి కాకుండా మనుషుల నుంచి తెలుసుకోవచ్చు. ఈ హ్యూమన్ లైబ్రరీ ఆలోచన ప్రపంచమంతటా విస్తరించింది. మనదేశంలో ఈ హ్యూమన్ లైబ్రరీ హైదరాబాద్‌లో ఒకటి ఉంటే మరోటి నోయిడాలో ఉంది. అసలు ఈ హ్యూమన్ లైబ్రరీ ఏంటి, ఎక్కడ ప్రారంభమైంది దానికి సంబంధించిన విషయాలను మీరూ తెలుసుకోండి మరి!

### ఎక్కడ ప్రారంభమైందంటే?

అసలీ హ్యూమన్ లైబ్రరీ అనే కాన్సెప్ట్‌ను కోపెన్‌హాగన్‌కు చెందిన రోన్నీ అబెర్గెల్ అభివృద్ధి చేశారు. ఈ కాన్సెప్ట్ స్టాప్ ది వైలెన్స్ అనే యువత నడిపే ఉద్యమంలో భాగంగా ఏర్పడింది. ఒకరితో ఒకరు తమ జీవితంలోని అనుభవాలు పంచుకోవడం ద్వారా ప్రజలు ఇతరుల సమస్యలు అర్థం చేసుకుని, వారు చెప్పే విషయాల ద్వారా ఇతరులలో స్ఫూర్తిని నింపడం, ప్రజల నుంచి అవసరమైన సహకారం పొందడంకోసం ఈ మార్గాన్ని ఎంచుకున్నారు. పదహారేళ్ళ క్రితం రెండు రోజుల కార్యక్రమంగా ప్రారంభమైన ఈ హ్యూమన్ లైబ్రరీ కాన్సెప్ట్ ఇప్పుడు 70 దేశాలకు వ్యాపించింది.

### తెలుగు లోగిలిలోకి

కొందరు విద్యార్థులు కలిసి హైదరాబాద్‌లో ఈ హ్యూమన్ లైబ్రరీ కాన్సెప్ట్‌ను నడిపిస్తున్నారు. కమ్యూనిటీ కథల ద్వారా సమాజంలో మార్పు తీసుకొచ్చే పనిలోపడ్డారు. పదీపదిహేనుమంది కలిసి హ్యూమన్ బుక్స్‌కి కొన్ని అంశాలను అనుకుంటారు. తర్వాత వాటిపై కొంత పరిశోధన చేస్తారు. హ్యూమన్ బుక్స్‌గా ఉండాలి అనుకునేవారు మొదటగా హ్యూమన్ లైబ్రరీ వెబ్‌సైట్‌లో తమ పేరును నమోదు చేసుకోవాలి. అక్కడ ఒక ఫారం పూర్తి చేయాలి. వారి నుంచి పదిమందికి పైగా హ్యూమన్ బుక్స్‌ని ఎంపికచేస్తారు. నిర్వహించబోయే కార్యక్రమంలో మరో పది హ్యూమన్ బుక్స్‌ని కలిపి, వీరందరితో ఒక క్యాటలాగ్ తయారుచేస్తారు. అంశానికి తగ్గట్టు ఒక్కో పుస్తకానికీ ఒక్కో పేరు పెట్టుకుంటారు. చదవాలనుకునే వారు క్యాటలాగ్‌లోని ఒక పుస్తకాన్ని ఎంచుకోవచ్చు. 20 నిమి



షాలు ఆ పుస్తకాన్ని చెక్ చేసుకోవచ్చు. ఆ తర్వాత చదవొచ్చు. 'పుస్తకం' కథ చెప్పడం అయిన తర్వాత సందేహాలుంటే అడగొచ్చు.

### అనుభవాల్నే కథలుగా

జీవితానుభవాల్ని కథలుగా చెప్పాలనుకునే ప్రతిఒక్కరూ ఈ హ్యూమన్ లైబ్రరీకి ఆహ్వానితులే. మన కథల్ని అపరిచితులతో పంచుకోవడం ఒక మంచి అనుభూతి. ఇలా ఇతరులకు కథలు చెప్తుంటే వినేవారు కూడ చాలా ఆసక్తిగా ప్రశ్నలు అడుగుతుంటారు. వాళ్లు కూడా వారికి ఎదురైన అనుభవాలను ఇతరులతో చెప్పడానికి ఆసక్తి చూపుతారు. అప్పటి వరకూ వారికున్న ఆలోచనా సరళిలో ఎంతోకొంత మార్పును ఆస్వాదిస్తారు. సమాజంలో ఎంతోమంది వివిధరకాల సమస్యలతో బాధపడుతున్న వేళ, ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లో జీవిత కథనాలను పంచుకోవడం అత్యవసరం.

నవ్య





# తల్లికి తెలియకుండానే పుట్టేశారు







**బిడ్డకు జన్మనివ్వడం మామూలు విషయం కాదు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకుంటూ, శారీరకంగా మానసికంగా అనేక ఇబ్బందులు ఎదుర్కొంటూ, నెలనెలా ఎప్పటికప్పుడు జాగ్రత్తలు తీసుకుంటూ, నవ మాసాలూ మోసి నొప్పులు ఓర్చుకుని పండంటి బిడ్డకు జన్మనిస్తుంది తల్లి.**

**బిడ్డను కనడానికి నవమాసాలు ఎప్పుడు నిండుతాయా అని ఎదురుచూస్తూ ఉంటుంది తల్లి. కానీ అవేవీ లేకుండానే అసలు తల్లికి తాను గర్భవతినని తెలియకుండానే బిడ్డ పుట్టేస్తే...! ఏంటి అవాక్కయ్యారా? అలా ఎక్కడైనా జరుగుతుందా? అని ఆశ్చర్యపోతున్నారా?**

**అవును ఈ నొప్పులు, బాధలేవీ లేకుండానే, దినచర్యలు చేసుకునే తల్లి గ్రోసరీషాప్‌కి వెళ్ళి అక్కడే ఓ బిడ్డకు జన్మనిచ్చేస్తే..? డాక్టర్‌తో టెస్ట్ చేయించుకుని ప్రెగ్నెంట్ కాదని నిర్ధారణయ్యాక ఊరికి బయల్దేరిన ఓ తల్లి విమానం లోనే బిడ్డకు జన్మనిస్తే...? కలిసొచ్చే కాలానికి నడిచొచ్చే బిడ్డ పుడతాడన్నట్లు ఇలా కొందరు తల్లులకు తాము గర్భ వతులమని తెలియకుండానే పండంటి బిడ్డలకు జన్మనిచ్చారు. మరి ఆ వివరాలేంటో మీరూ తెలుసుకోండి!**

ఆప్లే మిల్లర్ క్రాన్, కెనడాకి చెందిన ఓ సాధారణ మహిళ. గతేడాది ఆగస్టులో మిలా అనే పాపకు జన్మని చ్చింది. పదినెలల పాపను ఇంటి దగ్గరే ఉంచి సరుకుల కని సూపర్‌మార్కెట్‌కి వెళ్ళిందామె. అంతలోనే కడుపులో ఏదో పెట్టి గుచ్చుతున్నట్లు విపరీతమైన నొప్పి ప్రారంభ మైంది. ముందు కాస్త తక్కువగానే ఉన్నా ఆ తర్వాత అది ఎక్కువైంది. ఇక తట్టుకోలేక బాత్రూంలోకి పరుగెత్తింది. అక్కడికి వెళ్ళిన కాసేపటికే బిడ్డ బయటకి రావడం ప్రారంభించింది. అప్పటికి గానీ ఆమెకు తెలియలేదు తాను గర్భంతో ఉన్నానని. వెంటనే సహాయం కోసం గట్టిగా అరవడంతో స్టోర్ మేనేజర్ వచ్చి చూసి 911కి కాల్ చేసింది. ఈలోపు స్టోర్‌లో అందుబాటులో ఉన్న డాక్టర్ పరీక్షించి ప్రసవం చేయడానికి సహాయపడ్డారు. ఆ తర్వాత దగ్గర్లో ఆసుపత్రికి తీసుకెళ్ళి చికిత్స చేయిం చారు. అసలు గర్భంతో ఉందన్న విషయం బిడ్డ బయ టకు వచ్చేవరకు ఆ తల్లికి తెలియదు! మొదటి బిడ్డ పుట్టి పదినెలలు అయినా ఇంకా బరువు తగ్గట్లేదన్న ఆలోచన ఆమె మనసులో మెదులుతూనే ఉంది. అయితే గర్భవ తులకు ఉండే లక్షణాలేవీ తనలో లేనందున తను గర్భంతో ఉన్నానని అనుకోలేదట. పైగా ఈ పదినెలల్లో ఒక్కసారి కూడా ఆమె ఆస్పత్రికి వెళ్ళలేదు. ఎలాంటి టెస్ట్‌లూ చేయించుకోలేదు. ఇదిలా ఉంటే సూపర్ మార్కెట్లో పుట్టిన ఈ బిడ్డకు డైపర్స్ ఉచితంగా సరఫరా చేస్తామని ఆ సూపర్‌మార్కెట్ యాజమాన్యం ప్రకటిం చింది. తొమ్మిది నెలలుగా బిడ్డను మోస్తున్న విషయం కూడా తెలియకుండా తల్లైన ఈమె నలుగురితో తన ఆనందం పంచుకోవడానికి ఆ సూపర్‌మార్కెట్లోనే ఈ బాబుతో ఫోటోషూట్ పెట్టేసింది. అక్కడే అతనికి ఎజ్రా అనే పేరు కూడా పెట్టేసింది. ఆ బాబు ఫొటోలు ఇంటర్నెట్‌లో పెట్టడంతో, ఇప్పుడు అంతటా హల్‌చల్ చేస్తున్నాయి ఈ ఫొటోలు.

## విమానంలో ప్రసవం

23 సంవత్సరాల అడాగ్వాన్ తన బాయ్‌ఫ్రెండ్‌తో కలిసి కెనడాలో జపాన్ వెళ్ళే విమానం ఎక్కింది. విమానం కొద్ది దూరం ప్రయాణించగానే ఆమెకు విపరీతమైన కడుపు నొప్పి ప్రారంభమైంది. అదృష్టవశాత్తూ ఆ విమానంలో ముగ్గురు డాక్టర్లు ప్రయాణిస్తుండడంతో, విమాన సిబ్బంది తక్షణం స్పందించి ఆమెను ఫస్ట్‌క్లాస్‌కి పంపించి అక్కడే బిడ్డను బయటకు తీశారు. అయితే విచిత్రమేమిటంటే ఆమెకు తను ప్రెగ్నెంట్ అని తెలియకపోవడం. ఈ

విమానంలో ప్రయాణించడానికి కొద్దిరోజుల ముందే ఆమె రెండుసార్లు ప్రెగ్నెన్సీ టెస్ట్ చేయించుకుంది. రెండుసార్లూ నెగెటివ్ రిపోర్టే రావడంతో ధైర్యంగా ఫ్లైట్ ఎక్కేశానని చెబుతోంది.

### యుద్ధభూమిలో జన్మించాడు

అందరిలా ఈ బాబు ఇంట్లోనో లేక హాస్పిటల్‌లోనో పుట్టలేదు. ఎప్పుడు శత్రుదేశం విరుచుకుపడుతుందో తెలియని, నిరంతరం బాంబులతో హోరెత్తిపోయే యుద్ధభూమిలో ఆ బిడ్డ జన్మించాడు. 2012 సంవత్సరంలో లైనెట్టే పియర్స్ అనే ఓ ఇరవై ఎనిమిది సంవత్సరాల బ్రిటీష్ సైనికురాలు ఈ బాలుడికి ఆఫ్ఘనిస్తాన్‌లోని లష్కర్‌గాహ్‌లో ఉన్న ఎయిర్‌బేస్ సైనిక స్థావరంలో జన్మనిచ్చింది. ఆ బాబు పేరు ఇమ్మాన్యుయల్ ఇజాడోర్ పియర్స్. మామూలుగా ఎవరైనా సైనికులుగా పనిచేస్తున్న మహిళలు ప్రెగ్నెంట్ అని తెలియగానే డెలివరీ కోసం వారిని ఇంటికి పంపిస్తారు కదా, అలా ప్రెగ్నెంట్ మహిళలను యుద్ధరంగంలో ఉంచరు కదా, మరి ఈమెను ఇంటికి పంపలేదా అన్న అనుమానం కలుగుతోందా? నొప్పులతో బాధపడుతూ బిడ్డ జన్మించేవరకు ప్రెగ్నెంట్ అనే విషయమే ఆ స్త్రీకి తెలియలేదట. బరువు పెరిగినట్లు అనిపించినా అది శరీరంలోని కొలెస్ట్రాల్ వల్ల అనుకుని మిలట్రీలో ఉండే అన్ని రకాల శారీరక వ్యాయామాలు చేసేదట. మామూలుగా ప్రెగ్నెంట్‌గా ఉన్న మహిళలు బరువులు ఎత్తడాలు, ఎక్కువ దూరం నడవడాలు లాంటి పనులేవీ చేయరు, కానీ లైనెట్టే తాను ప్రెగ్నెంట్ అన్న విషయం తెలియకపోవడం వల్ల ఎనిమిది మైళ్లు, 35పౌండ్ల బరువున్న బ్యాక్‌ప్యాక్‌ను వేసుకుని నడిచింది. అలా యుద్ధభూమిలో జన్మించిన ఆ బాలుడు ఫేమస్ సెలబ్రిటీగా మారిపోయాడు.

### మారథాన్ బేబి

త్రిషా స్టెయిన్ అనే మహిళ అక్కడ జరిగే మారథాన్ పోటీల్లో పాల్గొనేందుకు వెళ్ళింది. రెండు గంటలు పరిగెత్తిన తర్వాత ఇంటికి చేరుకున్న ఆమెకు విపరీతమైన ఒళ్లునొప్పులు కలిగాయి. అందుకోసమని డాక్టర్ దగ్గరికి వెళ్ళింది. తర్వాత కొన్ని గంటల్లోనే ఆమెకు 6.6 పౌండ్ల బరువున్న అందమైన ఆడపిల్ల పుట్టింది. పాప ఇంకా ఐదువారాలు ముందుగానే పుట్టింది. త్రిషా స్టెయిన్ అస్సలు ఊహించని పరిణామమిది. ఆమెకు తను గర్భవతినన్న విషయం కూడా తెలియదు. త్రిషా అంతకు ముందే ఇద్దరు పిల్లల తల్లి. వారిని నవమాసాలు మోసింది. గర్భవతిగా ఎలాంటి బాధలు, అవస్థలుంటాయో ఆమెకు అవగాహన ఉంది. పైపెచ్చు పిల్లలు పుట్టకుండా ఆమె భర్త ఆపరేషన్ కూడా చేయించుకున్నాడు. అందుకని ఆమె కనీసం తాను గర్భవతినన్న విషయం ఊహించను కూడా ఊహించలేదు. ఇలా ఊహకందకుండా సడెన్‌గా పుట్టిన ఆడపిల్లను చూసి త్రిషా మురిసిపోతోంది. ఆమెకు మీరా అనే పేరు పెట్టుకుంది. మారథాన్ తర్వాత పుట్టింది కాబట్టి అందరూ ఆమెను ముద్దుగా మారథాన్ అని పిలుచుకుంటున్నారు.

### కిక్‌బాక్సింగ్ బేబి

కన్సీవ్ అయ్యారని తెలియగానే ప్రతి మహిళా ఎంతో జాగ్రత్త పడుతుంది. పొట్టకి ఎలాంటి ఒత్తిడి, దెబ్బలు తగలకుండా కాపాడుకుంటుంది. కానీ ఈ టీనేజర్ మాత్రం గర్భంతో ఉండగానే కిక్‌బాక్సింగ్ పోటీల్లో పాల్గొనేందుకు వెళ్ళింది. అదేంటి? అలా ఎవరైనా వెళతారా? అనుకుంటున్నారా. అసలు ఆమెకు తాను ప్రెగ్నెంట్‌నన్న విషయం తెలిస్తే కదా! పదిహేడు సంవత్సరాల పమేలా వర్గ్స్ కిక్‌బాక్సర్. ఓసారి కిక్ బాక్సింగ్ పోటీలో పాల్గొన్నప్పుడు ప్రత్యర్థి ఆమె కడుపుపై పంచ్ ఇచ్చింది. ఆ తెల్లారి నుంచి ఆమెకు విపరీతమైన రక్తస్రావం కావడంతో తల్లిదండ్రులు ఆందోళనతో హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. వెంటనే ఆమె ఒక బేబీ గర్ల్‌కి జన్మనిచ్చింది. పోటీకి కొద్దిరోజుల ముందు 17 పౌండ్లు వెయిట్ పెరిగినట్టు ఆమెకి అనిపించినా, అది మామూలుగా శరీరంలో వచ్చే చిన్న మార్పేలే అని సరిపెట్టుకుందట. ఇలా అందమైన అమ్మాయికి జన్మనివ్వడం ఆమెతో పాటు, ఆమె తల్లిదండ్రులకు కూడా షాకింగ్ వార్తే.

### వెకేషన్ బేబి

31 సంవత్సరాల జెన్నీఫర్ వెస్ట్ అనే మహిళ తన భర్త, ఇద్దరు మిత్రులతో కలిసి వెకేషన్‌కి బయల్దేరదామని అంతా సర్దుకుంది. తీరా ప్రయాణం చేద్దామనుకునే సరికి ఉన్నట్టుండి కడుపులో విపరీతమైన నొప్పి ప్రారంభమైంది. ఆమెను హాస్పిటల్‌కి తీసుకెళితే, పండంటి బిడ్డకు జన్మనిచ్చింది. గర్భం ధరించిన విషయమే అసలు ఆమెకు తెలియదు. అంతకుముందు ఆమె ఇరవై పౌండ్లు బరువు పెరగింది. అయితే వయసుతో పాటు వచ్చిన బరువు అనుకుంది. పైగా గర్భవతిగా ఉన్నప్పటికీ తనకు నెలసరి రావడంవల్ల తను ప్రెగ్నెంట్ అనే విషయం ఆమె గుర్తించలేకపోయింది.

### హార్మోన్ల తేడా అనుకుని

47 సంవత్సరాల జడీ బ్రౌన్ అమెరికా మసాచుసెట్స్‌లో నివసిస్తోంది. ఆమెకు పిల్లలు లేరు. కొంతకాలంగా తీవ్రమైన కడుపునొప్పితో రోజూ బాధపడుతూ ఉండేది. ఒకరోజు హాస్పిటల్‌కు వెళ్ళింది. ఆమెను పరిశీలించిన డాక్టర్లు ఆమె గర్భవతి అని తేల్చేశారు, అంతేకాదు ఆ క్షణంలోనే ఆమెకు డెలవరీ చేయాలని కూడా చెప్పారు. అలా పండంటి ఆడపిల్లకు జన్మనిచ్చింది జడీ బ్రౌన్. అనుకోకుండా తల్లైన ఆమె ఆనందానికి అవధుల్లేవు. మామూలుగా శరీరంలోకాస్త బరువు పెరిగినట్లు అనిపించినా వయసు మీదపడుతుండడంతో హార్మోన్లలో వచ్చే తేడా వల్ల ఇలా బరువు పెరుగుతున్నానని అనుకుందట. కానీ ఎనిమిది పౌండ్ల బేబీకి జన్మనిస్తానని అనుకోలేదు. ఇప్పటికైనా దేవుడు కరుణించి పిల్లని ప్రసాదించాడని ఆమె చెబుతోంది.

– పుష్పలత

## క్రిప్టిక్ ప్రెగ్నెన్సీ అంటే...



గర్భవతి అని తెలిసేవిధంగా మహిళ శరీరంలో అనేక మార్పులు జరుగుతూ ఉంటాయి. ప్రత్యేక లక్షణాలు కనిపిస్తాయి. అయితే ఆ లక్షణాలు చాలామందిలో కనిపించినా కొందరిలో కనిపించకపోవచ్చు అంటున్నారు పరిశోధకులు. అలాంటి అరుదైన లక్షణాలు ఉండేవారు చాలా తక్కువమందే ఉంటారు. వారిని చూస్తే రోజూ చూసినట్లే ఉంటుంది. శరీరంలో కూడా తేడా ఉండదు. కొందరికి టెస్ట్ చేసినా సరే తెలియదు, మరికొందరేమో ఎక్కువ బరువు ఉండడంవల్ల గర్భవతులని గుర్తించరు. ఇంకొందరు గర్భనిరోధక మాత్రలు వాడుతుండడం వల్ల గుర్తించలేకపోవచ్చు. ఇంకా నెలసరి సక్రమంగా రావడంవల్ల కూడా తెలియకపోవచ్చు. ఇలాంటి సందర్భాలలో వారు గర్భంతో ఉన్నా గుర్తించడం కష్టం అని వైద్యులు చెబుతున్నారు. ఇలా మహిళకు తాను గర్భవతిని అని తెలియకుండానే పిల్లలకు జన్మనివ్వడాన్ని వైద్య పరిభాషలో క్రిప్టిక్ ప్రెగ్నెన్సీ అని పిలుస్తారు. ఈ లక్షణాలు ప్రతి 2,500మంది మహిళల్లో ఒక్కరికి ఉంటాయి.

## బేబీ షవర్



బ్రిటానీ అనే ఇరవైనాలుగేళ్ళ యువతి కడుపునొప్పితో అన్ని పరీక్షలూ చేయించుకుంది. దాంతో ఆమె ఏడునెలల గర్భవతి అని బయటపడింది. ఓరోజు షవర్ చేస్తుండగా విపరీతమైన కడుపునొప్పితో బాత్రూంలోనే పండంటి పిల్లకు జన్మనిచ్చింది. ఇది ఆమెను షాక్‌కు గురిచేసింది. దీన్ని ఓ మిరాకిల్‌గా ఫీలయిన ఆమె ఆ పాపకు మిరాకిల్ అనే పేరు పెట్టుకుంది.

ఇదిలా ఉంటే 25 సంవత్సరాల గైనోర్ జెప్కా అనే మహిళకి అర్ధరాత్రి విపరీత మైన కడుపునొప్పి వచ్చింది. టాయిలెట్‌కి వెళ్ళి అక్కడే బాబుకు జన్మనిచ్చింది. అంతకు ముందు వరకు ఆమెకు ఎలాంటి ప్రెగ్నెన్సీ లక్షణాలుకానీ, నొప్పులు కానీ లేవంట. ఇలా అనుకోకుండా జన్మనివ్వడంతో ఆమె ఆనందానికి అవధుల్లేవు.

# అమృతవర్షిణి

## ఓలేటి శ్రీనివాసభాను

**సైలెంట్ మోడ్‌లో ఉన్న మొబైల్ రెండుసార్లు మోగింది. ఇంట్లో పిల్లలకు వీణపాఠాలు చెబుతున్న అమృతవర్షిణి చూసుకోలేదు. "ఆంటీ మొబైల్ మోగుతోంది" ఓ స్టూడెంట్ చెప్పగానే అమృతవర్షిణి ఫోన్ అందుకుంది. "మేడం నేను టెక్నోస్కూలు నుంచి మాట్లాడుతున్నాను. అర్జంట్‌గా రండి. మీ అబ్బాయి బిలహరికి హైఫీవర్. వామిటింగ్స్ చేసుకుంటున్నాడు" అన్నాడు అవతలి వ్యక్తి. ట్యూషన్ పిల్లల్ని పంపించేసి ఆటోలో టెక్నోస్కూల్‌కు వెళ్ళింది అమృతవర్షిణి. బిలహరిని తీసుకుని తోవలోనేవున్న తమ ఫ్యామిలీ డాక్టర్ మూర్తి గారికి చూపించింది. ఆయన వెంటనే బిలహరిని హాస్పిటల్లో అడ్మిట్‌చేసుకుని సెలైన్ పెట్టారు. రెండురోజులు హాస్పిటల్‌లోనే ఉంచమన్నారు.**

సమయానికి తన భర్త వాసు ఊళ్ళోలేడు. అదే రోజు ఉదయం ఫ్లైట్‌లో బాస్‌తో కలిసి దుబాయి వెళ్ళాడు. మూడువారాలు క్యాంప్. వాసుది తరచు క్యాంపులు వెళ్ళే ఉద్యోగం. అందువల్ల పిల్లల్ని చూసుకోవడం అమృతవర్షిణికి అలవాటే. కానీ ఆరోజు పరిస్థితి వేరు. బిలహరి హాస్పిటల్ బెడ్‌మీద కలవరిస్తున్నాడు. నిద్రలో ఉలికిపడుతున్నాడు. భయంతో ముడుచుకుపోతూ ఏడుస్తున్నాడు. ఎప్పుడూ లేనిది అమృతవర్షిణికి ఆ క్షణంలో భయం వేసింది. "పసివాడు. దేనికో భయపడ్డాడు. ధైర్యంగా ఉండండి, మందులువాడితే సర్దుకుంటుంది" డాక్టర్ మూర్తి ధైర్యం చెప్పారు.

కుర్చీని బెడ్‌కి దగ్గరగా జరిపి



కూర్చుంది అమృతవర్షిణి. ఆమె ఒడిలో బిలహరి స్కూల్ బ్యాగ్ ఉంది. సగందాకా తెరుచుకున్న జిప్ లోంచి బయటకు తొంగిచూస్తూ టెక్నోస్కూల్ 'వీక్లీ ప్రోగ్రెస్ రిపోర్ట్'. కార్డ్ బయటకుతీసి చూసింది అమృతవర్షిణి. మార్కులూ, రిమార్కులూ చూసింది. పేరెంట్/గార్డియన్ సిగ్నేచర్ కాలమ్‌చూసి గట్టిగా నిట్టూర్చింది.

***

పన్నెండేళ్ళ క్రితం....

అమృతవర్షిణికి రెండోకాన్పులో అబ్బాయిపుట్టినప్పుడు "హరి అని పిలుద్దాం, మా నాన్న పేరు" అన్నాడు వాసు. అమృతవర్షిణి మరో రెండు అక్షరాలు చేర్చి 'బిలహరి' అంది. నవ్వాడు వాసు. పేరు కొత్తగా అనిపించింది. అదేదో రాగం పేరై ఉంటుందనీ, తన అర్థాంగి అలాంటి మెలికేదో పెడుతుందనీ అనుకుంటూనే ఉన్నాడతను. తొలికాన్పులోనూ ఇదే తంతు. అమ్మాయి పుట్టింది. "గౌరి అని పిలుద్దాం.. మా అమ్మ పేరు" అన్నాడు వాసు. అమృతవర్షిణి అదనంగా మరో నాలుగు అక్షరాలు చేర్చింది. 'గౌరీ మనోహరి' అని రాగంపేరు పెట్టుకుంది!

అమృతవర్షిణి వీణలో ఎం.ఎ. చేసింది. పార్ట్‌టైం వీణపాఠాలు చెబుతోంది. ఓ కన్‌స్ట్రక్షన్ కంపెనీలో చిరుద్యోగి వాసు. అతడి జీతానికీ జీవితానికీ అండగా నిలబడుతోంది. అతనికి సంగీతంమీద అందులోనూ శాస్త్రీయసంగీతం పట్ల పెద్దగా అవగాహన, అభిరుచి లాంటివి లేవు. కాకపోతే భార్య సంపాదనవల్ల ఇంటి అద్దెడబ్బు కలిసివస్తోందన్న గ్రహింపు ఆ మానవుడిలో ఉంది.

"మా అమ్మాయి పేరులోనే రాగం ఉంది. ఆమె వీణ వాయిస్తే అచ్చంగా అమృతం వర్షిస్తుంది" అంటూ పెళ్ళిచూపులప్పుడు కాబోయే మామగారు

పొగడటం వాసుకి గుర్తుంది. అప్పట్లో ఆయన ఓ సంగీత కళాశాలలో మృదంగం పాఠాలు చెప్పే వారు. "మా పుట్టింట్లో తలుపు చెక్క మీద తాళం వేసినా శ్రుతిలోనే ఉంటుంది" అని పెళ్ళైన కొత్తలో అమృతవర్షిణి సరదాగా అనేది. వాసు అర్థంకానట్లు మొహంపెడితే "జోక్ మహానుభావా.... కొంచెం నవ్వండి" అంటూ 'శ్రుతి', 'తాళం' లాంటివి వివరించ బోయేది. వాసుకి ఆసక్తి ఉంటేకదా? ఆవలించే వాడు.

రెండోకాన్పులో అబ్బాయి 'హరి' కాస్త 'బిలహరి'గా మారగానే "మ్యూజిక్ టీచర్లు పిల్లల పేర్ల కోసం వెతుక్కోవాల్సిన పనిలేదు" అని గట్టిగా నవ్వాడు వాసు. "ఉష్... శ్రుతి తగ్గించండి. బాబు తుళ్లిపడుతున్నాడు" అంది అమృతవర్షిణి చంటి వాణ్ణి దగ్గరకు తీసుకుంటూ.

పన్నెండేళ్ళు తిరిగాయి. పరిస్థితులు మారాయి.

వాసుకి కొద్దోగొప్పో జీతం పెరిగింది. పిల్లలు ఎదుగుతున్నారు. కార్పొరేట్ స్కూళ్ళలో చదువులు. ఖర్చులూ పెరిగాయి. అమృతవర్షిణి మంచితనం, వీణపాఠాలు బాగా చెబుతుందన్న పేరు కలిసొచ్చాయి. ట్యూషన్లు పెరిగాయి. అంతా బాగానే ఉన్నా అమృతవర్షిణిలో ఏదో వెలితి. గౌరీమనోహరికి వీణ నేర్పాలనుకుంది. "దాన్ని చదువుకోనీ, నీ సంగీతం పాఠాలతో అమ్మాయి చదువు పాడు చెయ్యకు" అని వాసు అడ్డుపడేవాడు. దానికితగ్గట్టు సంగీతం విషయంలో అమ్మాయి నాన్న పోలికే. సరిగమలు అబ్బలేదుగానీ గౌరీమనోహరి చదువుల సరస్వతి. ర్యాంకులపంట! అందుకే కూతురు విషయంలో అమృతవర్షిణి తన ఆశలు చంపుకుంది. సంగీతం నేర్పించాలనే ప్రయత్నం మానుకుంది. వాసు అనుకున్నట్లే గౌరీమనోహరి ఖరగ్‌పూర్ ఐఐటిలో చేరింది.

ఇక చిన్నవాడు బిలహరి, అమ్మ మనసులోని వెలితి భర్తీచేశాడు. అన్నప్రాసననాడే వీణమీదకి ఎగబడ్డాడు! పన్నెండేళ్ళ వయసులోనే వీణవాద్యంలో భళీ అనిపించుకుంటున్నాడు. సంగీత పోటీల్లో బహుమతులన్నీ వాడివే! వాడు చదువుకుంటున్న విద్యోదయాస్కూల్ ప్రిన్సిపాల్‌కి బిలహరి అంటే విపరీతమైన అభిమానం. తన ఆశలు నెరవేరుస్తున్నందుకు అమృతవర్షిణి ఆనందించింది.

వాసుమాత్రం ఊగిసలాడుతున్నాడు. బిలహరికి వస్తున్న ప్రశంసల్ని ఎంజాయ్ చేస్తున్నా గానీ, ఎందుకో చదువులో మనవాడు 'జస్ట్ అబౌవ్ ఏవరేజ్' అనిపించి, దిగులు పుట్టుకొచ్చింది. అదే టెన్షన్‌గా మారింది. దాంతో కొడుకు తాలూకు స్కూల్ రిపోర్ట్‌కార్డ్ చూసి మొదట్లో వాసు మొహం చిట్లించేవాడు. తర్వాత చిరాకుపడుతూ సంతకం పెట్టేవాడు. టర్మ్ గడుస్తున్నా అబ్బాయిమార్కుల్లో ఆశించిన ప్రోగ్రెస్ కనిపించకపోవడంతో వాసులో అసహనం మితిమీరింది. అది బిలహరిలోని సంగీత ప్రతిభను మెచ్చుకోలేనిస్థాయికి చేరుకుంది. ఇవేవీ ఆలోచించకుండా కొడుకు పాటకు తల్లితాళం వేయడం అతనికి పెద్దనేరంగా తోచింది.

ఆమధ్య వాసు పదిహేనురోజులు క్యాంప్‌కు వెళ్ళాడు. పదహారోనాడు చీకటిపడేవేళకు అలసటతో దిగబడ్డాడు. ఇంట్లో అడుగుపెట్టగానే డ్రాయింగ్ రూమ్‌లో వీణ వాయిస్తున్న కొడుకు కనిపించాడు. తాళంవేస్తున్న భార్య కనిపించింది. ఫ్యాన్ రెగ్యులేటర్ స్పీడు పెంచగానే టేబుల్ మీద ప్రోగ్రెస్‌రిపోర్ట్ గాలికి ఎగిరి వాసు పాదాల మీద పడింది. దాన్ని అందుకున్నాడతను. కళ్ళతో స్కానింగ్‌చేసి "ఎందుకూ పనికిరాని 'ఏ' గ్రేడ్. ఈ పర్సంటేజ్ అడుక్కోడానికి కూడా సరిపోదు" అంటూ విరుచుకుపడ్డాడు. అప్పుడు అమృతవర్షిణి అక్కడ లేదు. వంటింట్లోకి వెళ్ళింది. నీళ్ళగ్లాసుతోవచ్చి, "ఆకలి మీదున్నట్టున్నారు, త్వరగా స్నానంచేసి రండి, భోజనం చేద్దురుగాని" అంటూ భర్తకు గ్లాసు అందించింది.

అప్పటికే బిలహరి బిక్కచచ్చిపోయాడు. బల్లిలా వీణకు కరుచుకుపోయాడు. అమృతవర్షిణి అది గమనించినట్లులేదు. "శాంతము లేక సౌఖ్యము లేదు కీర్తన... ఇంకా బాగా రావాలిరా, డెస్క్‌లోకి వెళ్ళాలి. మళ్ళీవాయించు" అని బిలహరికిచెప్పి, కుక్కర్ దించడానికి వంటింట్లోకి వెళ్ళిపోయింది. ఆకలి, అలసట, ఆక్రోశం ముప్పేటలా కమ్ముకున్న వాసు అసహనంతో రెచ్చిపోయాడు. కొడుకు ప్రోగ్రెస్ కార్డ్ హ్యాంగోవర్‌లోనే ఉన్నాడతను. అరికాలిలో మంట అరచేతిలోకొచ్చింది. నీళ్ళగ్లాసు భళ్ళున పగిలింది.

"వీణపాఠాలు కూడు పెట్టవురా... అక్కయ్యని చూసి నేర్చుకో" అంటూ ఒంటికాలిమీద లేచాడు. తండ్రి అలా విరుచుకుపడగానే బిలహరి భయంతో ముడుచుకుపోయాడు. గట్టిగా ఏడుస్తూ వంటింట్లోకి పారిపోయాడు. అమృతవర్షిణి కొడుకుని వెనకేసుకు వచ్చింది. వాసుదేవరావుని గట్టిగా నిలదీసింది. పదిహేనురోజులు క్యాంప్‌లోపడ్డ అవస్థలు చాలవన్నట్టు ఇంట్లో ఏడుపుల్నీ, ఎదురు జవాబుల్నీ భరించలేకపోయాడతను. విసురుగా బెడ్‌రూమ్‌లో కెళ్ళి, దభేల్‌మని తలుపు వేసుకున్నాడు.

బాగా చదువుకోవాలి. మంచి ఉద్యోగంలో చేరాలి. రెండుచేతులా సంపాదించాలి. డబ్బు లేకపోతే బతుకులేదు. భవిష్యత్తులేదు. ఇదీ వాసులో బలంగా నాటుకున్న అభిప్రాయం. మరోలా ఆలోచించాలంటేనే భయం. చదువుకుంటున్నరోజుల్లో అతను టాప్ ర్యాంకర్. బ్రిలియంట్ స్టూడెంట్. కానీ ఆర్థికపరిస్థితి సహకరించలేదు. తమఊళ్ళో మిల్లు గుమస్తాగా పనిచేసిన తండ్రి హఠాత్తుగా కన్ను మూశాడు. తెలిసినవాళ్ళు సాయంచేస్తే, నగరం చేరుకుని, ఓ కన్‌స్ట్రక్షన్ కంపెనీలో చిరుద్యోగంలో కుదురుకున్నాడు. ప్రైవేట్‌గా డిగ్రీ పూర్తిచేశాడు. క్వాలిఫికేషన్ పెంచుకున్నాడు. భార్య సహకారంతో, సంపాదనతో ఒడ్డునపడ్డాడు. వర్తమానం హాయిగానే ఉన్నా అతను గతాన్ని వాటేసుకోవడం మానలేదు. అడిగినవాళ్ళకూ, అడగనివాళ్ళకూ తన కథ ఏకరువు పెట్టందే అతని గుండెబరువు తీరదు. తన పిల్లలు కష్టపడాలితప్ప కష్టాలు పడకూడదంటాడు. బాగా చదువుకోవాలని పట్టుసడలించకుండా పైకి రావాలని పదేపదే చెబుతాడు. "ఈ విషయంలో మీతో పూర్తిగా ఏకీభవించలేను" అంటుంది అమృతవర్షిణి.

"నిజమే. చిన్నప్పుడు మీరు నానా ఇబ్బందులూ పడ్డారు. పెద్దయ్యాక సుఖంగానే ఉన్నారు కదా? అందుకు ఆనందించకుండా జరిగిపోయిన వాటిని తలుచుకుంటూ జడుసుకోవడం దేనికి? మీరన్నీ అతిగా ఊహించుకుంటారండీ, అనవసరంగా భయపడతారు. ఇలా చూడండి. అందరికీ ఒకేరకమైన టాలెంట్ ఉండదు. ఉండాలని రూలేమీ లేదు. అమ్మాయికి సంగీతం నేర్పాలని నేను ఆరాట పడలేదా? ఏమైంది? జంటస్వరాల దగ్గరే ఆగిపోయింది. దాని దారి వేరని తెలిసినతర్వాత సంగీతం నేర్చుకోమంటూ నేను దానివెంట పడలేదుకదా? తనకి నచ్చిన తోవలో ముందుకెళ్ళింది. ప్రోత్సహించాం. చదువులో నెంబర్‌వన్ అనిపించుకుంది.

## అనసూయకు కోపమొచ్చింది

సినీ పరిశ్రమలో ఉన్న వారికి సోషల్‌మీడియా ద్వారా విమర్శలు, ప్రశంసలు రావడం సహజమే. వీటిని కొందరు పట్టించుకుంటే మరికొందరు తేలికగా తీసిపారేస్తారు. ఇంకొందరు గట్టిగా సమాధానం చెబుతారు. అందుకు ఉదాహరణే యాంకర్ అనసూయ. ఓ టీవీ షోలో ఆమె ధరించిన దుస్తులపై ఓ వ్యక్తి అభ్యంతరం వ్యక్తం చేస్తూ ఇన్‌స్టాగ్రామ్‌లో కామెంట్ చేశాడు. అంతే ఆ వ్యక్తికి 'ఎలాంటి దుస్తులు వేసుకోవాలనేది నా ఇష్టం. నీకు నచ్చకుంటే నువ్వు చూడకు. ఇతరుల విషయాల్లో తలదూర్చకుండా నీ పనులు నువ్వు చూసుకుంటే బెటర్' అంటూ ఘాటైన సమాధానమే ఇచ్చింది. అది చూసిన జనాలు అనసూయనా మజాకా అనేస్తున్నారు.



మీతోపాటు తల్లిగా నేనూ ఆనందించాను. అమ్మాయి విషయంలో నేనెలా ఉన్నానో అబ్బాయి విషయంలో మీరూ అలాగే ఉండండి. ఆఫ్టాల్ వాడి వయసెంత, చదువెంత? ఇప్పుడింకా సెవెంత్ క్లాస్. మీరు ఆశిస్తున్నస్థాయిలో కాకపోయినా 'ఎ' గ్రేడ్ లోనే కొనసాగుతున్నాడు కదా! భయం దేనికండీ? మనపిల్లాడని కాదుగానీ, ఓ మ్యూజిక్ టీచర్‌గా చెప్తున్నాను. బిలహరి బ్రిలియంట్ స్టూడెంట్. ఈ ఫీల్డ్‌లో వాడికి మంచి భవిష్యత్తు ఉంది. నాదీ పూచీ. సరేనా? క్యాంప్‌నుంచి అలసిపోయివచ్చారు. ఇలా అలిగి ఆకలితో పడుకోవడం మంచిదికాదు. పదండి భోజనం చేద్దాం" అంటూ అమృతవర్షిణి వాసుకి నచ్చచెప్పింది. హాల్లో నిద్రపోతున్న బిలహరిని లేపి కంచంముందు కూర్చోబెట్టింది.

ఆ రాత్రికి పరిస్థితి సద్దుమణిగిందనుకున్నా రెండ్రోజుల తర్వాత, "ఇదిగో వినండి. మీ ఇద్దరికీ చెబుతున్నాను" అంటూ భార్యనీ, కొడుకునీ కూర్చోబెట్టి కౌన్సెలింగ్ ఇచ్చాడు వాసు. "మనం పోటీ ప్రపంచంలో బతుకుతున్నాం. పరుగులవేటలో ముందుండాలి. వేట ఫలించాలంటే మన ఆయుధం పదునుదేలాలి" అన్నాడు. వీటన్నిటినీ చదువుతో ముడిపెట్టాడు. గౌరీమనోహరి లాగా బిలహరిని కూడా ఐఐటీకి పంపించడం తన 'మిషన్ అండ్ యాంబిషన్' అని తేల్చిచెప్పాడు. "బిలహరిని విద్యోదయా నుంచి టెక్నోస్కూల్‌కి షిఫ్ట్ చేస్తున్నాను. ఏడో తరగతి పరీక్షలు పూర్తికాగానే టీసీ తీసుకుంటున్నాను. దిస్ ఈజ్ ఫైనల్. నో ఆర్గ్యుమెంట్స్" అనిచెప్పి వాసు ఆఫీసుకు వెళ్ళిపోయాడు. మొహాలు చూసుకోవడం తల్లీ కొడుకుల వంతయింది.

బిలహరి ఏడోతరగతి పరీక్షలు పూర్తయ్యాయి. ఫలితాలు వచ్చాయి. కొడుకు టీసీకోసం విద్యోదయ స్కూల్‌కి వెళ్ళాడు వాసు. ప్రిన్సిపాల్ రాఘవ బాధపడ్డారు. ఎల్‌కేజీ నుంచి తమ స్కూల్లోనే చదువుతున్న బిలహరి స్పెషల్‌స్టూడెంట్ అన్నారు. అతని సంగీత ప్రతిభకు తార్కాణంగా తనరూమ్‌లోని షోకేస్‌లో స్కూల్ సాధించిన ట్రోఫీల్ని వాసుకు చూపించారు. వచ్చేనెలలో స్టేట్ లెవెల్ మ్యూజిక్ కాంపిటీషన్‌లో విద్యోదయాస్కూల్ తరపున బిలహరి పేరుతో ఎంట్రీ పంపించామనీ, దయచేసి 'పెద్దమనసు చేసుకోమనీ, నిర్ణయం మార్చుకోమని ప్రిన్సిపాల్ రాఘవ కోరారు. "చూడండి వాసుదేవరావు గారూ, సానపడితే మీవాడికి ఐఐటి సీటు వస్తుందో లేదో చెప్పలేనుగానీ దేశం గర్వించదగ్గ సంగీత కళాకారుడవుతాడని మాత్రం గ్యారంటీగా రాసివ్వగలను" అన్నారు ప్రిన్సిపాల్ రాఘవ. వాసు వినిపించుకోలేదు. "ఐ యాం సారీ..." అంటూ అడ్డంగా తలూపాడు. అక్కడకూడా 'పోటీ ప్రపంచం, పరుగులవేట' లాంటి ఉపన్యాసం ఇచ్చి, బలవంతంగా టీసీ తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడే బిలహరి స్కూల్ మారింది.

కొత్త బడి. కొత్త టీచర్లు. కొత్త వాతావరణం. ఉదయం ఏడయ్యేసరికి స్కూలు బస్సు హారన్

**తండ్రి అనుకున్నస్థాయిలో కొడుకు చదువులో రాణించడంలేదు. కేవలం ఎ గ్రేడ్ మార్కులు. పోటీ ప్రపంచంలో ఆ మార్కులు చాలవు. అందుకే కొడుకుని ఇంకా మంచి స్కూల్లో చేర్పించాడు. అక్కడ కూడా అతడి గ్రాస్పింగ్ పవర్ సరిపోలేదు. ప్రోగ్రెస్ కార్డులో అన్నీ రిమార్కులే. ప్రోగ్రెస్ కార్డుపై తండ్రి సంతకం చేయించాలి. కానీ ఎలా? తండ్రి అంటే ఆ కొడుక్కి విపరీతమైన భయం. చివరకు ఆ కొడుకు ఏం చేశాడు?**

తీతువులాగా కీచుమనేది. ఏ సాయంత్రమో పీక్కుపోయిన మొహాల్ని ఇళ్ళదగ్గర దింపి వెళ్ళిపోయేది. వస్తూనే బండెడు హోమ్‌వర్క్. సగం పూర్తికాకముందే బిలహరికి రెప్పలు అంటుకు పోయేవి. పుస్తకాల సంచిమీదే తలపెట్టుకొని వాలిపోయేవాడు. వాడి పుట్టినరోజుకి అమ్మ కానుకగా ఇచ్చిన బొబ్బిలివీణ మీటే నాథుడు లేక బిలహరితోపాటు ముసుగుకింద నిద్ర పోయేది. దీనికితోడు వారానికోసారి ప్రోగ్రెస్ రిపోర్టులు. పేరెంట్స్/గార్డియన్స్‌కి సూచనలు. రోజుకో యుద్ధం. వచ్చిందే వస్తూ, రోజూ పీడకల. కలనిండా గుర్రాలు. గాలితో పోటీ పడుతూ కొండంచున పరుగులు. బిలహరిని ఎవరో బలవంతంగా ఓ గుర్రంమీద కూర్చోబెట్టారట. చిన్నవాడు సర్దుకోలేకపోతున్నాడట. గుర్రం గట్టిగా సకిలించి, వాణ్ణి పడదోసిందట. కొండరాళ్ళమీద దొర్లిపోతున్నాడట. ఆవులిస్తున్న లోయలోకి జారిపోతున్నాడట. "అమ్మో" అని అరుస్తూ నిద్రలో కేకలేశాడు బిలహరి. మంచం మీదనుంచి రెండుసార్లు జారిపడ్డాడు. తగిలిన చోటే దెబ్బ తగిలింది. తలమీద బొప్పికట్టింది. పగటికీ, రాత్రికీ తేడా తెలీటం లేదు. కళ్ళు తెరచినా, మూసినా ఒకటే దృశ్యం! క్లాస్‌రూమ్‌లో బెంచ్, బెడ్‌రూమ్‌లో మంచం. రెండు చోట్లా పీడకలలే. ఎటు చూసినా రాకాసి లోయలే.

***

నిన్ననే ఫస్ట్‌వీక్ 'ప్రోగ్రెస్ రిపోర్ట్' ఇచ్చారు. చూస్తూనే బిలహరికి గుండె జారిపోయింది. రిమార్క్స్ కాలమ్‌నిండా ఎర్రటి అక్షరాలు. స్టాండర్డ్ సరిపోదట. గ్రాస్పింగ్ పెరగాలట. రెండు వారాలు టైం ఇస్తారట. ప్రోగ్రెస్ కనిపించకపోతే రాత్రివేళ స్కూల్లోనే ఉంచేసి, మూడుగంటలు ఎక్స్‌ట్రా కోచింగ్ ఇస్తారట. పేరెంట్స్ సంతకం తీసుకు రమ్మని టీచర్ చెప్పారు. రిపోర్ట్ ఇంటికి తీసుకొచ్చాడు బిలహరి. ఆ రాత్రి వాసుకి చూపించకుండా బ్యాగులోనే దాచిపెట్టాడు. తెల్లవారుజామున తండ్రి దుబాయిక్యాంప్‌కి వెళ్ళిపోగానే అమ్మచేత సంతకం పెట్టించాలని బిలహరి ప్లాన్. మర్నాడు ఉదయం ఆఫీస్ కారొచ్చింది. వాసు హడావిడిగా వెళ్ళిపోయాడు. అమ్మకి రిపోర్ట్ కార్డ్ ఎలాచూపించాలో, ఏం చెప్పాలో ఒకటికి రెండుసార్లు మనసులోనే సాధన చేసుకున్నాడు బిలహరి. ఎంతచేసినా ఏదో బెరుకు, మనసును పీకేసే బెంగ. ధైర్యం చెయ్యలేక పోయాడు. సరిగ్గా అదే సమయంలో

మంచినీళ్ళ కొళాయి చప్పుడు చేసింది. అమృతవర్షిణి ఆ పనిలో పడింది. ఆ వెంటనే పెద్దగా హారన్ వినిపించింది. బెడ్‌రూమ్ కిటికీలోంచి చూశాడు బిలహరి. స్కూలుబస్సు మలుపు తిరిగింది. గేటు దాటి, తమ అపార్ట్‌మెంట్స్ కాంపౌండ్‌లోకి వస్తోంది.

"టిఫిన్ బాక్స్ పెట్టుకున్నావా?" కొళాయి దగ్గర నీళ్ళు పడుతూ అమృతవర్షిణి కేకపెట్టింది. బిలహరి ఆలస్యం చేయలేదు. ఓ చేత్తో టిఫిన్‌బాక్స్, మరో చేత్తో రిపోర్ట్ కార్డ్ అందుకున్నాడు. రెండింటినీ బ్యాగ్‌లో దాచుకున్నాడు. దాచుకునే ముందు రిపోర్ట్ కార్డ్‌లో పేరెంట్సు/గార్డియన్ సిగ్నేచర్ కాలం ఖాళీగా కనిపించింది. అమ్మతో వివరించడానికి టైంలేదు. అందుకే తెగించాడు. పెన్ను తీశాడు. 'కె.అమృతవర్షిణి..' అమ్మ సంతకం తనే పెట్టేసి, లిఫ్ట్ దిగి, స్కూలు బస్సులో కూర్చున్నాడు.

ఉదయం ఏడుగంటలకు టెక్నో స్కూలుకు వెళ్లాడో లేదో పదకొండు గంటలకల్లా ఫోన్! అబ్బాయికి హైఫీవర్. వామిటింగ్స్. అర్జంట్‌గా రమ్మంటూ మెసేజ్. అమృతవర్షిణి గాబరా పడుతూ వెళ్ళింది. ఆటోలో బిలహరిని ఎక్కించిన తర్వాత స్కూల్ ప్రిన్సిపాల్ ఆవిడచేతిలో రిపోర్ట్ కార్డ్ ఉంచాడు. సిగ్నేచర్ కాలమ్‌వైపు చూపిస్తూ కనుబొమలు ముడిచాడు. పెదవులు విరిచాడు. "హోప్ దిస్ ఈజ్ నాట్ యువర్ సిగ్నేచర్ మేడం" అంటూ భుజాలు ఎగరేశాడు.

***

డాక్టర్ మూర్తి హాస్పిటల్. అమృతవర్షిణి చేతిలోని ప్రోగ్రెస్ కార్డ్ రెపరెపలాడింది. బెడ్‌మీద కొడుకును చూసి తల్లిమనసు తరుక్కుపోయింది. దుఃఖం తన్నుకొచ్చింది. అలా చేయడం అమృతవర్షిణికి అశుభంలాగా అనిపించింది. "ఛ..ఛ.." అనుకుని, కొంగుతో మొహం తుడుచుకుంది. అప్పటికప్పుడు గట్టిగా ఓ నిర్ణయానికి వచ్చింది. రిపోర్ట్ కార్డ్‌ని రెండుచేతుల మధ్య ఉంచింది. నిలువునా రెండుభాగాలు, అడ్డంగాతిప్పి నాలుగుముక్కలు చేసింది. మరుక్షణమే అవన్నీ డస్ట్‌బిన్‌లో...

హృదయాన్ని మెలిపెడుతున్న బాధ 'ఉఫ్' మంటూ ఎగిరిపోయింది. అమృతవర్షిణి మనసు దూదిపింజలాగా తేలిపోయింది.

***

చూస్తుండగానే మూడువారాలు గడిచిపోయాయి. దుబాయి క్యాంప్‌నుంచి ఓరోజు సాయంత్రం తిరిగొచ్చాడు వాసు. ఇంటికి తాళం వేసి ఉంది. స్పేర్ కీతో తలుపుతెరచి లోపలకు వెళ్ళాడు. టీపాయ్ మీద ఉత్తరం. అతను ఊళ్ళో లేనప్పుడు జరిగిన సంగతులు గుది గుచ్చి అమృతవర్షిణి రాసింది. చివర్లో "మీకు వీలుంటే కళాభవన్‌కి రండి" అని పెద్ద అక్షరాలతో రాసి, అండర్‌లైన్ చేసింది.

వాసు ఆలస్యం చేయలేదు. గబగబా తయారై ఆటోలో కళాభవన్‌కు చేరుకున్నాడు. లోపలకు వెళ్ళగానే పెద్దపెట్టున చప్పట్లు. అప్పుడే బిలహరి వేదిక మీదకి వెళ్ళాడు. రాష్ట్రస్థాయి సంగీతం పోటీల్లో విద్యోదయాస్కూల్ పక్షాన ప్రథమబహుమతిని అందుకుంటున్నాడు. బహుమతి అందజేసిన ప్రముఖుడు బిలహరిని దగ్గరగా తీసుకుని, "పిల్లల్ని పొగడకూడదంటారు. బట్, నోరు కట్టుకోలేకపోతున్నాను. దిస్ కిడ్ ఈజ్ మ్యూజికల్ వండర్. ఎక్స్‌ట్రార్డినరీ" అంటూ బిలహరిని నుదుటిపై ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడు. ఆ తర్వాత ప్రేక్షకులవైపు చూస్తూ, అబ్బాయి పేరెంట్స్‌ని వేదికమీదకి రమ్మంటూ ఆహ్వానించాడు. ప్రేక్షకుల మధ్యఉన్న విద్యోదయా ప్రిన్సిపాల్ రాఘవ "వెళ్ళండమ్మా" అంటూ తనపక్కసీటులో ఉన్న అమృతవర్షిణిని ప్రోత్సహించాడు. ఆమె మెల్లగాలేచి నాలుగడుగులు ముందుకు వేసింది. అంతలో వాసు గబగబా వచ్చాడు. భార్యతోపాటు కలిసి వేదికపైకి చేరుకున్నాడు. వేదికమీది ప్రముఖుడు ఆ దంపతుల్ని సాదరంగా ఆహ్వానించి, "ప్లీజ్ సే సంథింగ్" అంటూ వాసుచేతికి మైక్ ఇచ్చాడు.

జీవితంలో మొదటిసారిగా మైకు అందుకున్న వాసు తడబడలేదు. అనుభవజ్ఞుడిలాగే "అందరికీ నమస్కారం." అన్నాడు. "ముత్తుస్వామిదీక్షితార్ లాంటి మహనీయులు 'ఆనందామృతవర్షిణీ' అంటూ అమృతవర్షిణిరాగంతో వర్షం కురిపించారట! అది జీవం పోసిందనీ, జీవితాల్ని కాపాడిందనీ చరిత్ర. ఈ బహుమతి విషయానికొస్తే, ఇది మా చిరంజీవి గెలుచుకున్నా అసలు విజేత మాత్రం నా శ్రీమతే. అన్నట్టు ఆమె పేరు అమృతవర్షిణి".

హాల్లో చప్పట్ల వర్షం కురిసింది.

ఈలోపు ఊపిరి తీసుకున్నాడు వాసు. "త్యాగరాజస్వామివారి వృత్తాంతం తెలిసిందే! ఎవరో తరలించుకుపోయిన తన సీతారాముల విగ్రహాలు కావేరీనదిలో తిరిగి కనిపించగానే ఆయన ఆనందం పట్టలేకపోయారట. బిలహరి రాగంలో 'కనుగొంటినీ' కీర్తన రాశారట. పోగొట్టుకున్న సర్వస్వాన్ని తిరిగి పొందినప్పుడు ఆ ఆనందాన్ని వర్ణించడానికి బిలహరిరాగం అనువైనదన్నది పెద్దల మాట. మా చిరంజీవికి 'బిలహరి' అని పేరు పెట్టింది కూడా నా శ్రీమతే" అంటూ ముగించాడు.

***

"ఉదయం దుబాయ్‌నుంచి ముంబయి రాగానే టెక్నోస్కూల్ ప్రిన్సిపాల్‌కి ఫోన్ చేశాను. స్కూల్ మార్చేశావని తెలిసి బాధపడ్డాను. మా బాస్ రంగనాథన్‌గారికి నాగోడు వెళ్ళబోసుకున్నాను. ఆయన నాకు చీవాట్లు పెట్టారు. మెల్లగా ఓదార్చి తమ కొడుకు గురించి చెప్పారు. అతను అమెరికాలో ఎం.ఎస్ చేసి, పి.హెచ్.డి. చేస్తూ, ఫిల్మ్ డైరెక్షన్‌లో సెటిల్ అయ్యాడట. అది 'రేర్ కేస్' సార్ అన్నాను. రంగనాథన్‌గారు ఒప్పుకోలేదు. మీ అబ్బాయిది 'రేరెస్ట్ ద రేర్ ఎందుకు కాకూడదు? అంటూ వాదించారు. నిలదీస్తూనే నచ్చచెప్పారు. నాలో ధైర్యం నూరిపోశారు. 'అమృతవర్షిణి', 'బిలహరి' రాగాల గురించి చెప్పిందీ ఆయనే!" ఇంటికి వస్తూ తోవలో భార్యాబిడ్డలతో చెప్పాడు వాసు. ఇంటికి చేరుకున్న అమృతవర్షిణి తాళం తెరచి ఇంట్లో దీపం వెలిగించింది.

**సెల్:94405 67151**




ఆ వీధిలో చెట్లున్నాయి గాని
స్ట్రీట్‌లైట్ ప్రత్యేకం.
చీకటిని చప్పరిస్తూ
రెప్పలను సాగదీసుకుంటుంది

## వీధి దీపం

నిద్ర పొయ్యే వీధి కాదది
ఒక నిరంతర నది
కాని ఇవాళెందుకో
నిశ్శబ్దంగా ఉంది.

వీధి ఉన్నచోటనే వుండదు
ప్రతి ఇంటిలోనికీ
పాకుతూ వెళ్తుంది
ఇండ్లూ అంతే
ప్రతి నిర్గమనమూ
దాని చూపుల కిందనే సాగుతుంది
వీధి దీపానికి
ఇదంతా అలవాటే గాని
ఎందుకో ఇవాళ్టి రాత్రి
అన్ని రాత్రుల్లాగ లేదు.

దూరంగా ఓ కుక్కపిల్ల
అసహనంగా తిరుగుతుంది.
ఎక్కడో ఏదో జరగరానిది జరుగుతున్నట్టు
ఆకాశం ఊపిరి బిగబట్టి చూస్తుంది.
తెల్లారగట్ల ఎక్కడినుంచో



ఓ పగిలిన ఏడుపు వినిపిస్తున్నది.

కలవరపడుతున్న వీధి దీపం
నేలను పెకల్చుకొని
నడవాలని ప్రయత్నిస్తుంది
రాబోయే కర్మసాక్షికి
నివేదించుకోవాలని తాపత్రయపడుతుంది
అన్నట్టు కవి కూడా
వీధి దీపంలాంటి వాడే.

**—డా. ఎన్.గోపి**

# సురభి



## ప్రపంచాన్ని చుట్టేశాడు

ప్రపంచాన్ని చుట్టిరావాలనీ, కొత్తకొత్త ప్రదేశాలు, దేశాలు చూడాలనీ చాలామంది తహతహలాడుతుంటారు. కానీ ఆ తహతహని తీర్చుకునేవారు నూటికొక్కరు మాత్రమే ఉంటారు. ఆ నూటికొక్కరులో బ్రిటన్‌కి చెందిన కేన్ అవెల్లానో ఒకడు. వయసు 24. ఇంతకీ అతగాడి ఘనత ఏమిటనుకుంటున్నారా? ద్విచక్రవాహనంపై ప్రపంచాన్ని చుట్టివచ్చిన అతిపిన్నవయస్కుడిగా గిన్నిస్ రికార్డు సొంతం చేసుకున్నాడు. కేవలం ఎనిమిది నెలల్లో 36 దేశాలు తిరిగాడు. మొత్తం 45 వేల కిలోమీటర్లు ప్రయాణించాడు. ప్రపంచాన్ని చుట్టిరావాలన్న తన కోరికను తీర్చుకోవడంతో పాటు చిన్నారుల సంక్షేమానికి తనవంతు తోడ్పాటునందించేందుకు, యూనిసెఫ్ సంస్థ కోసం విరాళాలు సేకరించాడు. దాదాపు 14 ఏళ్ళ తరువాత ద్విచక్రవాహన పర్యటనను గిన్నిస్‌బుక్ గుర్తించడం ఇప్పుడేనట. అంతే కాదండోయ్ కేన్‌కి ఇంకో కోరిక కూడా ఉంది. త్వరలోనే గాల్లో ఎగురుతూ ప్రపంచాన్ని చుట్టిరావాలని ఆశపడుతున్నాడతను. భూమ్మీద, గాల్లోనూ ప్రపంచాన్ని చుట్టివచ్చిన ఘనతను తన సొంతం చేసుకోవాలని ప్రణాళికలు వేసుకుంటున్నాడు.

## మేక 'రాజు'

పండుగలు, ఉత్సవాల సమయంలో మేకలను బలిస్తుంటారు. కానీ ఐర్లాండ్ వాసులు మాత్రం మేకను రాజుగా పూజిస్తారు, గౌరవిస్తారు. అసలు కథ ఏంటంటే ఐర్లాండ్‌లోని కిల్లోర్గ్లిన్ గ్రామంలో పురాతన సంప్రదాయంలో భాగంగా ప్రతిఏటా పక్ వేడుకలను ఘనంగా నిర్వహిస్తారు. అయితే ఈ వేడుకల్లో ఓ ప్రత్యేక విశేషముంది. వేడుక ఆద్యంతం ఓ మేకను ఎంచుకుని, దాన్ని రాజుగా ప్రకటిస్తారు. పండుగ పూర్తయ్యేవరకు ఆ మేకను 'కింగ్ పక్'గా కొలుస్తారు. అలా పండుగ ఆద్యంతం మేక రాజును ఓ దేవుడిలా పూజిస్తుంటారు. నీరు, క్యాబేజీ, రకరకాల చెట్టు కొమ్మలు తెచ్చి ఆహారంగా పెడుతుంటారు. పండుగ పూర్తయ్యాక ఆ మేకను వదిలేస్తారు. ఏటా జరిగే ఈ పండుగకు ఇతర దేశాల నుంచి కూడా లక్షలాదిగా జనం వస్తుంటారు.



## ప్రత్యేకంగా వారికోసమే!

బీచ్‌కి వెళ్ళినప్పుడు పిల్లలు సరదాగా ఇసుకతో కోటలు కడుతుంటారు. అలాగే పిల్లలు ఆడుకోవడానికి చిన్న చిన్న ప్లాస్టిక్ ఇళ్లు మార్కెట్‌లో దొరుకుతున్నాయి. కానీ ఒక ఆర్కిటెక్ట్ మాత్రం పిల్లల కోసమే ప్రత్యేకంగా ఇళ్ళను నిర్మిస్తున్నాడు. అదీ విలాసవంతంగా, అత్యంత అధునాతన హంగులతో...

అమెరికాకు చెందిన అలెన్ మోవర్ అనే ఆర్కిటెక్ట్ పిల్లల కోసమే ప్రత్యేకమైన ఇళ్ళను నిర్మిస్తున్నాడు. అచ్చంగా మనం నివసించే ఇళ్ళను తలపించేలా అందంగా తయారుచేస్తున్నాడు. పదడుగుల ఎత్తున నిర్మిస్తున్న ఈ ఇళ్ళలో బోలెడు వసతులు ఉంటాయి. లివింగ్ రూం, బెడ్‌రూం, కిచెన్...ఇలా సర్వహంగులూ, సౌకర్యాలూ ఉంటాయి. కాకపోతే కేవలం పిల్లలు ఆడుకోవడానికే పనికొస్తాయి అవి. అంతేకాదు ఇంటిబయట చక్కటి గార్డెన్ కూడా ఉంటుంది. మరి ఇంతటి విలాసవంతమైన ఈ ఇళ్ళ ధర కూడా ఎక్కువేనండీ. ఒక్కో ఇల్లు ఆరు లక్షల నుంచి యాభై లక్షల వరకు ఉంటుందిట.



## ఫ్లవర్ ఫెస్టివల్



రోడ్లంట పూలరథాలు అలా సాగిపోతున్నాయి... వాటి పక్కనే అందాల ముద్దుగుమ్మలు తమదైన శైలితో ఆడిపాడుతున్నారు. సందర్శకుల చూపులు రథాల వెంట అటూఇటూ పరుగెడుతున్నాయి. హంగేరి రాజధాని బుడాపెస్ట్‌లో జరిగే డెబ్రెసెన్ ఫ్లవర్ ఫెస్టివల్ సంగతులు ఇవన్నీ. ఏటేటా నిర్వహించే ఫ్లవర్ ఫెస్టివల్‌లో భాగంగా రకరకాల పూలతో, విభిన్నమైన థీమ్స్‌తో, క్యారెక్టర్స్‌తో, విభిన్న ఆకృతులలో పూలరథాలను సిద్ధం చేస్తారు. వాటిని రహదారులవెంట పరేడ్‌గా తీసుకెళ్తారు. నృత్యాలతో ముద్దుగుమ్మలు వీక్షకులను అలరిస్తుంటారు. ఈ ఫెస్టివల్ 12 రోజులపాటు జరుగుతుంది. హంగేరీని పాలించిన సెయింట్ స్టీఫెన్ వర్ధంతి సందర్భంగా ప్రతి ఏడూ ఈ ఫ్లవర్ ఫెస్టివల్‌ను నిర్వహిస్తారు.

—నర్మద వాసిరెడ్డి

# వేధించే నడుంనొప్పికి చెప్పేద్దాం గుడ్‌బై

**ఇటీవల** నిర్వహించిన సర్వేల ప్రకారం, 80 నుంచి 90 శాతం మంది నడుం నొప్పితో బాధపడుతున్నారు. 40 శాతం మంది మెడ నొప్పితో బాధపడుతున్నారు. సాధారణంగా ఏ నొప్పి అయినా మూడు నాలుగు వారాలలో తగ్గిపోతుంది. అప్పటికీ తగ్గకపోతే తప్పనిసరిగా వైద్యుల సలహా తీసుకోవాలి. వెన్ను నొప్పులలో డిస్క్ సమస్యలు, స్పాండిలోసిస్, కణుతులు, స్కోలియోసిస్, ట్యూమర్స్, సయాటికా సమస్యలు ఎక్కువగా ఉంటాయి. మన శరీర వ్యవస్థలో వెన్నెముక మూలస్తంభంమాదిరిగా పనిచేస్తుంది. వెన్నెముక పలు విభాగాల సమ్మేళనం. వెన్నెముకకు తోడుగా కండరాలు, లిగమెంట్లు, డిస్కులు ఉంటాయి. వెన్నెముక సులభంగా వంగడానికి డిస్కులు లిగమెంట్లు తోడ్పడతాయి. వెన్నుపూసల మధ్య రబ్బరు కుదురులాంటి ఒక పదార్థం ఉంటుంది. దీన్ని డిస్క్ అంటారు. వెన్నుపాము పొడవునా ఎన్నో నరాలు వెళుతుంటాయి. మెడభాగం నుంచి వెళ్లే నరాలు చేతుల్లోకి, నడుము నుంచి వెళ్లే నరాలు కాళ్లలోకి విస్తరిస్తాయి. వీటిలో కొన్ని నరాలు మూత్రకోశం, మలవిసర్జన భాగంతో పాటు లైంగిక భాగాల్లోకి విస్తరిస్తాయి. అందువల్లనే డిస్క్ సమస్యలు వచ్చిన వారికి లైంగికపరమైన సమస్యలు మొదలవుతాయి. డిస్కులలో రెండు రకాల ఇబ్బందులు ఉంటాయి. ఒకటి డిస్క్ ప్రొలాప్స్, రెండవది డిస్క్ డీజెనరేటివ్ డిస్క్ డిసీజ్.

డిస్కుకు బయట ఉన్న పొర బలహీనమవడం వల్ల డిస్క్ వెనకకు జరిగి కాళ్లలోకి వచ్చే నరాలపై ఒత్తిడి తెస్తాయి. దీనివల్ల కాళ్లలో తిమ్మిర్లు, మొద్దుబారడం జరుగుతుంది. దీనిని స్లిప్ డిస్క్ అంటారు. ఒక్కొక్కసారి యాన్యులస్ అనే పొర చిట్లి జెల్లీలాంటి డిస్క్ మెటీరియల్ బయటకు వస్తుంది. దీనిని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. కాలును వంచకుండా తిన్నగా ఉంచి పైకి ఎత్తినపుడు కాలులో నొప్పి పెరిగితే దాన్ని డిస్క్ ప్రొలాప్స్ అంటారు. ఇక మెడప్రాంతంలో ఉండే పూసలను సర్వైకల్ వర్టిబ్రా అంటారు. వర్టిబ్రా మధ్యలో ఉన్న డిస్క్ అరిగి కొంచెం పక్కకు జరిగి అక్కడ ఉన్న నాడులను ఒత్తిడికి గురిచేస్తుంది. దీనివల్ల మెడనొప్పి వస్తుంది.

నా పేరు సరస్వతి. మా ఊరు అమలాపురం. నేను గత మూడేళ్లుగా తీవ్రమైన నొప్పితో బాధపడుతున్నాను. ఎంతో చలాకీగా తిరిగే నేను నిస్సహాయకురాలినయ్యాను. న్యూరోసర్జన్ నా యంఆర్ఐ రిపోర్టు చూసి డిస్క్ బల్జ్, నర్వ్ కంప్రెషన్ ఉందని చెప్పారు. దీనికి సర్జరీ ఒక్కటే మార్గమని చెప్పారు. డాక్టర్‌గారి ఇంటర్వ్యూ టీవీలో చూసి హైదరాబాద్‌కు వచ్చి చూపించుకున్నాను. డాక్టర్ మధువారణాశి గారు ఇచ్చిన ట్రీట్‌మెంట్‌తో నెలరోజుల్లోనే నొప్పి తగ్గిపోయింది. మూడు నెలల్లో 90 శాతం నొప్పి తగ్గిపోయింది. నా పని నేను చేసుకోవడం ప్రారంభించాను. ఒక ఏడాది పాటు నన్ను ట్రీట్‌మెంట్ తీసుకొమ్మన్నారు. ఇప్పుడు నేను ప్రశాంతంగా ఎలాంటి బాధలేకుండా, హాయిగా ఉన్నాను. సర్జరీ అవసరం లేకుండా పోయింది. నాకు తిరిగి జన్మనిచ్చిన డాక్టర్ మధువారణాశిగారిని జీవితాంతం మరచిపోలేను.

### మెడనొప్పికి కారణాలు

మెడ కండరాలు ఒత్తిడికి లోనవడం, సర్వైకల్ స్పాండిలోసిస్, సర్వైకల్ డిస్క్ ప్రొలాప్స్, వంశపారంపర్యం, టిబి వల్ల ఎముకలలో మార్పులు చోటు చేసుకోవడం, సరియైన భంగిమలో కూర్చోకపోవడం, ఎక్కువ బరువులు ఎత్తడం వంటివి కారణాలుగా ఉంటాయి. దీనివల్ల సీ1, సీ2, సీ3, సీ4, సీ5, సీ6, సీ7 వర్టిబ్రాలలో సమస్యలు వస్తాయి. ఈ డిస్కులలో సమస్యల వల్ల తలనొప్పి, మెడనొప్పి, తల తిరగడం, మెడ బిగుసుకుపోవడం, చేతులలో కాళ్లలో తిమ్మిర్లు, మల, మూత్ర విసర్జనలో నియంత్రణ తప్పడం, మెడ కండరాలు బలహీనపడటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వెన్నెముకకు దెబ్బలు తగలడం, ప్రయాణిస్తున్న వాహనం గోతుల్లో పడినప్పుడు డిస్కులపై ఒత్తిడి పడినప్పుడు సయాటికా నొప్పి వస్తుంది.

డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188,
వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509



# హెచ్ఐవికి హోమియోతో పరిష్కారం

**క్లినిక్** రోజులాగానే పేషెంట్స్‌తో బిజీగా ఉంది. రిసెప్షన్‌లో అశ్విని అప్పటికే చాలా అపాయింట్‌మెంట్స్ ఇచ్చేసింది. జూ. డాక్టర్ నా ఛాంబర్‌లో కేసులు తీసుకుంటుంది. లోపలికి 25 ఏళ్ల యువకుడు వచ్చాడు. చెప్పు నీ ప్రాబ్లమ్ ఏమిటి? అని అడిగాను. దానికి అతను నసుగుతూ ఉన్నాడు. సమస్య ఏమిటి చెప్పు బాబా... చెప్పు అని అడిగాను. సార్ నా పేరు రాజు, అనంతపురం నుంచి వచ్చాను. మీతో పర్సనల్‌గా మాట్లాడాలి అన్నాడు. జూ. డాక్టర్‌ను బయటకు పంపించాక అతను నెమ్మదిగా చెప్పడం ప్రారంభించాడు. సార్, నేను 5 నెలల క్రితం మా ఫ్రెండ్స్‌తో కలిసి ఒక అమ్మాయి దగ్గరకు వెళ్లాను. తర్వాత బ్లడ్‌టెస్ట్ చేయించుకుంటే హెచ్ఐవి పాజిటివ్ అని వచ్చింది. ఇంట్లో ఎవరికీ చెప్పలేదు. నాకింకా పెళ్లికాలేదు. నాకు చనిపోవాలనిపిస్తోంది. మీరే నాకు ఏదో ఒక దారి చూపిస్తారని ఆశతో వచ్చాను అని కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు. హెచ్ఐవి రిపోర్ట్ చూస్తే రియాక్టివ్ అని ఉంది. చూడు రాజా....అయిపోయిందేదో అయిపోయింది. బయపడకు. హోమియోలో మంచి మందులున్నాయి. నేనున్నాను అని ధైర్యం చెప్పి హెచ్ఐవి ఎయిడ్స్ గురించి వివరించాను.

### హెచ్ఐవి అంటే ఏమిటి?

హెచ్ఐవిని శరీరంలో రోగనిరోధక శక్తిని క్షీణింపచేసే ఒక వైరస్‌గా గుర్తించారు. ఈ వైరస్ శరీరంలో సహజసిద్ధంగా ఉండే రోగనిరోధక శక్తిని క్రమేణా బలహీనపరుస్తుంది. చివరకు ఎయిడ్స్ రూపంలో బయటపడుతుంది. ఇది నిజానికి బలహీనమైన వైరస్సే. శరీరం వెలుపల ఉంటే మరిగిస్తే చాలు సులువుగా నశిస్తుంది. కానీ ఈ వైరస్ మానవ శరీరాన్ని తన నివాసంగా చేసుకుంటే మాత్రం శరీరాన్ని పూర్తిగా దెబ్బతీస్తుంది. శరీరంలో వ్యాధి నిరోధక శక్తి తగ్గడం వల్ల వ్యాధి కారక సూక్ష్మక్రిముల ద్వారా కలిగే ఇన్‌ఫెక్షన్లను ఎదిరించే శక్తిని శరీరం కోల్పోతుంది.

### ఎయిడ్స్ లక్షణాలు

1) నెల రోజులుగా జ్వరం
2) విరేచనాలు కావడం, దానికి కారణం అంతుపట్టకపోవడం.
3) నెలరోజుల్లో శరీరం బరువు 10 శాతం తగ్గిపోవడం.
4) దీర్ఘకాలికంగా జలుబు, లింఫ్ గ్లాండ్స్ వాపు ఉండటం.
5) దగ్గు, సాధారణమైన దురద, చర్మసంబంధ వ్యాధులు.
6) గొంతు బొంగురుపోవడం, నోటిలో పూత తగ్గకపోవడం.

### చికిత్స

అతనికి లక్షణాలన్నీ వివరించాక చికిత్స మొదలుపెట్టాను. అతని లక్షణాలను బట్టి మందులు ఇచ్చాను. దానితో పాటు ఆహారంలో బాదం, అరటి పళ్లు, దానిమ్మ, పాలు, చేపలు తీసుకోమన్నాను. రెండు నెలల్లో చాలా మార్పు వచ్చింది. ఆకలి పెరిగింది. నీరసం తగ్గింది. రెండో సారి వచ్చినపుడు నాలో తెలియని శక్తి వచ్చింది సార్, మీ హోమియో మందులు బాగా పనిచేశాయి. నేను బతుకుతాననే నమ్మకం వచ్చింది. రెగ్యులర్‌గా ట్రీట్‌మెంట్‌కు వస్తాను సార్ అని అన్నాడు. 7 నెలల తరువాత మళ్లీ టెస్టులు చేయించాము. సిడి4 కౌంట్ 750కి పెరిగింది. అతని ఆనందానికి అంతు లేదు. మీరు నా ప్రాణాలు కాపాడరు. మీకెంతో రుణపడి ఉంటాను సార్ అన్నాడు. అతనికి మరో ఆరు నెలలు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. అతని రోగనిరోధక శక్తి బాగా పెరిగింది. ఇప్పుడు అతను ఆరోగ్యంగా ఉన్నాడు.

ADVT




**నిధి చెయ్యి చివాల్న కదిలింది. బాకు ఎండలో తళుక్కుమంటూ మెరిసింది. చిన్ని ఒక్క సారిగా కెవ్వుమంది. కళ్ళు తెరిచి, తన చేతుల్ని చూసుకుంది. కుడిచేతి ఆరో వేలూ, ఎడమ చేతి ఆరో వేలూ లేవు! అవి ఉండాల్సిన చోట రక్తం బొట్లు బొట్లుగా కారుతోంది. ఆటవిక స్త్రీలు రోదనలు ఆపేసి నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తున్నారు.**

**నిధి చిన్నిని వాళ్ళవైపు కొద్దిగా తోశాడు. "తీసుకెళ్ళండి పిల్లని. మీ రగతమ్మ తల్లికి బలిచ్చు కోండి!"**

**ఆటవిక స్త్రీలు పిచ్చిగా అరుస్తూ, వద్దన్నట్టు చేతులు ఊపుతూ, ఒక్క ఉదుటన లేచి, పరుగు లంకించుకున్నారు. కుంటి స్త్రీ గెంతుతూ పరుగెడుతోంది...**

నిధి దగ్గర్లో ఉన్న జిల్లేడుచెట్టు వద్దకు వెళ్ళాడు. క్రిందరాలిన జిల్లేడు దూదిని తీసుకున్నాడు. కొంచెం దూరంలో గుంపుగా ఉన్న మేడిచెట్ల వైపు వెళ్తూ, యువతిని రమ్మని సైగ చేశాడు.

మేడిచెట్టుకు బాకుతో చిన్నగాయం చేశాడు. జిల్లేడు దూదిని మేడిపాలతో తడిపాడు. వేళ్ళు తెగి పోయిన చోట దూదిని ఉంచాడు. తన ఉత్తరీయాన్ని చింపి, చిన్ని రెండు చేతులకూ కట్లు కట్టాడు.

"నీ వేళ్ళు పోయాయి. అయితే కంఠం దక్కింది!" అన్నాడు నవ్వుతూ.

చిన్ని చిరునవ్వుతో చూసింది. బాధా, కృతజ్ఞతా ఆమె కళ్ళల్లో దోబూచులాడుతున్నాయి.

"దేవుళ్ళా వచ్చి, దేవతకు ఆహారమై పోకుండా కాపాడావు. నువ్వు ఎవరు?" చిన్ని ప్రశ్నించింది.

"నీ అన్ననుకో!" నిధి నవ్వుతూ అన్నాడు. "నిన్ను మీ ఇంటికి చేర్చి, నా దారిన నేను పోవాలి. అన్నట్టు మీ ఊరేది?"

"గోపురం"

"గోపురమా?" నిధి ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

"ఆ... గోపురమే".

"ఈ అడవి పేరేమిటి? పేరంటూ ఉందా, ఈ అడవికి?" నిధి అడిగాడు.

"ఎందుకు లేదన్నా; ఉంది? ఇది దండకారణ్యం" చిన్ని నిధి వెంట నడుస్తూ అంది.

అంతసేపూ దారి ప్రక్కన ఉన్న రాతిదగ్గర నిలుచున్న వాయు యజమానిని చూడగానే, అతని వైపు నడవసాగింది.

***

పడమటి ఆకాశాన్ని సంధ్యారాగం నీలమూ, ఎరుపూ రంగుల సమ్మేళనంతో కను విందు చేసే వర్ణచిత్రంలా రూపొందిస్తోంది. నిధి కళ్ళు నీటికోసం, రాత్రి విశ్రమించడానికి తగిన 'నీడ' కోసం అన్వేషిస్తున్నాయి. అరణ్యమార్గం తనని ఎన్నెన్నో మలుపులు తిప్పుతూ ఎక్కడికో తీసుకెళ్తోంది! నిధి కళ్ళు మెరిశాయి. ఎదురుగా తన దారికి అడ్డంగా నది పరిగెడుతోంది. సమతల ప్రదేశం కావడం వల్ల ప్రవాహం పెద్దగా శబ్దం చేయడం లేదు. కాలిబాట వాలుగా నది వైపు వెళ్తోంది. నిధి బాటను వినయంగా అనుసరిస్తున్నాడు. కాసేపట్లో నది అంచుకి చేరుకున్నాడు. కాలిబాట నది అంచును తాకుతూ ఆగింది. నిధి అవతలి గట్టు వైపు చూశాడు. తన ముందు నీటిలో మునిగిన కాలిబాట ఆవలిగట్టు మీదికి ఎక్కు తోంది. అంటే నదికి



## జరిగిన కథ

**బాకీ**పడ్డ కప్పం వెంటనే చెల్లించాలని సుభిక్ష రాజ్య మహారాజుకు చక్రవర్తి విజయానందులు లేఖ పంపిస్తాడు. దాంతో జ్యోతిష్కుడు చెప్పినవిధంగా, మహారాజు కోరడంతో నవనిధుల సాధనకు అంగీకరిస్తాడు నిధి. అశ్వత్థామ సలహాతో, శ్వేతాశ్వాన్ని తీసుకుని, బయలుదేరిన నిధి, హరిహరపురం చేరతాడు. పాళెగాడు శరభాద్రి నాటకమాడి వాయుని స్వాధీనం చేసుకుంటాడు. అశ్వత్థామ సహాయంతో వాయుని విడిపిస్తాడు నిధి. దారిలో ఓ యువతిని ఆటవిక స్త్రీల బారినుంచి రక్షిస్తాడు.

ఆ తర్వాత...

అడ్డం పడి ప్రయాణం చేయవచ్చన్నమాట! నది ఎంత లోతుందో? దిగితేగాని తెలీదుగా లోతు!

నిధి వాయును చేతి సైగతో హెచ్చరించాడు. వాయు నిస్సంకోచంగా నీటిలోకి దిగింది. నదీ ప్రవాహంలో ఈదుకుంటూ వెళ్తోంది. నిధి కాళ్ళు తడుస్తున్నాయి. కొన్ని నిమిషాల ఈతలో వాయు నిధిని అవతలిగట్టుకి చేర్చింది. నిధి క్రిందికి దిగాడు. నీళ్ళున్నాయి. దగ్గర్లో నీడ కూడా ఉంటుంది! కొంచెం దూరంలో గుబురుగా ఉన్న పొట్టి చెట్టు ఏదో కనిపిస్తోంది. అంతసేపూ సంధ్యారాగానికి అవకాశం ఇచ్చిన చీకటి నెమ్మదిగా, మసక మసకగా ఆక్రమిస్తోంది. వెలుతురున్నప్పుడే, నది గట్టు మీద కూర్చుని అన్నం తినేస్తే! నిధి ఆలోచించాడు. చుట్టూ చూశాడు. అతనికి తల్లి గుర్తొస్తోంది. ఆకలి ఆకలని ఎంత మొత్తుకున్నా ఈ వేళప్పుడు అమ్మ అన్నం పెట్టేది కాదు. "అసుర సంధ్యరా! అసురసంధ్యలో అన్నం తినకూడదు. కాసేపాగు. దీపాలు వెలిగించి, అన్నం పెడతా!" అనేది. అసురసంధ్య అంటే రాక్షసులు తిరుగాడే సంధ్యట! ఆ సమయంలో తింటే అన్నసారాన్ని ఆ రాక్షసులు లాగేస్తారట!

నిధి అమ్మ నమ్మకాన్ని గౌరవిస్తూ చెట్టువైపు నడిచాడు. అసుర సంధ్య... ఇది నిర్జన ప్రదేశం. అరణ్యం. ఇక్కడ రాక్షసులు అధికంగా, విచ్చలవిడిగా సంచరిస్తారేమో! నిధి నవ్వుకుంటూ చెట్టు దగ్గర ఆగాడు. మర్రి ఆకుల్లా పెద్దపెద్ద ఆకులతో దట్టంగా ఉంది చెట్టు. చెట్టు ఏదో తనకి తెలీదు. ఏదో అడవిచెట్టు! కాస్సేపట్లో చంద్రుడు ఉదయిస్తాడు. వెన్నెల వెలుగును కుమ్మరిస్తాడు. వెన్నెల్లో అన్నం! నిధి చిన్నరాతి మీద కూర్చున్నాడు.

ఉదయం నుండీ జరిగిన సంఘటనలు అతనికి గుర్తొస్తున్నాయి. ఆటవిక స్త్రీలు అయిదేసి జడలు కోల్పోయి, రోదనం చేస్తూ వెళ్ళిపోయాక చిన్ని అనే పల్లెపడుచును ఆమె పల్లెకు తీసుకు వెళ్ళాడు. చిన్ని ముందు నడుస్తూ దారి చూపింది. ఆమె తన గురించి అడుగుతోంది. తను అందకుండా, పొందకుండా ఏమిటేమిటో వాగాడు. తాను ఆమె గురించి అడుగుతున్నాడు. ఆమె అన్నింటికీ చక్కగా సమాధానాలు చెప్తోంది. ఆ సంభాషణతో అలసటా, సమయమూ తెలియకుండా ప్రయాణం సాగింది.

"అదే మా ఊరు!" చేత్తో చూపుతూ ఉత్సాహంగా అంది చిన్ని.

నిధి నిలుచున్న ఎత్తయిన ప్రదేశం నుండి క్రింది భాగంలో గుంపుగా కనిపిస్తున్న గుడిసెలను చూశాడు. ఏటవాలుగా ఉన్న బాటలో ఆ ఇళ్ళవైపు నడవసాగారు. చిన్ని నిధి చేతిని తనచేత్తో తాకుతూ ఏదో సైగ చేసింది. నిధి ఆమెవైపు చూశాడు. చిన్ని చేత్తో చూపించింది. వంపులు తిరిగిన బాట వెంట ఎవరో పరుగెత్తుకు వస్తున్నారు. ఆ వ్యక్తి చేతిలో పొడుగాటి కర్ర ఉంది. రెండో చేతిలో కొడవలి లాంటి ఆయుధం.

"చెకుముకి బావ!" చిన్ని ఉత్సాహంగా అంది. "నాకోసం వస్తున్నట్టున్నాడు!"

"అలాగా! బావంటే!" నిధి ప్రశ్నించాడు.

"మేనత్త కొడుకు... నాకు... నాకు.. కాబోయే పెనిమిటి...?"

"మాంచి కండబలం ఉన్న వీరుడిలా ఉన్నాడే!"

"మరే! నీకు తెలుసా అన్నా? మా దొడ్లో గున్న ఏనుగంత పెద్ద దున్నపోతుంది. రెండు చేతుల్తో తోలుబొమ్మను ఎత్తినట్టు దాన్ని తలపైకి ఎత్తేస్తాడు!"

నిధి ఆశ్చర్యంగా చూశాడు. "నిజంగా?"

"నిజంగా అన్నా! అసత్తెం ఆడనుగా!"

"చిన్నీ! చిన్నీ!" యువకుడు అరుస్తూ దగ్గరగా వచ్చి ఆగాడు.

ఆయాసంతో వగరుస్తున్న అతని ఎద ఎగిరెగిరి పడుతోంది; కొలిమితిత్తిలా!

"చిన్నీ ఇంక రావనుకున్నానే!" చెకుముకి అన్నాడు.

"ఈయన్న రాకపోతే వచ్చేదాన్ని కాదు.. నువ్వింత ఆలస్సెం చేశావేం బావా?"

"ఆ అడివి ముండల్ని సావగొట్టాలంటే బలం కావాలిగా చిన్నీ. కూడు తిన్లేదు. అందుకని తాటి చెట్టెక్కి మూడు ముంతలు కల్లు తాగి, బలం తెచ్చుకుని, తెమిలేసరికి ఆలస్యం అయిందిలే.. ఈ మడిసెవరు?" నిధిని ఓరగా చూస్తూ అన్నాడు చెకుముకి.

"అన్న పేరు 'నిధి'. ఉత్తర దిక్కు కొండకు యాత్ర పోతున్నాడు. దండం బెట్టుకో!" చిన్ని



అంది.

చెకుముకి ఆమె మాటల్ని పట్టించుకోకుండా ఆమె చేతులకి ఉన్న కట్లను కళ్లు చిట్లిస్తూ చూశాడు. కట్టిన గుడ్డల మీద ఎండిన రక్తం మరకలున్నాయి.

"చేతులకు ఆ కట్లేంటే? ఆ రగతం మరక లేందే?" చెకుముకి ప్రశ్నించాడు.

"ఆరేసి వేళ్ళున్న ఆడకూతుర్ని వాళ్ళ దేవతకి బలిస్తారు గంద! ఆరేసి వేళ్ళులేకపోతే? ఒక ఆరో వేలు తెగిపోయిన మా అక్కను ముట్టుకోలేదుగా వాళ్ళు! ఆ సంగతి తెలిసి ఈ అన్న తెలివిగా నా చేతులకున్న రెండు ఆరో వేళ్ళని నరికి పారేశాడు!" చిన్ని ఉత్సాహంగా చెప్పింది.

చిన్ని మాట వినగానే చెకుముకి ముఖం బిగుసుకుపోయింది. కళ్ళు ఎర్ర రంగు పులుముకుంటున్నాయి. దుడ్డుకర్రనూ, కొడవలినీ పట్టుకున్న చేతుల వేళ్ళు బిగుసుకున్నాయి. చిన్నిని కాసేపు తదేకంగా చూసి చెకుముకి నిధి వైపు తిరిగాడు. ఎగాదిగా చూశాడు. "నాకు కాబోయే ఆడ తోడు వేళ్ళు తీసేయడానికి నువ్వెవరు?"

నిధి చిన్నగా నవ్వాడు. కల్లు ప్రభావంతో, ఆగ్రహంతో ఎరుపెక్కిన కళ్ళల్లోకి తదేకంగా చూశాడు.

"నువ్వెవడు అంటే ఇకిలిస్తావేం? చెప్పు?" చెకుముకి గద్దించాడు.

"బావా, విషముష్టి విత్తులు నమిలావా, కల్లుతో బాటు! ఆయన్న లేకపోతే నీకు నా మొండెం దొరికేది! పద!" చిన్ని కసిరింది.

"అట్టాగేనే! ఈ సంగతి గూడెంలో తేలుస్తా! చెకుముకి అంటే చెకుముకే!"

"ముందు నీ తల్లోకెక్కిన 'నాము' దిగనీ! పద!"

"చెకుముకి తన ఎడమ చేతిలోని మొద్దు కొడవలినీ, నిధి ఒరలో ఉన్న ఖడ్గాన్నీ చూసి, తల పంకిస్తూ వెనుదిరిగాడు. నిధీ, చిన్నీ అతని వెనకాలే నడవసాగారు...

నిధి ఆలోచనలను ఆపు చేస్తూ గుండ్రటి చందమామ తూర్పు ఆకాశంలో పైకి ఎగబ్రాకుతున్నాడు. నిధి లేచి, నదివైపు వెళ్ళాడు. చేతులూ కాళ్ళూ కడుక్కుని వచ్చాడు. వాయు ఓపికగా మోస్తున్న మూటలను విప్పుకున్నాడు. ఒకటి గుగ్గిళ్ళ మూట గుర్రానికి... చిన్ని అమ్మ గుగ్గిళ్ళు ఉడికించి ఇచ్చింది. నిధి గుగ్గిళ్ళ సంచిని గుర్రం మూతికి అమర్చాడు. వాయు తన భోజనం ప్రారంభించింది.

నిధి తన భోజనం మూట విప్పాడు. గుడ్డ లోపల వెడల్పాటి మట్టి పాత్ర ఉంది. దానిపైన మూసిన మూకుడు. నిధి మూకుడును తీసి, పక్కన పెట్టుకున్నాడు. మట్టిపాత్రలో గుండ్రటి రొట్టెలు ప్రత్యక్షమయ్యాయి. నిధి రొట్టెను తీసి మూకుడులో పెట్టాడు. రెండో రొట్టె ప్రత్యక్షమైంది పాత్రలో. రొట్టె మధ్యలో ఏదో పచ్చడి ముద్ద ఉంది. ఆ పచ్చడి నిధికి నోరూరిస్తోంది. నిధి రెండో రొట్టెను తీసి మూకుడులో పెట్టాడు. మట్టిపాత్రలో రొట్టెల క్రింద అన్నం మెరుస్తోంది. అన్నం మధ్య చిన్న మట్టిపాత్ర నొక్కి పెట్టబడి ఉంది. దానిమీద చిన్నమూత. నిధి ఆ మూత తీశాడు. చిన్న మట్టిపాత్రలో గడ్డ పెరుగు... గుండ్రంగా తెల్లగా మెరుస్తూ, ఆకాశంలోని చంద్రుడి ప్రతిబింబంలా ఉంది.

నిధి రొట్టెల్ని ఆకలితో తినేశాడు. పెరుగున్న పాత్రను పైకి తీశాడు. కొంచెం అన్నం చేతిలోకి తీసుకున్నాడు. అది బియ్యపు అన్నం కాదు. మెతుకులు మరీ చిన్నవిగా ఉన్నాయి. నిధికి అర్థమైంది. అది శ్యామాక ధాన్యంతో చేసిన అన్నం. జానపదులు ఆ ధాన్యాన్ని 'చామలు' అంటారు. శ్యామక అన్నాన్ని పెరుగుతో కలిపి, రుచి చూశాడు నిధి. కమ్మగా నోరూరిస్తున్న కొత్త రుచి. శ్యామాక ధాన్యం గురించి వినడం, చూడ్డం.... అంతే. తనెప్పుడూ తినలేదు. నిధి పెరుగన్నం నెమ్మదిగా, రుచిని ఆస్వాదిస్తూ, అయిపోతుందేమో అన్న భయంతో తినసాగాడు. ఆలోచనా ప్రవాహం మళ్ళీ అతన్ని 'గోపురం' గ్రామంలోకి లాక్కెళ్ళింది.

గ్రామం గ్రామం ఒకచోట చిన్ని ఇంటి ముందు చేరింది. చెకుముకి నిప్పులు కక్కుతూనే ఉన్నాడు.

"ఒరే అల్లుడూ... తిక్కతిక్కగా వాగుతున్నావు. పరగడుపున కల్లెవడు తాగమన్నారురా నిన్ను. ఆ వీరుడు దేముడురా! నా బిడ్డ కంఠం తెగిపోకుండా కాపాడి, తోడుండి తీసుకొచ్చాడు. నీ నేస్తం గాడు ఆ బంగారుగాడి లాగా, పిల్లను ఎగరేసుకుపోయి ఉంటే ఏం జేసేవాడివిరా!"

"ఎగరేసుకుపోయి ఉంటే తెలిసేది ఏంజేసేవాణ్ణో!" చెకుముకి గర్వంగా అన్నాడు. ఆడ కూనకి ఆరేసేళ్ళుంటే అదురుష్టం అన్నారుగా మీరంతా! ఆ




**నిధి ఉలికిపడి కళ్ళు తెరిచాడు. పైన నక్షత్రాలు లేవు. తెల్లటి మేఘాలు పరుగెడుతున్నాయి. కళ్ళు నులుముకున్నాడు. అలవాటు ప్రకారం భూమిని స్పృశించి, కళ్ళకద్దుకునే ప్రయత్నం చేశాడు. కానీ చెయ్యి కదల్లేదు. ఎవరో పట్టుకున్నట్టనిపించింది. తల పక్కకి తిప్పి చూశాడు నిధి. ఒక్కసారిగా అతని గుండె ఆగినంత పనైంది. అసలేమైంది? పక్కన ఏం కనిపించిందతనికి?**

అదురుష్టం కోసమే చిన్నిని కట్టుకోవాలనుకున్నా. అదురుష్టం వేళ్ళని తీసేయడానికి ఈ మడిసెవరు?"

"రేయ్ దున్నపోతూ! మేలుకోరా! వేళ్ళు తీసేసి, ముందు ముందు పిల్ల నరబలి అయిపోయే ప్రమాదం తప్పించాడురా. ఏ తల్లి కన్నబిడ్డో! దండం బెట్టుకుని, నీ దున్నపోతు విద్య చూపించు!" చిన్ని అయ్య అన్నాడు.

చెకుముకి తండ్రి లేచి కొడుకు దగ్గరగా వచ్చాడు. అతని భుజం మీద చెయ్యివేశాడు. "ఒరే అమాయకం బిడ్డా! కాపాడిన మడిసి మీద కసి మంచిదికాదురా! పళ్ళూ, గోళ్ళూపోతే యేంట్రా నట్టం? పిల్లదాని పీక తెగలేదురా! నీకు కాబోయే ఆడ తోడు అదురుష్టం గొప్పగా ఉంది కాబట్టే బతికొచ్చిందిరా! నువ్వు పసుపుతాడు కట్టడానికి నా కోడలు 'కంఠం' మిగిలిందిరా! ఆ ఈరుడి కాళ్ళకి దణ్ణం బెట్టి, రుణం తీర్చుకోరా! ఆనక మామ చెప్పినట్టు నీ దున్నపోతు గారడీ చూపించు!" అంటూ ఆయన కొడుకుని నిధి వైపు తీసుకెళ్ళాడు. నిధి చిరునవ్వుతో చూస్తున్నాడు.

దగ్గరగా వచ్చిన చెకుముకి క్షణకాలం అతని కళ్ళల్లోకి చూసి పాదాలు ముట్టుకోడానికి వంగాడు. నిధి అతని చేతుల్ని పట్టుకున్నాడు. చెకుముకి నిధి చేతుల్ని కళ్ళకి అడ్డుకున్నాడు.

"అన్నా.. తప్పు కూత కూసేశాను. ఏమనుకోకేం!" అన్నాడు.

నిధి చిరునవ్వు నవ్వి చెకుముకి భుజం తట్టాడు. ఎవరో ఒక దున్నపోతును లాక్కొచ్చారు. చిన్ని మాట నిజమే! ఆ దున్నపోతు గున్న ఏనుగులా ఉంది. శరీరం నిగనిగ మెరుస్తోంది. నిజంగానే చెకుముకి దాన్ని పైకెత్తుతాడా?

చెకుముకి దున్నపోతు దగ్గరగా వెళ్ళాడు. అతన్ని చూడగానే దున్నపోతు చిన్నగా చప్పుడు చేసింది. చెకుముకి ప్రేమగా దాని వీపు నిమిరాడు. కిందికి వంగి, దున్నపోతు పొట్ట క్రింది భాగంలో ముందు కాళ్ళ దగ్గర ఒక చేతినీ, వెనక కాళ్ళ దగ్గర ఒక చేతినీ ఉంచాడు. ఊపిరి బిగబట్టి, చేతుల్ని పైకి లేపాడు. విచిత్రంగా గున్న ఏనుగంత దున్నపోతు మెల్లిగా పైకి లేస్తోంది. నిధి ఆశ్చర్యంతో చూస్తున్నాడు. కాస్సేపట్లో చెకుముకి పైకి లేచి నిటారుగా నిలుచున్నాడు. దున్నపోతు అతని చేతుల మీద, తలపైన గాలిలో ఉంది! చప్పట్లు మారు మ్రోగుతున్నాయి. నిధి చప్పట్లు కొడుతున్నాడు. చెకుముకి,

ఒకసారి గుండ్రంగా తిరిగి, దున్నపోతును మెల్లగా నేలమీదికి దించాడు. సగర్వంగా చూస్తూ, నిధి దగ్గరగా వచ్చాడు. నిధి పైకి లేచాడు.

"నిజంగా అద్భుతం చెకుముకీ! నీలో కొండంత బలముంది!" నిధి మెచ్చుకున్నాడు.

చెకుముకి నవ్వాడు.

"ఆ... అదేమంత 'అద్భుతం' కాదులే నాయనా! అది మన చెకుముకి ఓర్పు. దున్నపోతు లేగదూడగా నేలమీద పడిన దినాన ప్రారంభించాడు. దాన్ని చేతుల్లో ఎత్తాడు. ప్రతి ఉదయం అదే పని! అదే సాము! దున్న బరువు పెరగసాగింది. దానితో బాటు చెకుముకి బలమూ పెరగ సాగింది. బలం కన్నా, అలవాటు ఆ సాహసం చేస్తోంది' చిన్ని నాన్న వివరించాడు.

"అనుదినమూ అలవాటుగా ఎత్తుతూ ఉంటే ఏనుగును కూడా అవలీలగా ఎత్తవచ్చు!" అనే మాట విని ఉన్నాడతను. ఇది అదే కాబోలు...

నిధి పెరుగన్నం తినడం ముగించాడు. చిన్ని అమ్మ, నాన్న బలవంతం చేస్తూ కొసరికొసరి వడ్డిస్తూ మధ్యాహ్నం భోజనం చేయించారు. పౌండ్రక పర్వతం గురించి గ్రామ పెద్దలు ఒకరి ద్దర్ని అడిగాడతను. పేరు విన్నారు గానీ, దగ్గరి దారి తెలీదు! 'శివార్జున వృక్షం' ఎటు వైపున ఉందో వాళ్ళు ఎరుగరు! ఆ పేరెప్పుడూ వినలేదు...

నిధి నదిలో చేతులు కడుక్కుని, నీళ్ళు త్రాగాడు. చెట్టు క్రింద, గుర్రం సమీపంలో ఉత్తరీయం పరిచి, విశ్రాంతిగా పడుకున్నాడు. చెట్టు చుట్టూ వెన్నెల పాలనురగలా మెరుస్తూ కళ్ళకి విశ్రాంతి ఇస్తోంది. బాల్యం నుండీ తల్లీ, తండ్రీ తనకు నేర్పిన 'లయచింతన' అనే ప్రక్రియకు చెందిన శ్లోకం పఠిస్తూ, చేతుల్ని ఎదమీద ఉంచుకుని, విశ్రాంతిగా కళ్ళు మూసుకున్నాడు నిధి. అలసిపోయిన అతడి శరీరాన్ని నిద్ర దుప్పటిలా ఆవరించింది.

***

నిధి గున్నమామిడి చెట్టు కిందున్న అరుగు మీద విశ్రాంతిగా కూచున్నాడు. చల్లగాలిలో, అలా కదలకుండా కూర్చుని, అలసట తీర్చుకోవాలనిపిస్తోంది. అస్త్రవిద్యా పరీక్షల్లో కేసరితో యుద్ధం చేసి అలసిపోయాడతను. గెలిచాడో, ఓడిపోయాడో అర్థం కావడం లేదు. ప్రస్తుతం సమస్య అదికాదు. తనకు తగని బడలికగా ఉంది. అది తీరేదాకా అలా కదలకుండా... అదిగో ఎవరో తన చేతిని పట్టి లాగుతున్నారు! ఎవరు? చెల్లెలు నవనీతా? ఎవరో స్పష్టంగా కనిపించలేదు. రాజకుమారా? ఏమో! బహుశా సుగాత్రేమో... కాదుకాదు.. జానపద యువతి... తాను కాపాడిన పిల్ల చిన్ని కావచ్చు. కళ్ళు చించుకుని చూస్తున్నాడతను. ఆకారం మాత్రం స్త్రీదే... కానీ.. రూపం స్పష్టంగా తెలియడం లేదు. తన చేతిని నవనీత ముట్టుకున్నా అర్థం ఉంది. ఆమె తన చెల్లి. సుగాత్రి పట్టుకున్నా అర్థం ఉంది. ఆమెను 'అక్క' అంటాడతను. చిన్ని పట్టుకున్నా అర్థం ఉంది. 'అన్నా' అంటుంది తనను. రాకుమారి పట్టుకోవడమే ఆశ్చర్యం కలిగించే అంశం. ఇంతకీ ఆ ఆకారం రాకుమారిదేనా?



## టాలెంట్ ఆనట్లేదట!

ఈ మాట అన్నది ఎవరో కాదు బాలీవుడ్‌కి వెళ్ళి, టాలీవుడ్‌ని విమర్శించిన తాప్సీ. బాలీవుడ్ వాళ్ళు ఆమె టాలెంట్ అంతా బయటికి లాగేస్తుంటే, టాలీవుడ్ వాళ్ళే ఆమెను గుర్తించడం లేదని అంటోంది. అయితే నటనకు ఆస్కారమున్న ఆనందో(బ్రహ్మలో ఏమాత్రం టాలెంట్‌ని చూపించిందని, మరి అంతగా తనను గుర్తించనప్పుడు ఇంకా సినిమాలు ఎలా చేయగలుగుతుందని టాలీవుడ్ జనాలు కూడా ఘాటుగానే స్పందించారు.

నిధి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. పైన నీలాకాశంలో నక్షత్రాలు లేవు. తెల్లటి మేఘాలు పరుగెడుతున్నాయి. రాత్రి గడిచిపోయింది. తాను కలగన్నట్టున్నాడు! కల కరిగిపోయింది. నిధి కుడిచేత్తో, అలవాటు ప్రకారం భూమిని స్పృశించి, కళ్ళకద్దుకునే ప్రయత్నం చేశాడు. కుడి చెయ్యి కదల్లేదు. ఎవరో పట్టుకున్నట్టు, ఎవరి పట్టులోనో ఉన్నట్టు ఉంది. నిధి కళ్ళు గట్టిగా మూసి తెరిచాడు. ఆకాశంలో మేఘాలు... మేఘాలా?! తనకు మేఘాలు కనిపించకూడదు. దట్టంగా ఉన్న చెట్టు కనిపించాలి! తను రాత్రి చెట్టుకింద పడుకున్నాడు. చెట్టు నీడ వదిలి నీలాకాశం క్రిందకు ఎలా వచ్చాడు? నిద్రలో దొర్లుకుంటూ, పొర్లుకుంటూ... నిద్రలో అటూ ఇటూ కదిలే అలవాటు లేదే తనకు. నిధి కుడిచేతిని ముఖంమీదికి తెచ్చే ప్రయత్నం చేశాడు. చెయ్యి కదల్లేదు. ఎవరో పట్టుకున్నట్టనిపిస్తోంది. తిమ్మిరెక్కిందా? పట్టుకున్నట్టు అనిపిస్తున్న స్పర్శ మెత్తగా ఉంది. నిధి తల తిప్పి చూశాడు. ఒక్కసారిగా అతని గుండె ఆగినట్లయింది.

తన తలకు కొంచెం దూరంలో ఎవరో యువతి కూర్చుని ఉంది. ఆమె చేతిలో తన కుడి చెయ్యి ఉంది. ఆమె ముఖం తనవైపు తిరిగి ఉంది. ఆ ముఖం మీద చిరునవ్వు నాట్యం చేస్తోంది.

నిధి ఒక్క ఉదుటన లేచి కూర్చున్నాడు. సూర్యుడు పైకి ఎగబ్రాకుతున్నాడు.

"ఎ.... ఎవర్నువ్వు?" నిధి కంఠం వణికింది.

"నీ క్షేమం కోరిన స్త్రీని?" ఆమె కంఠధ్వని కోమలంగా ఉంది.

"నేనెక్కడున్నాను? ఇక్కడికి ఎందుకు తీసుకువచ్చావు?" నిధి ప్రశ్నించాడు.

"పరిసరాల్ని పరిశీలించు! ఎక్కడున్నావో తెలుస్తుంది" యువతి తన విశాలనేత్రాలతో నవ్వును ప్రతిఫలిస్తూ అంది.

నిధి అప్రయత్నంగా చుట్టూ చూశాడు. ఎదురుగా నది ఉంది. అయితే... అయితే నదిలో నీళ్ళు లేవు. నది అవతలి గట్టు వైపు చూశాడు. తనను గత సాయంత్రం నదీతీరానికి చేర్చిన కాలిబాట అలాగే ఉంది. ఆ చెట్లూ, పొదలూ తనకు గుర్తే. నదిలో నీళ్ళు ఏమయ్యాయి? ముఖ్యంగా తను ఏ చెట్టుకింద పడుకున్నాడో ఆ చెట్టు... నిధి అటూయిటూ ఆత్రుతగా చూశాడు. పచ్చటి గొడుగులా ఉండే, తనకు ఆశ్రయం ఇచ్చిన చెట్టు లేదు!

'ఏమిటీ మాయ? ప్రదేశాన్ని దాదాపుగా పోలిన మరో ప్రదేశం ఉంటుందా? ఉందా? తను కొత్త ప్రదేశానికి తీసుకురాబడ్డాడా? ఆ యువతి తీసుకు వచ్చిందా? ఎలా తీసుకు వచ్చింది? తనను మోసుకుని తెచ్చే శక్తి ఆమెలో ఉందా? నిధి గుండె ఒక్కసారి ఝల్లుమంది. అసుర సంధ్య... రాక్షసులు సంచరించే వేళ... ఆమె.. ఆమె. రాక్షసా? దయ్యమా?' నిధి ఆరిపోతున్న పెదవులను నాలుకతో స్పృశిస్తూ ఆమె వైపు తిరిగాడు.

"నిజం చెప్పు! ఎవర్నువ్వు?"

"ఊహించు!"

"నువ్వు మోహినీ పిశాచానివి! ఏ రూపాన్నైనా ధరించగలిగిన పిశాచానివి! అవునా?"

"కాదు!" ఆమె చిన్నగా నవ్వింది.

"నన్ను ఎందుకు ఈ కొత్త ప్రదేశానికి చేర్చావు? ఎలా చేర్చావు?" నిధి గద్దించాడు.

ఆమె మళ్ళీ నవ్వింది. "ఇది కొత్త ప్రదేశం కాదు, నేను నిన్ను మోసుకురాలేదు. కొంచెం దూరం లాక్కొచ్చాను. నువ్వు గాఢ నిద్రలో ఉన్నావు. నీ గుర్రాన్నీ కొంచెం దూరం తీసుకువచ్చాను. చూడు!"

నిధి ఆమె చూపుతున్న వైపు చూశాడు. వాయు విశ్రాంతిగా నిలుచుని తమవైపే చూస్తోంది. "ఇది కొత్త ప్రదేశమే! నాకు తెలుసు! నువ్వు... నువ్వు... ఏదో... మాయ.."

ఆమె కిలకిల నవ్వింది. లేచి నిలుచుంది. "లే! నాతో రా! ఇది కొత్త ప్రదేశం కాదని నిరూపిస్తా".

నిధి కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"భయపడుతున్నావా?" యువతి నవ్వింది. ఆ నవ్వులో ఎగతాళి లీలగా ధ్వనించింది.

నిధి చివాల్న లేచాడు. అతని కాలు దేనికో తగిలింది. తలదించి చూశాడు. తన కత్తి, దాని పక్కనే బాకు. వంగి వాటిని అందుకోబోయాడు.

"ఆయుధాల అవసరం నీకు లేదు!" ఆమె వారిస్తున్నట్టు అంది.

"నా వల్ల నీకు ఏ ఆపదా రాదు. వచ్చినా నీ ఆయుధాలు ఆపలేవు, రా! నీ కళ్ళతో చూడు!"

ఆమె వయ్యారంగా నదివైపు నడుస్తోంది. "నదీతీరాన్ని జాగ్రత్తగా చూడు. నిన్న సాయంత్రం అదిగో... అక్కడే నువ్వు నదిని దాటావు. కొంచెం దూరంగా, కుడిచేతి వైపున.."

"నువ్వు చెప్తోంది నిజమా?" నిధి కంఠం వణకింది.

ఆమె చిన్నగా నవ్వింది. "అబద్ధాలాడి నీ నుంచి నేను పొందేదీ, పొందదగిందీ, పొందాల్సిందీ ఏదీలేదు. నీ ప్రయాణంలో, రాత్రి సంభవించిన భూకంపం గుర్తులు, నీకు సాక్షాత్కరిస్తాయి. నువ్వే స్వయంగా.."

"నా ప్రయాణం! నీకేం తెలుసు?"

"తెలుసు. ఆ మాత్రం తెలుసుకో చాలు! మళ్ళీ చెప్తున్నా. రాత్రి అక్కడెక్కడో దారుణమైన భూకంపం సంభవించింది. వృక్షాలూ, నదులూ, చిన్నకొండలూ నాశనమైపోయాయి. ఆ భూకంప ప్రభావం ప్రకంపనలుగా ఈ ప్రాంతాన్ని తాకింది. ఆ ఫలితాన్ని నువ్వు చూస్తున్నావు. ఇంక... రా... అక్కడ కూర్చుని మాట్లాడుకుందాం!" యువతి నిర్లక్ష్యంగా నడవ సాగింది.

"నేను గుబురుగా ఉన్న చెట్టు క్రింద పడుకున్నాను.." నిధి ఆవేశంగా అన్నాడు.

"ఆ ప్రదేశం చూద్దువుగానీ రా!" అంటూ ఆమె కుడివైపు తిరిగి నడవసాగింది. ఆమె మాటలు తన మీద మంత్రాల్లా పని చేస్తున్నట్టనిపిస్తోంది నిధికి. ఆమె... కామినీ పిశాచా?"

"ఇదిగో గొయ్యి! నీకు ఆశ్రయం ఇచ్చిన చెట్టు ఉన్న ప్రాంతం ఇదే.." ఆమె ఒకచోట ఆగి అంది.

నిధి కళ్ళు పెద్దవిచేస్తూ చూశాడు. ముందు పెద్ద గొయ్యి ఉంది! విశాలంగా లోతుగా ఉందా గొయ్యి.

"నీ చెట్టు ఈ గోతిలో పడిపోయింది. భూగర్భంలో మట్టి క్రింద నిక్షిప్తమైపోయింది.

"ఎందుకు? ఏమైంది?" నిధి అసంకల్పితంగా అడిగాడు గోతిలోకి తొంగి చూస్తూ.

"భూమి ప్రకంపించింది!"

"ఏమిటీ?" నిధి అరిచాడు.

"భూ ప్రకంపన మూలంగా గొయ్యి ఏర్పడింది. అరణ్యంలో పైభాగాన, యోజనాల దూరంలో భూకంపం సంభవించింది. ఆ ప్రాంతంలో భూమి భయానకమైన చీలికగా మారి రాళ్ళనీ, నదినీ కబళించి, తనలో లయం చేసుకుంది. నదీప్రవాహం భూమిలోకి అదృశ్యమైంది. అందుకే ఇక్కడ నదిలో నీళ్ళు లేవు..."

నిధి ప్రయత్నం లేకుండానే అతని కాళ్ళు ఆమె వెంట కదుల్తున్నాయి.

"కూర్చో నిధీ!" అందామె ఇందాక నిధి మేల్కొన్న చోట ఆగి.

నిధి నిర్ఘాంతపోతూ చూశాడు. "నా పేరు... నీకెలా తెలుసు?"

ఆమె పెదవులు కదిలి చిరునవ్వుని సృష్టించాయి. "తెలుసు. నువ్వు ఎవరో కూడా తెలుసు. అందుకే నిన్ను రక్షించాను".

"నిజం చెప్పు! నన్ను ఎందుకు రక్షించావు?"

"ఆమె చిన్నగా నవ్వింది. "నిన్న ఆ పల్లెటూరి పిల్లను నువ్వు ఎందుకు రక్షించావు?"

నిధి క్షణకాలం ఆమెను ఆశ్చర్యంగా చూశాడు. "... ఆమె.. ఆమె... ప్రాణాపాయ స్థితిలో ఉంది. అందుకు రక్షించాను. అది సహజమైన స్పందన!"

"నువ్వు కూడా ప్రాణాపాయ స్థితిలో పడ్డావు రాత్రి. అందుకే రక్షించాను. నేను చెయ్యి పట్టి నిన్ను ఈ సురక్షిత ప్రదేశానికి లాక్కురాకపోయి ఉంటే ఆ గోతిలో నువ్వు భూస్థాపితం అయిపోయి ఉండేవాడివి!"

"నువ్వు... నువ్వు... ఎవరు?" నిధి ఆశ్చర్యాన్ని అదుపులో పెట్టుకుంటూ ప్రశ్నించాడు.

"నిదానించి నన్ను చూడు. ఊహించు! కనిపెట్టగలవేమో చూడు!" ఆమె చిన్నగా నవ్వింది.

నిధి అంతసేపూ ఆమెను పరికించి చూడలేదని గ్రహించాడు. కన్నార్పకుండా పైనుంచీ క్రిందికీ, క్రిందినుండి పైకీ పరిశీలనగా చూస్తూ ఉండిపోయాడు. ఆమె ముఖం గుండ్రంగా, పున్నమి చందమామలా ఉంది. చక్కని ముక్కు. అర్ధచంద్రుడి ఆకారంలో ఉన్న నుదురుమీద ధనురాకారంలో కనుబొమలు. అందాల కనుబొమల క్రింద వెలిగిపోతున్న విశాల నేత్రాలు.

నిధి చూపులు మళ్ళీ పైకి ప్రాకాయి. నిగనిగలాడుతూ, నీలం రంగు జలపాతంలా మోకాళ్ళదాకా జారిన శిరోజాలు! శిరోజాలు చందమామ వెనక ఉన్న నీలిమేఘంలా ఉన్నాయి. ఆమె శరీరం బాగా మగ్గిన జామపండు వర్ణంలో ఉంది. గోధుమ రంగు వస్త్రాలు ఆమె అందాన్ని కోటి రెట్లు పెంచుతున్నాయి. ఆకుపచ్చగా మెరుస్తున్న మరకతాలు పొదిగిన ఆభరణాలు ఆమె శరీరం మీద ధగధగలాడుతున్నాయి. ఎర్రటి పెదవులు సమ్మోహనకరమైన చిరునవ్వుకి ప్రాణం పోస్తున్నాయి.

"నేను ఎవరినో కనిపెట్టావా!" ఆమె ప్రశ్నించింది.

నిధి మంత్రముగ్ధుడిలా అడ్డంగా తల ఆడించాడు. ఆమె నిసర్గ సౌందర్యం అతడిని తాత్కాలికంగా మగవాణ్ణి చేసింది.

"దగ్గరగా గాలివాటంగా రా! నా శరీరాన్ని వాసన చూడు! అప్పుడు ఊహించగలవేమో చూద్దాం!"

నిధి కాళ్ళు కదిలి అతన్ని ఆమె దగ్గరకు చేర్చాయి. నిధి ఘ్రాణేంద్రియం ఆమె శరీర గంధాన్ని ఆఘ్రాణిస్తోంది. వాసనలు చూడ్డమే తన పని అయిపోయింది! అప్పుడు అశ్వత్థామ! ఇప్పుడు ఈ అందాల భామ!

"ఎలా ఉంది, నా శరీర గంధం!"

"నిజం చెప్తాను..." నిధి సాలోచనగా అన్నాడు. "దున్నిన చేలో చినుకులు పడితే పరిసరాల్లో కమ్మగా, హాయిగా, ఆహ్లాదకరంగా వ్యాపించే మట్టి వాసనను గుర్తుకు తెస్తోంది నీ శరీర గంధం.."

"నిజం చెప్పావు! ఇప్పుడు చెప్పు, నేనెవర్నో!" యువతి నవ్వుతో అంది.

"చెప్పలేను" నిధి బలహీనంగా అన్నాడు.

"ఆమె అతని వైపు చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో ఎగతాళి లేదు. "పేరు చెబుతాను. నేనెవరో చెప్పు. చెప్పనా?"

"చెప్పు"

"నా పేరు.. అవని"

"అవని? ఆ పేరును బట్టి నువ్వెవరో ఎలా చెప్పగలను?" నిధి తేలిగ్గా అన్నాడు.

"ఇంకొక ఆధారం ఇస్తాను" ఆమె అంది. "ప్రతీ ఉదయమూ నిద్ర లేవగానే, సముద్రవసనే దేవీ! పర్వతస్తనమండలే! విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే!!" అనే శ్లోకం పఠిస్తూ ఎవర్ని కుడిచేత్తో స్పృశిస్తావు?"

"భూదేవిని" నిధి మంత్రముగ్ధుడిలా అన్నాడు.

"నేనే ఆ భూదేవిని! 'అవని' నా నామధేయాల్లో ఒకటి!"

**(ఇంకా వుంది)**



**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్స్
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# ఆస్తమా, సైనసైటిస్‌లకు హోమియోతో శాశ్వత పరిష్కారం

**ఆస్తమా, సైనసైటిస్....** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు ఆస్తమాగా మారే అవకాశం ఉంటుంది.

కారణాలేంటి ? సైనస్‌లో ఉండే డిఫెన్స్ మెకానిజం చాలా వరకు సూక్ష్మక్రిములు శరీరంలోకి రాకుండా అడ్డుకుంటుంది. కానీ 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, దూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి ఆస్తమాకు, సైనసైటిస్‌కు కారణమవుతాయి.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినప్పుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం, పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది. పిల్లికూతలు ఉన్నంత మాత్రాన ఆస్తమాగా నిర్ధారణకు రాకూడదు. పరీక్షలు చేయించిన తరువాతే నిర్ధారణకు రావాల్సి ఉంటుంది.

**హోమియో వైద్యం :** మూల కారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. సైనసైటిస్, ఆస్తమా సమస్యలు సమూలంగా తొలగిపోతాయి.

# మైగ్రేన్ తలనొప్పి జాడే ఉండదు

కొందరికి తలనొప్పి వచ్చిందంటే వెలుతురు చూడలేరు, చిన్న శబ్దాలను వినలేరు. తలనొప్పి అంత తీవ్రంగా వుంటుంది. మరి కొందరికి రెండు, మూడు రోజులకొకసారి తలనొప్పి వస్తూనే ఉంటుంది. తలనొప్పితో పాటు వాంతులు, తలతిరగడం వంటి లక్షణాలుంటాయి. ఏ పని చేసుకోలేకపోతారు. నెలలో 10 రోజులు ఆఫీసుకు సెలవు పెట్టాల్సివస్తుంది. ఏదైనా పనిచేస్తున్నప్పుడు తలనొప్పి మరింత తీవ్రతమవుతుంది. తీవ్రమైన తలనొప్పి వల్ల ఏ పనీ చేసుకోలేకపోతాను. వికారం, వాంతులు, వెలుతురు చూడలేకపోవడం, శబ్దాలను వినలేకపోవడం వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణం ఏమై ఉంటుంది ? :** సైనసైటిస్‌తో బాధపడే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. తీవ్రమైన ఒత్తిడికి గురయ్యే వారిలోనూ తలనొప్పి ఉంటుంది. కాబట్టి ముందుగా కారణాలను తెలుసుకునే ప్రయత్నం చేయాలి. మెదుడులో కొన్ని రకాల కెమికల్స్ విడుదల కావడం, రక్తనాళం, ఎన్‌లార్జ్‌మెంట్ కావడం వంటివి తలనొప్పికి కారణమవుతుంది. అలర్జీ, లైట్, పెర్‌ఫ్యూమ్, స్ట్రెస్, స్మోకింగ్, ఆల్కహాల్, సమయానికి భోజనం చేయకపోవడం వంటి కారణాలు అందులో ఉంటాయి.

**హోమియో చికిత్స తరువాత :** మైగ్రేన్ సమస్యకు ఇతర చికిత్సా విధానాల్లో పరిష్కారం లేదనే చెప్పవచ్చు. ఇతర చికిత్సల్లో లక్షణాలు తగ్గించేందుకు చికిత్స ఇస్తారే తప్ప మూలకారణాన్ని తొలగించేలా చికిత్స ఉండదు. నాలుగు రోజుల తరువాత మళ్లీ మామూలే అవుతుంది.కానీ హోమియోచి కిత్సఅ లాకాదు.వ మూలకారణాన్ని తొలగిస్తుంది. మైగ్రేన్‌కు కారణమవుతున్న నరాలను సాధారణ స్థితికి తీసుకువస్తుంది. కెమికల్స్ విడుదలను అడ్డుకుంటుంది. ఫలితంగా మైగ్రేన్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. సమస్య మళ్లీ పునరావృతం కావడం అంటూ ఉండదు.

# నడుమునొప్పి, మెడనొప్పి, సయాటికాకు హోమియో తో పరిష్కారం

**నడుం నొప్పి :** నడుము భాగంలో నొప్పి వుస్తున్నట్లయితే లుంబార్ స్పాండిలోసిస్ అంటారు. నడుము నొప్పి మూలంగా ఏ పనీ చేసకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. లుంబార్ స్పాండిలోసిస్‌తో దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది. కొందరిలో వెన్న చివరి భాగంలో నొప్పి వస్తుంటుంది. దీన్ని సాక్రం పెయిన్ (టేల్ పెయిన్) అంటారు.

**మెడనొప్పి :** ఇటీవల కాలంలో ఎక్కువ మంది మెడ నొప్పి సమస్యతో ఆసుపత్రుల చుట్టూ తిరగడం కనిపిస్తోంది. మెడ భాగంలో వచ్చే ఈ నొప్పిని సర్వైకల్ స్పాండిలోసిస్ అంటారు. మెడ, వెన్నుపూసలో మార్పులు రావటం వల్ల నరాల మీద ఒత్తిడి పడి ఈ సమస్య తలెత్తుతుంది.

**కీళ్లనొప్పులకు** సంబంధించిన వ్యాధులలో సయాటికా ఒకటి. శరీరంలో అతి పొడవైన నరం సాయటికా. ఇది తొడల నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు దాకా వ్యాపించి ఉంటుంది. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనంది న పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవు తాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది. సయాటిక్ నరం ఒత్తిడికి గురి కావడం వల్ల వచ్చే సమస్య కావడం చేత దీనికి సయాటికా అన్న పేరు స్థిరపడింది.

మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ,
కరీంనగర్, విశాఖపట్నం, తిరుపతి
ఫోన్: 7842 108 108, 7569 108 108

V6 **లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2.30 కి**
**సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2.30 కి**
**10 టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4.30 కి**
**డాక్టర్ గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.**




**కృష్ణుడు తమ భర్తకావాలని కాత్యాయనీవ్రతాన్ని ఆచరించారు గోపికలు. యమునాతీరం చేరుకున్నారు. అక్కడ పొదరింట, తాము ధరించిన దుస్తులు విడచి, స్నానాలు చేసేందుకు నీటిలోకి ప్రవేశించారు. కొంటెకృష్ణుడు గమనించాడది. గోపికలు దాచిన దుస్తుల్ని మూటగట్టాడు. ఆ మూట సహా దగ్గరలోని కడిమిచెట్టెక్కి కూర్చున్నాడు. స్నానానంతరం దుస్తులుకోసం వెదకి, అవి కనిపించక పోవడంతో కృష్ణుడు దొంగిలించాడని తెలుసుకున్నారు గోపికలు. మళ్ళీ నీటమునిగి మానాన్ని కాపాడుకున్నారు. దుస్తులిమ్మని ప్రాధేయపడ్డారు కృష్ణుణ్ణి. దుస్తులివ్వాలంటే ఎలా ఉన్నవారు అలా రావాలన్నాడు కృష్ణుడు. తర్జనభర్జనల అనంతరం అలాగే వచ్చారు గోపికలు. అయితే ఉరువుల మధ్య భాగాన్ని చేతుల్తో ఆచ్ఛాదించారు. అది చూసి సన్నగా నవ్వుకున్నాడు కృష్ణుడు. అన్నాడిలా.**

# విప్రవనితల అన్నప్రదానం:మోహావేశం

శృంగారవతులారా! మీకెందుకు అంత సిగ్గు? నేనెవరు? చిన్నప్పటి నుండీ మీతో ఆడి పాడి పెరిగినవాణ్ణేకదా? పైగా మీ అంతరాంతరాన ఉన్నది నేనేకదా? మీలో నాకు తెలియంది లేదు. కాత్యాయనీ వ్రతాన్ని అంత నిష్ఠగా ఆచరించి, నియమాలు పట్టించుకోకుండా వివస్త్రలై నీటిలో ప్రవేశించారే, ఎంత తప్పు చేశారు? వ్రతఫలితాన్ని చేజేతులా వదలుకుంటారా, చెప్పండి.

వదలుకోలేం అన్నట్టుగా తలలాడించారు గోపికలు. జాలిగా చూశారు.

అయితే వ్రతఫలితం అందాలంటే...చక్కగా చేతులెత్తి నాకు నమస్కరించండి! మీమీ దుస్తులు తీసుకోండి అన్నాడు కృష్ణుడు.

వివస్త్రలై నీట మునిగిన కారణంగా వ్రతఫలితం అందకుండాపోతోందిట! ఎంతపని చేశాం? చేసిన తప్పులు చాలు! చేతులెత్తి నమస్కరిద్దాం అనుకున్నారు గోపికలు. కృష్ణుడు చెప్పినట్టుగానే నుదుటన చేతులు ఉంచుకుని, భక్తిపూర్వకంగా నమస్కరించారతనికి. వ్రతాన్ని మధ్యలో వదలివేసినా, గోవిందనామస్మరణతో వ్రతఫలితం ఇట్టే సంప్రాప్తిస్తుంది. అలాంటిది గోవిందుణ్ణి కట్టెదుట చూస్తోంటే వ్రతఫలితం అందకుండాపోతుందా? ఆ సంగతి తెలియని గోపికలు, కృష్ణుడు చెప్పినట్టుగానే నమస్కరించి, వ్రతఫలితం కోల్పోలేదనుకున్నారు. కృష్ణుడప్పుడు ఎవరిదుస్తులు వారికి అందించాడు. దుస్తులు దొంగిలించినా, నవ్వినా, నవ్వులపాలు చేసినా వ్రతఫలితాన్ని అందించాడు కృష్ణుడు. చాలది. అందుకు అతనికి ఋణపడి ఉండాలనుకున్నారు గోపికలు. అమందానందభరితులయ్యారు. కపటంగా ప్రవర్తించవచ్చు. మనసులు నొప్పించవచ్చు. పరిహసించవచ్చు. ప్రాణేశ్వరుడు ఏది చేసినా, అది కామినులకు అందమే కదా!

కృష్ణుడు అందించిన దుస్తులు ధరించారు గోపికలు. అంతులేని అనురాగంతో చూశారతన్ని. వారి మనసులోని కోరిక తెలిసిన కృష్ణుడు, వారితో అన్నాడిలా.

సుందరాంగులారా! మీరు చెప్పకపోయినా మీ మనుసులోని కోరిక నాకు తెలుసు. ఎప్పుడూ నన్నే ఆరాధించాలన్న మీ అభిమానమూ, మీనోమూ తప్పక ఫలిస్తాయి. నన్ను ఆరాధిస్తే మోక్షమే ప్రసాదిస్తాను, అలాంటిది మీ చిన్నపాటికోరికను నేను తీర్చలేనా చెప్పండి. మీ కాత్యాయనీవ్రతం సంపూర్ణంగా ముగిసిన తర్వాత నా సాంగత్యభాగ్యం మీకు తప్పక లభిస్తుంది. వెళ్ళిరండి.

కృష్ణుని మాట చాలు! కోరికలకోట సాధించినట్టే ననుకున్నారు గోపికలు. దేవదేవుని రూపాన్నేకాదు, అతని పాదపద్మాలను కూడా మనసులో ధ్యానించుకుంటూ వారంతా ఇంటిదారిపట్టారు.

గోపికలు అటు వెళ్ళగానే ఇటు మిత్రులను సమీపించాడు కృష్ణుడు. వారితో గోపరిపాలన చేస్తూ, గోవర్ధనగిరి దాటాడు. ముందుకు వచ్చాడు. ఆసరికి సూర్యుడు గగనమధ్యంలో ప్రవేశించాడు. ఎండ ప్రచండమైంది. దుర్భరమైంది. తట్టుకోలేక పోయారు గోపాలురు. గొడుగుల్లా ఉన్న పెద్దపెద్ద చెట్లనీడకు పరుగుదీశారు. సేదదీరారు. అప్పుడు బలరామకృష్ణులతో అన్నారిలా.

పూజ్యులారా! ఈ చెట్ల ఔదార్యాన్ని గమనించారా? ఇవి ఎవరికీ హాని తలపెట్టవు. ఏకాంతప్రదేశాల్లో నివసిస్తాయి. చలి, గాలి, ఎండలనుండి మనల్ని రక్షిస్తాయి. పువ్వులతో, పళ్ళతో కనువిందుచేసి, కడుపు నింపుతాయి.

అవును అన్నట్టుగా సన్నగా నవ్వాడు కృష్ణుడు. ఏ చెట్టునీడన తానున్నాడో ఆ చెట్టును ప్రేమగా చేత్తో నిమిరాడతను. పదండి అంటే పదండి అంటూ అక్కణ్ణుంచి బయల్దేరారంతా. ఆలమందలు సహా చల్లనినీడల్లో నడచి నడచి యమునాతీరం చేరుకున్నారు. యముననీరుతాగి, ఆలమందలు దాహం తీర్చుకున్నాయి. దాహం తీర్చుకుని మళ్ళీ మేత మేస్తోంటే వాటిని ఓ కంటకనిపెడుతూ బలరామకృష్ణులుసహా మిత్రబృందం అంతా ఓ చెట్టు నీడలో విశ్రమించారు.

కాసేపటికి మిత్రబృందం ఆకలిగా ఉన్నదన్నది. తట్టుకోలేకపోతున్నాం! తరుణోపాయం చూడమని కృష్ణుణ్ణి వేడుకున్నది. అన్న బలరామునితో చర్చించి, చెప్పాడిలా కృష్ణుడు.

మిత్రులారా! ఈ అరణ్యమధ్యంలో విప్రులు కొందరు అంగిరసం అన్న యజ్ఞాన్ని నిర్వహిస్తున్నారు. అక్కడకి వెళ్ళి, మా పేర్లు చెప్పి, మీ ఆకలి తీర్చమని వేడుకోండి. తప్పక తీరుస్తారు. అలాగే మా ఆకలి కూడా తీర్చమని చెప్పండి. అన్నాన్ని ప్రసాదించమనండి.

తప్పకుండా అన్నారు మిత్రులు. పరుగుదీశారటువైపు. విప్రులను సమీపించారు. నమస్కరించారు వారికి. చెప్పారిలా.

గోపరిపాలన చేసి చేసి బలరామకృష్ణులుసహా మేమంతా అలసిపోయాం. ఆకలికి తట్టుకోలేక పోతున్నాం. అన్నపానీయాలను అర్థించమని ఆ మహానుభావులే మమ్మల్ని మీ దగ్గరకు పంపారు. మీరు ధర్మవేత్తలు. మేము చెప్పగలిగిందేమీ లేదు. అలసిన వారికి అన్నం పెట్టడం మీకు అలవాటే కదా! మాకింత అన్నంపెట్టి, అలాగే బలరామకృష్ణులకు కూడా ఇంత అన్నం అరిటాకులో పెట్టి...అంటూ చురచురా చూస్తున్న వారి చూపుల్ని తట్టుకోలేక ఆగారు.

గొల్లపిల్లలు బలరామకృష్ణులు చెప్పినంత మాత్రాన, మీ ఆకలి తీర్చి, వారి ఆకలి తీర్చేందుకు ఆహారాన్ని అరిటాకుల్లో పెట్టి ఇవ్వాలా? జరగదు. వెళ్ళండి అని కసురుకున్నారు విప్రులు. బలరామకృష్ణుల్ని వారు ఒట్టి గొల్లపిల్లలని తలచారు. వారి యథార్థస్వరూపాన్ని గుర్తించలేకపోయారు. చేసేది లేక మిత్రబృందం కృష్ణుణ్ణి సమీపించింది. జరిగిందంతా వివరించింది. సన్నగా నవ్వి, అప్పుడు అన్నాడిలా కృష్ణుడు.

మీరిక ఆ బ్రాహ్మణులను అర్థించకండి! వెళ్ళి, వారి పత్నులను అర్థించండి. ఆ సాధ్వీమణులు

**గోపరిపాలన చేసి అలసిపోయింది మిత్రబృందం. ఆకలికి తట్టుకోలేకపోయింది. కృష్ణుణ్ణి తరుణోపాయం అడిగింది. కృష్ణుడప్పుడు వారిని అంగిరస యజ్ఞం చేస్తున్న విప్రుల దగ్గరకు పంపించాడు. మిత్రబృందం చెప్పిన మాటల్లోని యథార్థాన్ని గుర్తించలేకపోయారు విప్రులు. అన్నప్రదానానికి తిరస్కరించి వెళ్ళిపొమ్మని కసురుకున్నారు. అప్పుడు కృష్ణుడు ఏం చేశాడు?**



మన ఆకలి తీరుస్తారు. ఇంత అన్నం పెట్టి తప్పకుండా ఆదరిస్తారు.

కృష్ణుడు చెప్పినట్టుగానే గోపాలురు విప్రవనితలను ఆశ్రయించారు. చేతులు జోడించి, వారికి నమస్కరించారు. చెప్పారిలా.

అమ్మలారా! అడవిలో ఆవులు మేపి, అలసి ఆకలితో అల్లాడిపోతున్నాడు గోవిందుడు. ఇంత అన్నం ప్రసాదించమన్నాడు. అందుకే మేం వచ్చాం.

కృష్ణుడు అడవిలో ఉన్నాడు. ఆకలితో అల్లాడిపోతున్నాడు. అయ్యయ్యో అనుకున్నారు విప్రవనితలు. ఒకపక్క కృష్ణుడిపట్ల జాలిచెందుతూ మరోపక్క కృష్ణుని చూసేందుకు ఆసక్తి కనబరుస్తూ త్వరత్వరగా వంటలు కావించారంతా. భక్ష్యాలు, భోజ్యాలు, లేహ్యాలు, చోష్యాలు, పానీయాలు మొదలైన ఆహార పదార్థాలు పెద్దపెద్ద కుండల్లో పెట్టుకుని బయల్దేరారు. కుమారులు, అన్నదమ్ములు, భర్తలు వద్దు వద్దంటున్నా వినిపించుకోలేదు. పరుగుదీశారు. తన కోసం ఆత్మీయుల్ని కాదనుకుని పరుగుదీస్తున్న వనితలనుచూసి ముచ్చటపడ్డాడు కృష్ణుడు. వారు ఇంకా పరుగుదీసి అలసిపోకుండా ఉండేందుకు సమీపంలోని ఓ అశోకవృక్షం కింద ప్రత్యక్షమయ్యాడు. కృష్ణుడే! కృష్ణుడే అంటూ వనితలంతా కృష్ణుణ్ణి చూసి ఆగిపోయారు. భువనమోహనంగా కనిపిస్తున్న అతనిని కళ్ళనిండుగా చూసుకుంటూ నోట మాటలేకుండాపోయారు. మనసులో కృష్ణుణ్ణి గట్టిగా కౌగలించుకున్నారు. తాపం తీర్చుకున్నారు. కోరికలన్నీ కృష్ణుడే! ఆశలన్నీ కృష్ణుడే! కృష్ణుడుంటే చాలు, ఎవరూ ఏదీ అక్కరలేదనుకున్న విప్రవనితల మనసు తెలుసుకుని, మురిసిపోయాడు గోవిందుడు. సన్నగా నవ్వాడు. అడిగాడిలా.

భామినీమణులారా! మీరంతా క్షేమమేకదా? మీరేం కావాలని వచ్చారిక్కడకి? మీకు నేనేం ఇవ్వగలను? సిగ్గుపడకండి! అడగండి!

ఎవరూ మాట్లాడలేదు.

నాకు భక్ష్యభోజ్యాలర్పించి, నన్ను తనివిదీరా చూసుకోవాలని వచ్చారా? చూశారు కదా! వెళ్ళిరండి. మీలాగే నిస్వార్థంగా నన్ను సేవించినవారందరికీ వారి కోరికలు తీరి, ఆనందం వారిని అన్నివేళలా అంటి ఉంటుంది. మీ భర్తలు చేపట్టిన యాగం పరిసమాప్తి కావాల్సి ఉంది, ఆలస్యం చేయకండి, వెళ్ళిరండి అన్నాడు కృష్ణుడు.

వెళ్ళాలా? అని బాధగా ఒకరినొకరు చూసుకున్నారు వనితలంతా. తర్వాత బాధగా కృష్ణుణ్ణి చూశారు. అడిగారిలా.

కృష్ణా! నువ్విలా మాట్లాడడం తగదు. ఆత్మీయులంతా వద్దని వారించినా వినక మేము నిన్ను చేరుకున్నాం. వచ్చింది నీకోసమే, నీతో ఇక్కడ ఉండిపోయేందుకే వచ్చాం. వెళ్ళమంటే వెళ్ళలేం. వెళ్ళినా మమ్మల్ని మావారు స్వీకరించరు. అయినవాళ్ళను కాదనుకుని వచ్చినందుకు కరుణించి మమ్మల్ని స్వీకరించు. కనీసం నీ దాసీలుగానైనా మమ్మల్ని అనుగ్రహించు.

కాదని వచ్చి, తిరిగివెళ్తే కసిరికొడతారని భయం అక్కరలేదు. మీపై ఎవరూ ఆగ్రహించరు. నా అనుగ్రహం మీకెప్పుడూ ఉంటుంది. నాకింత అన్నాన్ని ప్రసాదించిన మీకు దేవతలంతా అభయాన్ని ప్రసాదిస్తున్నారు. నా సాంగత్యం మోక్షప్రదమేగాని, సౌఖ్యప్రదంకాదు. నా సంకీర్తనంవల్ల, నా సందర్శనంవల్ల, నా కథలూ గాథలూ వినడంవల్ల, నన్ను ధ్యానించడంవల్ల మీరంతా కర్మబంధవిముక్తులై దివ్యధామం చేరుకుంటారు. అదే అందం, అదే ఆనందం అని గ్రహించండి అన్నాడు కృష్ణుడు. వనితలంతా ఆ మాటలకు తేలికపడ్డారు. కృష్ణునికి భక్ష్యభోజ్యాలను అందజేశారు. వాటిని ఆవురావురంటూ మిత్రులసహా ఆరగించాడు కృష్ణుడు. చూసి ఆనందించారు వనితలు. కాసేపటికి కృష్ణుని వీడ్కొని అక్కణ్ణుంచి నిష్క్రమించారు. ఆశ్రమాలకు చేరుకున్నారు. జరిగిందంతా భర్తలకు చెప్పారు. భార్యలు చెప్పిందంతా విని, తప్పు చేశామనుకున్నారు విప్రులు. పశ్చాత్తాపం చెందారు.

అయ్యయ్యో! మోసపోయాం. ఆడవారికి ఉన్న వివేకం మనకి లేకుండాపోయింది. కృష్ణుని సందర్శించుకోలేకపోయాం. ఆయన సన్నిధి చేరుకోలేకపోయాం. మనకన్నా దురాత్ములు లేరు. పాపాత్ములు లేరు. మనసునిండా కల్మషాన్ని నింపుకుని యజ్ఞయాగాదులూ, తీర్థయాత్రలూ చేసి ప్రయోజనం ఏం ఉంది? జపం, తపం, వేదాధ్యయనం, హోమాలు ఇవేవీ లేని, తెలియని వనితలే శ్రీకృష్ణదేవుని సందర్శనభాగ్యాన్ని దక్కించుకున్నారు. మనకి అన్నీ ఉన్నాయి, తగినంత భక్తే లేకుండాపోయింది. దాంతో ఎవరేమిటో తెలుసుకోలేకపోయాం. వ్యర్థులమయ్యాం. దేవతలగురువులనూ, మహాయోగీంద్రులనే సమ్మోహింపచేయగల ఆ కృష్ణునికి మనం ఏపాటి? అందుకే మనల్ని అజ్ఞానాంధకారంలో కూలదోశాడు. ఏదీ తెలుసుకోలేకపోయాం. క్రతువులు, ధర్మం, మంత్రతంత్రాలు, కాలం, దేశం, దైవం, వహ్నులు, విప్రులు మొదలైన ప్రధాన పవిత్రపదార్థాలన్నీ కృష్ణుడే! అలాంటి కృష్ణుడు అన్నం అడిగితే లేదు పొమ్మన్నాం. గొల్లపిల్లవాడని ఈసడించుకున్నాం. ఎంతపని చేశాం. అయిందేదో అయింది. కంసుడంటే భయంవల్ల కృష్ణుణ్ణి అందరిముందూ కాదనుకున్నా, అంతరంగంలో అతనిని అర్చించుకుందాం. అదే పదివేలు అనుకున్నారు విప్రులు.

చేసిన తప్పుని క్షమించమని కృష్ణుణ్ణి మనసులో ప్రార్థించారు.

కొద్దిరోజులు గడిచాయి.

ఆనాడు ఏకాదశి. ఉపవాసనియమం నిర్వర్తించాడు నందుడు. రాక్షససంచారనియమం తెలుసుకోలేకపోయాడు. తెల్లవారుజాముకి ముందుగానే యమునాతీరం చేరుకున్నాడు. స్నానం చేసేందుకు జలప్రవాహం మధ్యలోకి ప్రవేశించాడు. చూశాడది ఓ వరుణదేవుని దూత. ఎంతపనిచేశాడెంతపని చేశాడనుకున్నాడు. నందుణ్ణి పట్టి బంధించాడు. వరుణలోకానికి తీసుకునిపోయాడతన్ని.

యమునాతీరానికి వెళ్ళిన నందుడు ఎంతసేపటికీ తిరిగిరాలేదు. ఆందోళనచెందారు గోపాలురంతా. బలరామకృష్ణులకి ఆ సంగతి తెలియజేశారు. గోలు గోలున విలపించారు.

—అరణి




(గతవారం తరువాయి)

**మా చిన్నతనం నుంచి మాకు సినిమాలు చూడటం బాగా అలవాటు. విడుదలైన సినిమాను ఫస్ట్ ఆటకే కాకపోయినా, కాస్త ఆగి వెళ్లి చూసేవాళ్లం. పరీక్షలప్పుడు మాత్రం మా పెద్దవారు సినిమాలకు వెళ్లనిచ్చేవారు కాదు.. పరీక్షలు అయ్యాక రెండు సినిమాలో, మూడు సినిమాలో చూడమని పంపేవారు. మా ఊర్లో ఆచారం ఎలా ఉండేదంటే, ఆడపిల్లల్ని మాత్రం పెద్దవాళ్లు వెంట ఉండి తీసుకెళ్లేవారు. మగపిల్లల్ని 'కుర్రాళ్లందరూ కలిసి వెళ్లండ్రా' అని పంపేవారు. సినిమా అనగానే అందరం ఏలూరు వెళ్లేవాళ్లం. ఏలూరు వెళ్తే నాకు అదనపు ఆదాయమన్నమాట. అదెలాగంటే అక్కడ మా మేనమామలు, బాబాయిలకు రకరకాల షాపులు ఉండేవి. నేను తప్పకుండా వాళ్లషాపులకు వెళ్లి కనిపించేవాడిని. 'ఏరా ఇలా వచ్చావ్' అనేవారు. 'సినిమాకు వచ్చాను' అని చెప్పగానే, 'ఇదిగో ఈ రెండు రూపాయలు తీసుకెళ్లరా' అని ఇచ్చేవారు. వాటిని తీసుకెళ్లడం, సినిమా అయ్యాక హోటళ్లకు వెళ్లడం, తినడం.. ఇవన్నీ చాలా సరదాగా ఉండేవి. అలా నేను చూసిన ఫస్ట్ సినిమా పేరు... మ్...మ్... గుర్తురావడం లేదు.**

ఉంటుందని అభిప్రాయం. నేనేమో 'మా ఏలూరులో వెంకటేశ్వర థియేటర్ బ్రహ్మాండం' అనేవాడిని. 'పెద్దయ్యాక ఓడలాంటి కారు కొనాలి, గెయిటీ థియేటర్‌లాంటి సినిమా థియేటర్ ఒకటి కట్టాలి' అని రోజుకు ఒక్కసారైనా అనేవారు ఆయన. మేం ఇంటర్ సెకండ్ ఇయర్ చదువుతుండగా మా కాలేజీకి ఒకసారి నాగేశ్వరరావుగారు, పేకేటిగారు వచ్చారు. నాగేశ్వరరావుగారు అప్పుడు 'వజ్రోత్సవ పర్యటనలు' చేశారు. అంటే 60 సినిమాలు పూర్తయిన సందర్భంగా ఆంధ్రదేశం మొత్తం పర్యటన చేశారన్నమాట. అప్పుడే ఆయన పక్కనే పేకేటి శివరామ్‌గారు కూడా ఉన్నారు. అలా నేను సినిమా

# ఉద్యోగమా? వ్యాపారమా?

అయితే నాకు చిన్నప్పటి నుంచి కూడా నాగేశ్వరరావుగారి సినిమాలు చూడ్డం ఇష్టం. సావిత్రి అంటే చాలా ఇష్టం. జానపద సినిమాలంటే మరీ ఇష్టం. రాజులు, రాణులు, గుర్రాలు, కత్తులు, కటార్లు.. ఇవన్నీ చూడ్డానికి చాలా ఇంట్రస్టింగ్‌గా ఉండేవి. ఆ తరహాచిత్రాల్లో ఎన్టీ రామారావుగారు, కాంతారావుగారిని స్క్రీన్‌మీద చూస్తుంటే చాలా బావుండేది. అలా వాటన్నిటినీ చూసి ఎంజాయ్ చేసేవాడినేతప్ప, సినిమాల్లోకి వెళ్లాలి, నటించాలి అనే ఆలోచన ఎప్పుడూ లేదు. అందుకే మా బావగారి ఫ్రెండ్ మలయాళీ వ్యక్తి సినిమాల్లోకి వెళ్లమని అన్నప్పుడు కూడా నాకేం పెద్దగా ఆసక్తి కలగలేదు. రంగుల సినిమాకన్నా పచ్చటి అడవి నన్ను ఎక్కువగా ఆకర్షించేది మరి.

## కృష్ణ అంతరంగాలు..!

నా పరిస్థితి ఇలా ఉంటే, కృష్ణగారి పరిస్థితి మరోలా ఉండేది. ఆయన ఎప్పుడూ బయటపడేవాడు కాదు కానివ్వండి... ఆయన ధ్యాస మొత్తం సినిమాలమీదే ఉండేది. ఆ విషయం నేనెలా కనిపెట్టానంటే ఆయన మాట్లాడే పదిమాటల్లో తొమ్మిదిపదాలు సినిమాలకు సంబంధించినవే ఉండేవి. ఆయనకు తెనాలిలో గెయిటీ థియేటర్ చాలా గొప్పగా





నటుల్ని చూడ్డం ఇంటర్‌లోనే తొలిసారి.

## నాకిష్టం లేదు

కర్ణుడిచావుకు వంద కారణాలన్నట్టు కృష్ణగారు, నేను ఇద్దరం ఇంటర్‌లో ఫెయిల్ అయ్యాం. ఇప్పుడున్నట్టే అప్పుడు కూడా ఇంటర్మీడియెట్ రెండేళ్లు ఉండేది. అది పూర్తయ్యాక డిగ్రీ కూడా రెండేళ్లు చదవాలన్నది అప్పుడున్న నియమం. కానీ మా ఇంటర్ పూర్తయ్యేనాటికి కొత్త సిస్టమ్ వచ్చింది. ఇంటర్ రెండేళ్లకు బదులు పీయూసీ అని ఒక్క ఏడాది చేశారు. డిగ్రీని మూడేళ్లకు పొడిగించారు. ఇంటర్‌లో మొదటి సంవత్సరం పాసై, రెండో ఏడాది తప్పినాసరే, పీయూసీ కింద లెక్కగట్టి వారిని కూడా డిగ్రీ కాలేజీల్లోకి అనుమతించారు. వెంటనే కృష్ణగారు డిగ్రీలో జాయినైపోయారు. అంతకు ముందునుంచీ మా నాన్నగారు డిగ్రీలో చేరమని నాతో చాలాసార్లు చెప్పారు. నేను వినలేదు. కృష్ణగారు కూడా చేరారని తెలిసి ఇంట్లో వాళ్లందరూ నాకు మరోమారు చెప్పి చూశారు. అయినా చదువు కంటిన్యూ చేయడానికి నేనెందుకో ఇష్టపడలేదు. ఈ లోపు మా ఇద్దరు సిస్టర్స్‌కి పెళ్ళిళ్ళు అయ్యాయి.. ఇంట్లో ఉన్న ఆస్తులు తరిగిపోయాయి. నాన్నగారు బిజినెస్‌లో దెబ్బతిన్నారు. ఆయన దెబ్బతినడానికి మా సిస్టర్స్ పెళ్ళిళ్ళు కారణం కాదు. అసలు విషయం వేరే ఉంది. అదేం

టంటే, మా నాన్నగారికి పాలిటిక్స్ అంటే ప్రాణం. మితిమీరిన ధ్యాస దానిపైనే ఉంచేవారు. దాంతో ఆయనకు తొలి ప్రాధాన్యం రాజకీయాలు. రెండోది వ్యాపారం అయ్యాయి. నేను సెలవుల్లో ఆదిలాబాద్‌కు వెళ్లినప్పుడు నాకు ఈ విషయం అవగతమైంది. మహాజాగ్రత్తగా ఉండటంతో నేను ఉన్నన్ని రోజులూ మాత్రం వ్యాపారంలో లాభాలు కనిపించేవి. నేను చదువుకోసం మా ఊరు రాగానే సొంతం కుంటుపడేది. మొత్తం గుమస్తాలమీద వదిలేసి నాన్నగారు పాలిటిక్స్‌మీద తిరిగేవాళ్లు. గుమస్తాలు సరిగా లెక్కలు చెప్పేవారు కాదు. వాళ్లూ, వీళ్లూ తిన్నంత తిని మిగిలింది నాన్నగారి చేతిలో పెట్టేవారు. దాన్ని కూడా ఆయన రాజకీయాల్లోనే ఖర్చుపెట్టేవారు. అప్పట్లో ఆదిలాబాద్ జిల్లాకి మా నాన్నగారు కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా కూడా చేశారు. అలా ఫైనాన్షియల్‌గా దెబ్బతిన్నామన్నమాట. సరిగ్గా నా ఇంటర్ పూర్తయ్యేనాటికి మా ఇంట్లో పరిస్థితి ఇది. దాంతో నా వాలకం ఎలా తయారైందంటే ఇంటర్ ఫెయిల్ కావడంవల్ల చదువు మీదకూ ధ్యాస పోలేదు. అలాగని వ్యాపారం చేద్దామంటే డబ్బులేదు. ఉద్యోగం చేద్దామంటే డిగ్రీ లేదు. ఏం చేయాలో తెలియలేదు. రోజూ ఖాళీగా కూర్చునేవాడిని. నేనే కాదు.. ఊళ్లో నా ఈడు వాళ్లు, డిగ్రీలో చేరిన వాళ్లు, చేరని వాళ్లు.. ఇలా కొంతమంది ఓ అరుగుమీదకు చేరేవాళ్లం. మాకు తెలిసిన కబుర్లన్నీ చెప్పుకునేవాళ్లం. ఎవరో గంట కొట్టినట్టు మధ్యాహ్నం భోజనానికి ఇళ్లకు చేరుకునేవాళ్లం. తిని పడుకుని లేచి సాయంత్రానికి మరలా ఒకచోట కలిసేవాళ్లం. పేకాటలో అడ్డాట అని ఒకటి ఉంటుంది. నలుగురు కలిసి ఆడాలన్నమాట. ఇద్దరు ఒక టీమ్, ఇద్దరు మరో టీమ్. సాయంత్రానికి అందరం పేకలు పట్టుకుని దర్శనమిచ్చేవాళ్లం. కూర్చుని జట్టుగా పందేలు కట్టుకునేవాళ్లం. గెలిచిన వాళ్లకు ఓడినవాళ్లు సాయంత్రం మిఠాయికొట్టులో ఏదో ఒక మిఠాయి తినిపించాలి.. అలాంటివన్నమాట అప్పట్లో మేం కట్టుకున్న పందేలు. ఏదైనా కొత్త సినిమా వచ్చినా, జానపద చిత్రాలు వచ్చినా మధ్యలో సినిమాలు చూసేవాళ్లం. నా లైఫ్ ఇలా సాగుతుండేది.

## కృష్ణగారు ఆ క్షణమే హీరో అయిపోయారు

ఒకసారి కృష్ణగారు మా ఊరుకు వచ్చారు. క్షేమసమాచారాలన్నీ అయ్యాయి. నా తోటివాళ్లు కొంతమంది అప్పటికే ఆయనకు పరిచయం ఉండటంతో పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం. ఆయన వెళ్లబోతున్నవాడల్లా ఆగి 'మా కాలేజీలో యానివర్సరీ ఉంది. మీరు రావాలి' అని పిలిచారు. సరేనని నాతోటి వాళ్లను కొంతమందిని తీసుకువెళ్లా. కాలేజీ యానివర్సరీకి తిలక్‌గారు వచ్చారు. అప్పటికే డైరెక్టర్‌గా ఆయనకు చాలా మంచి సినిమాలు తీస్తారనే పేరుంది. 'ఉయ్యాల జంపాల' వంటి సినిమాలకు జనాల్లో మంచి ఆదరణ ఉంది. కాలేజీ మొత్తం విద్యార్థులతో నిండిపోయింది. తిలక్‌గారు స్టేజ్‌మీద కూర్చున్నారు. అక్కడి నుంచి సైగలు చేస్తున్నారు.. జనాల్లో ఉన్న మేమందరం ఒకరి మొహాలు ఒకరం



**చిన్నప్పటినుంచీ మురళీమోహన్‌గారికి అక్కినేని సినిమాలంటే ఇష్టం. సావిత్రి అంటే ఇష్టం. జానపద సినిమాలు ఇష్టంగా చూసేవారు. జానపద సినిమాల్లో ఎన్టీఆర్‌నీ, కాంతారావునీ స్క్రీన్‌మీద చూడ్డం ఆయనకు మహాఇష్టంగా ఉండేదితప్ప నటించాలనే కోరిక లేదు. కానీ కృష్ణగారి ధ్యాసమొత్తం సినిమాలమీదే ఉండేది. ఒకసారి కాలేజీ వార్షికోత్సవానికి దర్శకుడు తిలక్ వచ్చారు. అప్పుడు ఏం జరిగిందంటే....**

చూసుకుంటున్నాం. 'తెల్ల చొక్కా వేసుకున్న కుర్రాడిని పిలవండి' అన్నారు. దాదాపు అందరం తెల్లచొక్కాల్లోనే ఉన్నాం. ఎవరినని అనుకోవాలి? చివరికి ఎలాగైతేనేం.. 'నన్నా... నన్నా..' అని తమకి తాము ఉలికిపడుతున్న మనసుల నుంచి కదిలి ఆయన చూపు కృష్ణగారిమీద పడింది. 'నన్నాండీ..' అని సైగ చేశారు కృష్ణగారు. 'అవునయ్యా.. నిన్నే. ఇలారా' అని పిలిచారు ఆయన. డైరెక్టర్‌గారు పిలవగానే జనాలందరిలోనూ ఒకరకమైన ఉత్సాహం, సందడి మొదలయ్యాయి. తిలక్‌గారు ఆ సౌండ్ పట్టించుకోకుండా 'నీ పేరు ఏంటయ్యా' అన్నారు.

'కృష్ణమూర్తి అండీ' అని ఇటు సమాధానం.

'ఏ ఊరేంటి మీది' మళ్లీ ప్రశ్న.

'తెనాలి దగ్గర బుర్రిపాలెం అండీ..' ఇటు సమాధానం.

'ఏం చదువుతున్నావ్?' పెద్దాయన వాకబు

'డిగ్రీ రెండో సంవత్సరం చదువుతున్నానండీ' కృష్ణగారి మాట.

'సినిమాల్లో నటిస్తావా?..' ఈసారి ప్రశ్న సూటిగా, అనూహ్యంగా ఉంది. కృష్ణగారికి షాకింగ్‌గా అనిపించింది.

'సినిమాల్లోకి వస్తావా?' ఈసారి కాస్త గట్టిగా అడిగారు తిలక్‌గారు.

ఏం చెప్పాలి? అంత పెద్దాయన అలా గభాల్న అడిగేసరికి ఏం పాలుపోక.. 'ఊ.. ఆ.. ఊ.. స..రే.. వ,..స్తా..ను' అని అవునన్నట్టూ.. కాదన్నట్టూ తల ఎటు ఊపుతున్నారో స్పష్టం లేకుండా, ఏదో పొడి పొడిగా సమాధానం చెప్పారు కృష్ణగారు.

మాలాంటి వారిని ఎంతమందిని చూసుంటారూ తిలక్‌గారు. గాబరాను అర్థం చేసుకుని,

"సరే.. ఇప్పుడు నేనింకా సినిమా మొదలుపెట్టలేదు. ప్రీ ప్రొడక్షన్ కాస్త పూర్తి కాగానే నేను నీకు లెటర్ రాస్తాను. వద్దువుగానీ' అన్నారు.

'అలాగేనండీ' అన్నారు కృష్ణగారు.

ఆ మాట కాలేజీ మొత్తం క్షణాల్లో పాకిపోయింది. ఇక చూస్కోండి, కాలేజీలో కృష్ణగారు పెద్ద వీఐపీ అయిపోయారు. సినిమాల్లో ఒక్కషాట్ అయినా చేయకుండానే, ఆ క్షణమే హీరో అయిపోయారు. నిజానికి అప్పటిదాకా ఆయన్ని ప్రత్యేకంగా ఎవరూ పట్టించుకునేవారు కాదు. ఎర్రగా బుర్రగా ఉన్నాడని అనుకునేవారేతప్ప ఇలాంటి గ్లామర్ ఉండేది కాదు. 'తిలక్‌గారు పిలిచి హీరోఛాన్స్ ఇస్తానని చెప్పారట' అనే వార్తతో ఒక్కసారిగా క్రేజ్ వచ్చేసింది. దాంతో కాలేజీలో వాతావరణం పూర్తిగా మారిపోయింది. అప్పటిదాకా కృష్ణగారిని ఒక్కసారైనా పలకరించనివారు కూడా ఆయనతో ఎక్కువగా తిరగసాగారు.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# తురగా కృష్ణమోహనరావు హాస్యకథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

# టైమెుచూజాగు

మానస

**'టైమెుచూజాగు....! టైమెు చూజాగు–' ఏదో మంత్రోచ్చారణలా పాడుకుంటున్నాడు సుధాకర్.**

**'టైమెుచూజాగునా? అంటే...?' ఆశ్చర్యంగా అడిగింది సుజాతని స్నేహితు రాలు ఇందిర.**

**'అవును. టైమెుచూజాగునే! ఆయ నలా పిచ్చివాడిలా ఆయన్లో ఆయన అలాగే గొణుక్కుంటూ ఉంటాడులే, వది లేయ్' అంది అసహనంగా సుజాత.**

'వదిలేస్తాగానీ... అంటే ఏమిటో ముందు చెప్పు నాకు' మళ్ళీ అడిగింది ఇందిర.

'నా బొంద, అంటే ఏమిటో నాకు తెలిసిచస్తే కదా... నువ్వే అడుగు సుధాకర్‌ని' చిరాగ్గా అంది సుజాత.

'టైమెుచూజాగు అంటే ఏమిటి సుధాకర్ గారూ!' ఉత్సుకతతో అడిగింది ఇందిర.

'టైమెుచూజాగునే...!' అన్నాడు సుధాకర్ పేపర్ చదువుకుంటూ ఆ పని మీదే ఉండి.

'అదే బడాయి. వదిలెయ్యవే ఇందిరా. మనం చేసుకోవాల్సిన పనులు లక్ష ఉన్నాయి. పద, డాబా మీద కూర్చుని మాట్లాడుకుందాం. రాధ, మణి మాల, శారద మరో ఐదునిమిషాల్లో వచ్చేస్తారు. ఈ సీజన్లో మనం వెళ్ళాల్సిన పేరంటాలూ, ఇచ్చుకో వాల్సిన వాయినాలూ, పుచ్చుకోవాల్సిన వాయి నాలూ చాలా ఉన్నాయి' అంటూ స్నేహితురాలిని తీసుకుని లోపలికి వెళ్ళిపోయింది సుజాత.

'హ... హ... హ... టైమెుచూజాగు!' అను కుంటూ నవ్వుకున్నాడు సుధాకర్ పేపర్లోంచి తల బైటికి పెట్టి.

***

'నీ దగ్గర ఎర్రవో యాభై ఉన్నాయా, నా దగ్గర ఆకుపచ్చవి డెబ్బై ఎక్స్‌ట్రా ఉన్నాయి. ఎక్స్ఛేంజ్ చేసు కుందాం' సుజాత ఇందిరను అడిగింది.

'అలాగే' అంది ఇందిర. వెంటనే చిన్నపిల్లలు స్టాంపులూ, కాయిన్సూ ఎక్స్ఛేంజ్ చేసుకున్నట్టు బ్లౌజుపీసులు మార్చుకున్నారు స్నేహితురాళ్ళిద్దరూ. ఆనక రాధ, మణిమాల, శారద కూడా తమ దగ్గర ఎక్కువ ఎక్కువగా ఉన్న నీలం, పసుపు, గోధుమ రంగు బ్లౌజుపీసుల్ని ఎక్స్ఛేంజ్ చేసుకున్నారు.

ఇప్పుడు ఆ ఐదుగురు స్నేహితురాళ్ళు సుజాత, ఇందిర, రాధ, మణిమాల, శారద స్నేహితులందరి దగ్గరా ఇంచుమించు సరిసమానమైన రంగుల్లో బ్లౌజుపీసులున్నాయి. వాయినాలు ఇచ్చుకోడం, పుచ్చుకోడం మొదలుపెట్టారు.

ఇది ముప్ఫైఏళ్ళ క్రితం సంగతి.

***

మళ్ళీ అలా వాయినాలు ఇచ్చుకోడం, పుచ్చుకో డంలో ఎవరి పద్ధతి వాళ్ళది!

ఉదాహరణకి సుజాత పాతిక బ్లౌజు పీసుల్ని సంచిలోవేసుకుని ఓపెద్ద ఇంటికి పేరంటానికి వెళ్ళిపోతుంది. అక్కడ వాయినం పుచ్చుకుని, అక్కడే ఉన్న ఓ పదిహేను ఇరవై మందికి తను తెచ్చిన బ్లౌజుపీసులు, పసుపు, కుంకుమ పొట్లాలు



బొట్టుపెట్టి ఇచ్చేస్తుంది. అలా వాయినాలు పుచ్చు కున్న పేరంటాళ్ళు సుజాతకి బొట్టుపెట్టి మళ్ళీ వాళ్ళ వాళ్ళ ఇళ్ళకి పిలుస్తారు. 'తప్పకుండా వస్తా వదిన గారూ, అక్కయ్య గారూ, బామ్మగారూ' అంటూ వాళ్ళ అడ్రసులు తన నోటు బుక్కులో రాసుకుని, ఠంచనుగా వాళ్ళవాళ్ళ ఇళ్ళకువెళ్ళి వాయినాలు తెచ్చేసుకుంటుంది వారం పదిరోజుల్లో. అలా పేరంటా లకోసం వెళ్ళినప్పుడు, ఆ ఇంటి పక్కవాళ్ళో అదే అపార్ట్‌మెంట్‌లో ఉండేవాళ్ళో అక్కడికక్కడే బొట్టు పెట్టి పిలిచి బ్లౌజుపీసుల్తో వాయినాలు ఇస్తుం టారు. సుజాతకు అవి బోనస్. మొత్తం అవన్నీ రంగులవారిగా తీసి జాగ్రత్తగా అలమార్లలో సర్దే సుకుంటుంది సుజాత.

**వాళ్ళంతా స్నేహితులు. పండుగలు, నోములు, వ్రతాలు లాంటి ప్రతి సందర్భంలోనూ చాలా పద్ధతిగా వాయినాలిచ్చి పుచ్చుకోవడం, పోటీలు పెట్టుకోవడం వాళ్ళకి అలవాటు. కానీ వాళ్ళను చూసినప్పుడల్లా సుజాత భర్త 'టైమొచూ జాగు' అంటూ ఏడిపిస్తుంటాడు. దాని అర్థ మేంటో వాళ్ళకి చాలా ఏళ్ళుగా అంతుబట్టడం లేదు. అదొక మిస్టరీగా మారిపోయింది. అదేంటో మీరూ తెలుసుకోండి.**

ఇందిరది ఇంకో పద్ధతి. తనూ ఓ పాతిక బ్లౌజు పీసుల్ని సంచిలో వేసుకుని తనకు తెలిసిన నలుగురైదుగురు ఇళ్ళకు వెళ్తుంది. అక్కడ వాళ్ళని పట్టుకుని, మీ పక్కవాళ్ళింటికి వెళ్ళొద్దాం పద, నలుగురికీ ఇవాళే వాయినాలిచ్చేద్దాం, మళ్ళీ నాకిబ్బంది రావచ్చు' అంటూ సెంటిమెంటల్‌గా అభ్యర్థిస్తుంది. వెళ్ళినచోటల్లా 'ఇస్తినమ్మ వాయనం, పుచ్చుకుంటినమ్మ వాయనం' అవుతుంది. పేరంటాల ట్రిప్పులు పూర్తయి ఇంటికి తిరిగివచ్చేసరికి సంచిలో వేసుకున్న పాతికతోపాటు మరో ఐదో, పదో రకరకాల బ్లౌజుపీసులొచ్చేవి. అవన్నీ ఇందిర కూడా రంగులు ప్రకారం జాగ్రత్తగా దాచుకుంటుంది.

మణిమాలకి బద్ధకం ఎక్కువ. పేరంటానికివెళ్ళి ఇంట్లోకి తిరిగివస్తూనే టీవీ సీరియల్ రంధిలో పడిపోతుంది. శనగలు, తమలపాకులు, అరటిపళ్ళు, కమలాలు ఏవైతే అవి అలా కుళ్ళి బ్లౌజు పీసులకు అంటుకుని మచ్చలు మచ్చలు అవుతుంటాయి. మణిమాల ఆనక తీరిగ్గా వాటిని ఆరబెట్టి ఆ మచ్చల బ్లౌజుపీసుల్ని డిజైన్, ప్రింటెడ్ బ్లౌజుపీసులుగా తీర్చిదిద్ది జాగ్రత్త చేసుకుంటుంది. రాధ, శారద కూడా వాళ్ళవాళ్ళ వినూత్న పద్ధతుల్లో బ్లౌజు పీసుల్ని జమ చేసుకుంటారు, కాపాడుకుంటుంటారు.

***

శ్రావణ మంగళవారం, శ్రావణ శుక్రవారం, శ్రావణ పౌర్ణమి, సత్యన్నారాయణ వ్రతం, సావిత్రీ గౌరీవ్రతం, అక్షయతృతీయ, దుర్గాష్టమి, సరస్వతీ పూజ, మహానవమి, విజయదశమిలతో కూడిన శరన్నవరాత్రులు, క్షీరాబ్ధిద్వాదశి, కార్తీకపౌర్ణమి, మంగళ గౌరీవ్రతం లాంటి పండగలు, వ్రతాలతోపాటు కనీ వినీ ఎరుగని కొత్తకొత్త పూజలూ, సందర్భాలు కూడా వాళ్ళ లిస్టులో చేర్చుకుంది సుజాతబృందం. ఎవరు ఎవరింటికెళ్ళినా సంప్రదాయబద్ధంగా వాయినాలు ఇచ్చుకోడం, పుచ్చుకోడం మొదలెట్టి దాన్నే ఆనవాయితీగా చేసుకున్నారు. వారివారి ఇతర స్నేహితులకీ, బంధువులకీ, తెలిసినవాళ్ళకీ అదే అలవాటు చేశారు.

భక్తి, సంప్రదాయపరమైన ఆచారాలతోపాటు ఈ వాయనాల్లో కొన్ని గేములూ, సరదాలూ, పోటీలూ, కిట్టీపార్టీలు కూడా జొప్పించి మురిసిపోతుంటారా స్నేహితురాళ్ళు.

ఓసారి అలా ఓ పెద్దపోటీ అనంతరం స్నేహితురాళ్ళు ఒకచోట కలుసుకునేముందు,

'ఏవండీ, మన ఎనభైతొమ్మిదవ నంబరు ఎరుపుదీ, డెబ్బైఆరవ ఆకుపచ్చదీ, నూటపద్నాలుగో నంబరు నీలంరంగుదీ, నూటయాభైతొమ్మిదవ మస్టర్డ్‌కలర్‌దీ... వెట్టిముండలు, బుజ్జిముండలు, మన బ్లౌజుపీసులు ఆత్మీయంగా మళ్ళీ నా దగ్గరకే తిరిగి వచ్చేశాయండీ! నేనే గెలిచాను. ఐదుగుర్లో నేనే ఫస్టు, అంటూ సంబరం పట్టలేక భర్త సుధాకర్‌తో చెప్పింది సుజాత.

'ఏవిఁటనుకున్నావే పిచ్చిమొహమా, దినదినాభివృద్ధి చెందుతున్న టైమొచూజాగు పథకం మహిమ అది!' అన్నాడు సుధాకర్ తన సహజధోరణిలో.

'మీరూ, మీ పిచ్చి సణుగుడూను... ఎప్పుడూ ఒకటే సణుగుడు! ఆనందాన్ని ఎంజాయ్ చెయ్యడం తెలీదు. మీకసలు ఏదీ చెప్పకపోవడమే బెటర్' అంటూ గబగబా మిగిలిన నలుగురు స్నేహితురాళ్ళకీ ఫోన్లు చేసింది.

***

ఫోన్లో సుజాత ఇన్విటేషను అందుకుని ఇందిర, రాధ, మణిమాల, శారద కుటుంబాలతో సహా సుజాత ఇంటికి వచ్చారు. వారు పెట్టుకున్న పోటీలో స్థానాలు ఏవైనా, అందరూ గెలిచినందుకు, వాళ్ళ గేము జయప్రదం అయినందుకు స్నేహితురాళ్ళంతా చాలా సంతోషంగా ఉన్నారు.

'వాయినాలిచ్చుకున్న బ్లౌజుపీసులు ఎవరికెన్ని తిరిగివస్తే అంతగొప్ప! అని మేము పెట్టుకున్న గేములో, మా కృషితో, మా ఐకమత్యంతో మేమంతా గెలిచాం' అంది సుజాత.

'ఓ అదా సంగతి! శభాష్ టైమొచూజాగు.... వర్ధిల్లు... వర్ధిల్లు!' అన్నాడు సుధాకర్.

అసహనంగా చూసిన సుజాత 'ఇంక మీ గొణుగుడు ఆపుతారా, లేదా? మేమంతా ఒకళ్ళ కొకళ్ళం ఎంత కష్టపడితే తిరిగి వాటిని సాధించగలిగామో మీకు తెలుసా?' రెట్టించింది సుజాత.

'ఎందుకు తెలీదూ! పాపం టైమొచూజాగులు! ఎక్కడికిపోతాయి వెట్టిమొహాలు? స్కీముల మీద స్కీములు పెట్టినట్టు తెలుగు కేలండర్లో ఉన్న పండగలూ, పూజలతోపాటు రకరకాల కొత్త పూజలూ, పేరంటాలూ,



సందర్భాలూ పెట్టిమరీ వేటాడి వెంటాడి వెనక్కి లాగేసుకుంటుంటే విలవిలలాడిపోతున్న 'టైమొ చూజాగులు' మీకు దొరక్క, బందీలు కాక ఛస్తాయా?' అన్నాడు సుధాకర్ ముసిముసిగా నవ్వుతూ.

చిర్రెత్తుకొచ్చిన సుజాత, 'ఏళ్ళ తరబడి చూస్తున్నా, ఏవిటండీ మీ దిక్కుమాలిన గొణుగుడు? ఏవిఁటీ 'టైమొ చూజాగు' అంటూ అసహనం పరాకాష్ఠగా నిలదీసి అడిగింది సుధాకర్‌ని.

'అవునండి సుధాకర్‌గారూ, ఎప్పుడూ 'టైమొ చూజాగు, టైమొచూజాగు' అంటుంటారు, సారీ గొణుగుతుంటారు. మీ ఆవిడ అడిగిందని కాదు గానీ, ఏళ్ళ తరబడి మేమూ చూస్తున్నాం కాబట్టి అడుగుతున్నాం, ఈ 'టైమొచూజాగు' అంటే ఏవిటో ఇవాళ చెప్పితీరాలి మీరు!' అని సుధాకర్‌ని పట్టుబట్టి నిలదీశారు ఇందిర, రాధ, మణిమాల, శారద కూడా.

'ఇందాకేచెప్పా. ఆ నోరులేనివీ, గడుసుతనం లేనివీ, అలసటన్నదే తెలియనివీ, ఒకచోటా ఒక ఇంట్లో అని కాకుండా ఒక ఊళ్ళో, ఒక దేశంలోకాకుండా, ఒక అల్మారలో, ఒక షెల్ఫ్‌లో, ఒక ప్లాస్టిక్ కవర్‌లో, ఒక సంచిలోనే కాకుండా అన్నాళ్ళూ అలుపెరగకుండా తిరిగిన బ్లౌజు పీసులు ఇక శోషొచ్చి మీకు దొరికిపోయాయి కాబట్టి మీరంతా గెలిచారు. అరే, అదంతా 'టైమొచూజాగు' మహిమ అన్నానంతే' అన్నాడు సుధాకర్ తెలివిగా మాటమారుస్తూ.




అసహనంలో పరాకాష్ఠను మించిన పరిస్థితిలో ఉన్న అతనిభార్య సుజాతతోసహా ఆ ఐదుగురు స్నేహితురాళ్ళు సుధాకర్‌మీద పడిపోయారు, 'టైమొచూజాగు' అంటే మర్యాదగా చెబుతావా, లేదా అని నిలదీస్తూ. దాంతో చెప్పక తప్పింది కాదు సుధాకర్‌కి.

టై.... మొ.... చూ.... జా.... గు–

టై.... మొ.... చూ.... జా.... గు–

టైలర్ మొహం చూడని జాకెట్టు గుడ్డలు!

టైలర్ మొహం చూడని జాకెట్టు గుడ్డలు!

***

స్నేహితురాళ్ళైదుగురికీ కన్నీళ్ళొచ్చాయి. టైమొ చూజాగుల మీద విపరీతమైన జాలి కలిగింది అంతే, నలభై, యాభై ఏళ్ళక్రితం కట్‌పీస్ చీరెల ఫ్యాషన్లులాగా చీరెలూ, ఓణీలూ, చున్నీలూ, జేబురుమాళ్ళూ, అంచుకుట్టిన కిచెన్ నేప్‌కిన్లూ, పర్యావరణ పరిరక్షణలో భాగంగా చేతి సంచీలూ, రకరకాల కుచ్చుల్తో అందమైన టోపీల్లాంటి గిన్నెలమీద మూతలూ, దేవుడి గది గుమ్మాలకు కుచ్చు తోరణాల్లా, రకరకాల డిజైన్లతో గోడలమీద, కిటికీలమీద అందమైన వంకీల్లాగా అప్పుడేపుట్టిన పిల్లలకి జుబ్బాల్లాగా కుట్టించేశారు టైలర్‌మొహం చూడని ఆ జాకెట్టు గుడ్డల్ని. అంతకాలానికి అలా తమకి విముక్తి కలిగినందుకు టైమొచూజాగులు సుధాకర్‌కి శతకోటి వందనాలు చేశాయి. ఆనందంతో రెచ్చిపోయాయి!

'ఏమే ఆకుపచ్చా నోర్మూయ్! నేనిప్పుడు ఎంబ్రాయిడరీ అంచుతో జాడీమీద మూతని తెలుసా?'

'మిడిసిపాటుపడకు ఎరుపూ.., నేనిప్పుడు సెంటర్ టేబుల్‌మీద లేసుబోర్డర్‌తో దర్జాగా ఉన్నానని తెలుసుకో.

'ముందు మీరిద్దరూ నోర్మూయ్యండి. మరో ఐదుగురు, మెరూన్‌కలర్ దోస్తుల్తో కలిసి నేనిప్పుడు మెయిన్ డోర్ కర్టెన్ని' అలా మాటలు విసురుకోసాగాయి.

'సుజాతమ్మ మాగూడెంలో పంచిపెట్టిన రంగు రంగుల జాకెట్టు గుడ్డలమైన మేము, అందమైన అమ్మాయిలకి రంగురంగుల జాకెట్లై, రంగురంగుల సినిమాలు చూడ్డానికి వెళ్తున్నాము. మాలో మెత్తటి, తెల్లటి డజన్లకొద్దీ జాకెట్టుగుడ్డ చెల్లాయిలంతా లంగోటీలై పసిపిల్లలకి సుఖాన్నిస్తున్నాయి. దేశవాళీ డైపర్లం' అని కూడా ఆనందంగా చెప్పుకోసాగాయి.

రోజులు గడుస్తున్నాయి.

***

'నేను 1947వ సంవత్సరం దాన్ని. నాకిప్పుడు డెబ్భైఏళ్ళు" అంది ఆ ముసలావిడ ఒంటిమీద ఉన్న ఎట్టిరంగు జరీ అంచు జాకెట్టు. మనుషుల లెక్క ప్రకారం నాకిప్పుడు సప్తతి జరిగినట్టు లెఖ్ఖ!

పెద్దరికంతో ఠీవీగా అంది మళ్ళీ.

సుజాతమ్మకి షష్టిపూర్తి జరుగుతోంది. ఆవిడ సమర్తప్పుడు ఆవిడకెవరో బొట్టుపెట్టి ఇచ్చిన మొదటి జాకెట్టుగుడ్డగా ఆవిడ ఇంట్లో చేరాను. అలాజేరానో లేదో ఆవిడ చేతిలోంచి ఆ క్షణం లోనే జారి జారి వాయినాల్లోపడి కొట్టుకుపోయి, పోయి ఒక్కచోట నిలవలేక చివరికి మరో బంగారుతల్లి సుజాతమ్మకి అమెరికాలో వాయినమిస్తే ఇదిగో ఇన్నాళ్ళకి అంటే నలభైఏళ్ళకి ఆవిడ చేతుల్లోనేపడి ఆవిడ సూట్కేసులోనే దూరి ఫైనల్‌గా మనదేశానికి వచ్చాను. మళ్ళీ మిమ్మల్నిందర్నీ ఇలా కల్సుకోగలిగాను. తన సమర్తనాటిదాన్ని మళ్ళీ తన షష్టిపూర్తికి దొరికానని తన పట్టుచీరెకి నేను అస్సలు మేచింగ్‌రంగు కాకపోయినా నన్నే బ్లౌజుగా కుట్టించుకుంది బంగారు తల్లి సుజాత' ఉద్వేగంగా చెబుతున్నదల్లా ఆపి.... 'సో ఇప్పుడు సుజాతమ్మతోపాటు నాకూ షష్టిపూర్తి జరగాల్సిందే!' అని పట్టుబట్టింది పసుపుపచ్చ జాకెట్టు మహారాణి.

అంతసేపూ ఆశ్చర్యానందాలతో ఆమె కథ వింటున్న నీలం, ఆకుపచ్చ, ఎరుపు, మెరూను, గోధుమ రంగూ... 'బాగుందేచోద్యం... సుజాతమ్మ సమర్త ప్పుడు వచ్చానంటున్నావు. నీ మాట ప్రకారమే చూసుకున్నా సుజాతమ్మ పదమూడేళ్ళకి సమర్తాడుంటుంది. ఆ లెఖ్ఖన చూసుకున్నా నీకు నలభైఏడేళ్ళకి మించి ఉండవు. నీకప్పుడే షష్టిపూర్తేవిఁటి?' నిలదీశాయి.

'అబ్బా! పాతకథే కదే... సుజాతమ్మ దగ్గరకొచ్చే లోపల అప్పటికి పదమూడేళ్ళుగా సుబ్బమ్మా, వెంకమ్మా, పుల్లమ్మా, చంద్రమ్మా... వగైరా బంతులన్నీ దాటుకుని దాటుకుని కదా నేనొచ్చింది అన్న సంగతి మీకెప్పటికీ అర్థమవుతుందో నా కర్థం కావటంలేదు' అంటూ ఓ తిప్పుతిప్పింది పసుపుపచ్చ మహారాణి.

'సారీ అక్కా! ఆ నిజం తెలియక నిన్ను నిలదీశాం' అంటూ నొచ్చుకున్నాయి నీలం, ఆకుపచ్చ, మెరూను, గోధుమరంగు.

'సంతోషంరా అక్కాచెల్లెళ్ళూ....! మనలోను స్వర్ణ జయంతులూ, షష్టిపూర్తులూ, సప్తతులూ జరుగుతున్నాయి. ఎక్కడెక్కడోతిరిగి మళ్ళీ ఎక్కడెక్కడో కల్సుకుని కూర్చుని పండుగ చేసుకుంటున్నాం' రూపాంతరం చెందిన ఎరుపు, పసుపుపచ్చ, నీలం, ఆకుపచ్చ, మెరూను సందడిగా కబుర్లు చెప్పుకుంటుంటే, దూరంగా దీనంగా నిల్చుంది గోధుమ రంగు.

'ఏవిఁటి చెల్లీ... అలా దిగులుగా ఉన్నావు? ఎందుకూ చేతులు కట్టుకుని నిల్చున్నావు?' అడిగారు గోధుమరంగుని.

'ఏం లేదు అక్కయ్యలూ, మీలా సంతోషంగా కూర్చుని కబుర్లు చెప్పుకోడానికి నేను ఇంకో పాతిక ముప్ఫైఏళ్ళన్నా ఆగాలి. నా వాయినాల జాకెట్టు గుడ్డ ప్రయాణాలు మొదలై ముప్ఫై ఏళ్ళే అయింది మరి. అందుకని మీ ముందు సబ్‌జూనియర్‌గా నేనెప్పుడూ నిల్చునే ఉండాలమ్మా!" తలదించుకుని అంది గోధుమ.

'ఛ, పిచ్చిపిల్లా...మనలో మనకలాంటి భేదాలేం లేవురా, వచ్చికూర్చో మాతో' అంటూ ఆత్మీయంగా కూర్చోబెట్టి 'నాలుగుసార్లు అమెరికా ట్రిప్పులు కొట్టేవంటే అక్కడ యాభై రాష్ట్రాల్లో పాతిక ముప్ఫై ఏళ్ళు ఈజీగా గడిచిపోతాయి నీకు. మళ్ళీ సుజాతలాంటి ముద్దొచ్చే ముద్దుగుమ్మ చేతిలోపడి సూట్కేసులో దూరి ఆనక సెంటిమెంటల్‌గా ఆవిడ ఒంటిమీద జాకెట్ రాణిగా వెలిగిపోతావ్ చూస్తూవుండు' అంటూ భరోసా ఇచ్చారు సీనియర్లు.

తృప్తిగా, ఆశాజనకంగా చూసింది గోధుమ.

అలా అప్పుడూ, ఆ తర్వాత కూడా చాలా ఆనందంగా గడిపాయి టైమొచూజాగులు!

ఇంకా 'టైమొచూజాగులు' ఏవిటంటారా...?

అవును, ఇప్పుడవి టైలర్ మొహం చూసిన జాకెట్టుగుడ్డలు!

అదీ సంగతి!

**సెల్: 98481 67978**

# పంచభూతములు - పంచేంద్రియములు
## 5. భూమి

**పంచభూతాలలో** ఐదవది, చివరిది భూమి. భూమి ఉపరితలంలో ప్రధానంగా మట్టి, రాళ్ళు, పర్వతాలు, చెట్లు, జలాశయాలు, మంచు కనిపిస్తాయి. భూమి లోపలి పొరల్లో అనేకానేక ధాతువులు, మిశ్రమాలు, లవణాలు, ఇంధనాలు, జలాశయాలు, అగ్ని, వాయువు, ఖాళీ ప్రదేశాలు ఉంటాయి.

సూర్యుని నుండి భూమి విసిరివేయబడి కోట్లాది సంవత్సరాలైనప్పటికీ, భూమిలోపల కేంద్ర భాగంలో ఇప్పటికీ అసాధారాణమైన అగ్ని చల్లారకుండా రగులుతూనే ఉంది. ఈ భూమి పైన మనం వాడే ప్రతి వస్తువూ భూమిలో నుండి పుట్టిందే! ఉదా: మీ చేతిలోని పుస్తకం. ఒక పుస్తకం తయారవ్వాలంటే 'పేపరు' కావాలి. ఆ పేపరు తయారవాలంటే **'చెట్లగుజ్జు'** కావాలి. చెట్లు భూమిలో నుండి పుడతాయి. ఒక పెన్సిల్‌కవసరమైన సీసము (lead), చెక్క, భూమిలో నుండే పుడతాయి. మనం రోజూవాడే ల్యూబ్రికేంట్స్, వంటగ్యాస్, ప్లాస్టిక్, పెట్రోల్, ఇనుము, బంగారము, సమస్తము భూమిలో నుండే ముడి సరుకుగా మనకు లభిస్తుంటాయి. మన అవసరాలకనుగుణంగా వాటికి రూపాంతరాలు కలుగజేసి వాడుకుంటూ ఉంటాము. భూమి పై నుండే ఏ వస్తువుకు సంబంధించిన, ఏ వనరులకైననూ సరే... (ఎందుకు? ఏమిటి? ఎక్కడ? ఏలా? ఎప్పుడు?) అనే ప్రశ్నలకు చివరకు **'భూమి'** సమాధానంగా నిలుస్తుంది. భూమి కుండే ప్రధాన



ధర్మం **'ఆకర్షణ'**. ఈ **'భూమ్యాకర్షణ'** శక్తి వలనే భూమి ఉపరితలంలో వాయువులు, నీటితేమ ఒక నిర్దిష్టమైన నిష్పత్తిలో కలిసి వాతావరణమవుతుంది. ఆ వాతావరణం సూర్యకిరణాలను వడగట్టి మన జీవనానికి సరిపడే మోతాదులో భూమి పైకి ప్రసరింపజేస్తున్నది. ప్రతి జీవిలోని రక్తప్రసరణలోనూ, చెట్లలోని కిరణజన్య సంయోగ క్రియలోనూ భూమ్యాకర్షణ శక్తి పనిచేస్తునే ఉంటుంది. పుట్టినది మొదలు గిట్టేవరకూ, గిట్టిన తర్వాత కూడా ఈ విశ్వంలో భూమికి మనకు విడదీయలేని సంబంధం ఉంటుంది. అటువంటి ఈ భూగ్రహం పైన ఒక చిన్న గృహాన్ని నిర్మించుకోవటం గొప్ప విషయం కాదు. మనం ఉన్నా లేకున్నా ...ఈ భూమిని మనం సందర్శించిన వందేళ్ళ కాలం తర్వాత కూడా **'మనం కట్టుకున్న గృహం మన గుర్తుగా మిగిలిపోతుంది'**. ఆ తృప్తి ప్రతి ఒక్కరూ పొందాలి. అయితే మరో విషయం కూడా ఉంది. **'ఈ ఇల్లు నాది' 'ఈ భూమి నాది'** అని మనిషి అహంకరిస్తుంటే మాత్రం **'ఎక్కడికి పోతావులే'** అన్నటు భూమి ఫక్కున నవ్వేస్తుందట!


వాస్తు విద్వాన్, సాయిశ్రీ

**గౌ. డా. దంతూరి పండరీనాథ్**




పంచభూతాలలో మిగిలిన నాల్గింటికి ఉండే గుణాలులన్ని... **'ఆకాశం'** (శబ్ద గుణం) **'వాయువు'** (స్పర్శ గుణం), **'అగ్ని'** (రూప గుణం), **'జలము'** (రస గుణం) భూమి కున్నాయి.

భూమిని తాకితే శబ్దమొస్తుంది. స్పర్శ కలుగుతుంది. భూమిని చూడగలుగు తాము. మట్టిని రుచి చూడగలుగుతాము. వీటన్నింటికీ లేనిదీ, భూమికి మాత్రమే ఉన్న మరో ప్రత్యేక గుణం... **'గంధము'** (వాసన) కలిగి ఉండటము. మనం **'నాసిక'**తో మాత్రమే వాసన చూడగలుగుతాము. అలా పంచభూతాలలో ఒకటైన భూమికి, మన పంచేంద్రియాలలో ఒకటైన **'నాసిక'** (ముక్కు)కు ప్రత్యక్ష సంబంధం ఉన్నది.

**వచ్చేవారం... 'ఇంటికి ఏ దిక్కున ఏమి ఉండాలి'**

## నైరుతి స్థలం -ముఖద్వారము

■ **మాది నైరుతి స్థలం. ఈ స్థలములో ఎటువైపు ముఖద్వారమున్న ఇంటిని నిర్మించుకోవాలి?**

– **మంచిరెడ్డి,** సింగరాయకొండ.

▸ పశ్చిమ, దక్షిణ దిక్కులయందు వీధులున్న స్థలాన్ని **'నైరుతి స్థలం'** అంటారు. నైరుతిస్థలమందు దక్షిణ సింహద్వార గృహ నిర్మాణము యోగ్యముగాదు. ఇట్టి గృహములందు దారిద్ర్యము, సంతాన సమస్యలధికంముగా ఉండే అవకాశముంటుంది. పెద్ద వీధి ఎటు ఉన్నప్పటికీ, నైరుతి స్థలంలో పశ్చిమ ముఖద్వార గృహమును నిర్మించుట శ్రేయోదాయకము.

ఇట్టి నైరుతిస్థలమందు పశ్చిమ లేదా పశ్చిమవాయువ్య ముఖద్వార గృహ నిర్మా ణాల వలన అందు నివసించువారు, ఆ ఇంటి యజమాని కూడా సౌఖ్యన్ని, సిరిసంపదలను, జయములను పొందే ఆవకాశమెక్కువగా ఉంటుంది. వీటికి తోడు **'పడమర ముఖద్వార యోగము'**న్న వారు, ఇటువంటి నైరుతి స్థలములో **'పశ్చిమ – పశ్చిమవాయువ్య'** సింహద్వార గృహమున నివసించునట్లయితే సునాయాసంగా గొప్ప గొప్ప ఫలితాలను పొందగలుగుతారు. అందుకని నైరుతి స్థలములో **'పశ్చిమ– పశ్చిమవాయువ్య'** సింహద్వార గృహాన్ని నిర్మించుకోవటమే ఉత్తమము.

**వచ్చేవారం... 'వివహాంత్వరగా జరగాలంటే ఎమి చేయాలి?'**



వాస్తువిద్వాన్ **డా॥ దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసినది.

పూర్తి పేరు:............................................................

పుట్టిన తేది:.............................. ఊరు:..............................

జన్మనక్షత్రం:.............................. తల్లి పేరు:..............................

చిరునామా:............................................................

............................................ఫోన్:..............................

**మా చిరునామా : వాస్తుసాయి సేవా ఆశ్రమం**

**మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.**



# ఆయనతో మాత్రం పెట్టుకోవద్దు!

**అహ్మద్ పటేల్ రాజ్యసభ స్థానాన్ని గెలుచుకున్నారు కానీ, అమిత్‌షా మీద మాత్రం ఆగ్రహం కట్టలు తెంచుకుని ప్రవహిస్తోంది. అమిత్‌షాను దెబ్బ తీయడానికి గుజరాత్‌లో జరిగే ప్రతి ఎన్నికనూ ఆయన ఉపయోగించదలచుకున్నారు.**

ఈ రాజ్యసభ స్థానాన్ని ఎలాగైనా చేజిక్కించుకోవాలని కాంగ్రెస్ నిర్ణయించుకుంది. ఈ సీటును ఎటువంటి పరిస్థితుల్లోనూ కాంగ్రెస్‌కు వెళ్లనివ్వకూడదని బీజేపీ భావించింది. ఓ రాజ్యసభ సీటు కోసం రెండు జాతీయ పార్టీలు అమీతుమీ స్థాయికి దిగడం దేశ రాజకీయ చరిత్రలో చాలా అరుదు. కాంగ్రెస్ అభ్యర్థి అహ్మద్ పటేల్ విజయం సాధించకుండా ఉండాలని బీజేపీ అధ్యక్షుడు అమిత్‌షా చేయగలిగిందంతా చేశారు. అహ్మద్ పటేల్ విజయం సాధించడాన్ని తమ ప్రతిష్ఠకు సంబంధించిన విషయంగా కాంగ్రెస్ నాయకత్వం భావించింది. ఈ గుజరాత్ సీటు కోసం ఈ రెండు పార్టీలూ రెండు నెలల పాటు దాదాపు కుస్తీ పట్లు పట్టాయి. సహజంగానే ఈ పోటీ దేశ ప్రజలకు ఉత్కంఠ కలిగించింది. బీజేపీ నాయకత్వంలోని ఎన్‌డీఏ తన సర్వ శక్తులూ పణంగా పెట్టి అహ్మద్ పటేల్‌ను ఓడించడానికి కంకణం కట్టుకుంది.

ఎవరీ అహ్మద్ పటేల్? ఎందుకు ఆయనకింత ప్రాధాన్యం? దాదాపు ఇందిరాగాంధీ హయాం నుంచి గాంధీనెహ్రూ కుటుంబానికి తలలో నాలుకలా ఉంటున్న అహ్మద్ పటేల్ ప్రస్తుత కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియాగాంధీకి రాజకీయ సలహాదారు. ఆయన 1993 నుంచి రాజ్యసభ సభ్యుడుగా ఉంటున్నారు. ఆయన ఓడిపోవడమంటే సోనియా గాంధీ స్వయంగా ఓడిపోవడం కిందే లెక్క. ఒక్క కాంగ్రెస్ తత్వం గురించే కాదు, ప్రజల నాడి గురించి కూడా ఆయనకు తెలిసినంతగా మరెవరికీ తెలియక పోవచ్చని యువతరంలో చాలామందికి తెలియకపోవచ్చు. ఆరు, ఏడు, ఎనిమిది లోక్‌సభల్లో సభ్యుడుగా కూడా ఉన్న అహ్మద్ పటేల్ 1977 నుంచి 1982 వరకు కాంగ్రెస్ గుజరాత్ శాఖ అధ్యక్షుడిగా కూడా పదవి నిర్వహించారు. ఆయన 1977 నుంచి కాంగ్రెస్ అగ్రనాయకత్వానికి అత్యంత సన్నిహితుడుగా మెలుగుతున్నారు. కాంగ్రెస్‌కు ఆయన పర్యాయపదం.

1977లో జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో ఘోర పరాజయం పాలై, ఇంట్లోంచి బయటికి రావడానికి, పార్టీ శ్రేణులకు ముఖం చూపించలేని స్థితిలో ఉన్న ఇందిరాగాంధీలో మళ్లీ ఆత్మవిశ్వాసం నింపిన వ్యక్తి అహ్మద్ పటేల్. ఆ రోజున ఆయన తీసుకున్న చర్య ఇందిరాగాంధీని మళ్లీ దేశ ప్రజల ముందు గర్వంగా నిలబెట్టింది. గుజరాత్‌లోని బారూచ్‌లో ఓ పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేయాలని సంకల్పించిన అహ్మద్ పటేల్ మూడు రోజుల పాటు ఢిల్లీలోనే ఉండి, ఈ బహిరంగ సభలో పాల్గొనడానికి అతి కష్టం మీద ఇందిరాగాంధీని ఒప్పించి, స్వరాష్ట్రానికి తిరిగి వచ్చారు. నిజానికి చిట్టచివరి నిమిషం వరకూ సంశయిస్తూనే ఉన్న ఇందిరాగాంధీ ఇక అహ్మద్ పటేల్ ఒత్తిడి భరించలేక, ఏమైతే అది అయిందని గుజరాత్ విమానమెక్కారు. ఆమె విమానాశ్రయంలో దిగినప్పటి నుంచి బహిరంగ సభ వేదిక దాకా వెళ్లే వరకూ లక్షలాదిమంది జనం ఆమె వెంట నడిచారు. ఆమెకు అడుగడుగునా జేజేలు కొట్టారు. బహిరంగసభ ఘనవిజయం సాధించింది. ఆమె తన వాదన వినిపించడానికి ఈ బహిరంగ సభ ద్వారా అవకాశం కలిగింది. ఆ సభతో ఆమెలో మళ్లీ ఆత్మవిశ్వాసం పెరిగింది. ఆ తర్వాత ఆమె ఇక వెనుదిరిగి చూడలేదు.

ఆ తర్వాత మరికొన్ని ప్రాంతాల్లో కూడా అహ్మద్ పటేల్ ఆమె కోసం సభలు, ర్యాలీలు ఏర్పాటు చేశారు. అవి కూడా విజయవంతమయ్యాయి. ఇతర రాష్ట్రాలు అహ్మద్ పంథానే అనుసరించి బహిరంగ సభలు ఏర్పాటు చేశాయి. ఆమె మళ్లీ దేశమంతటా పర్యటనలు చేయడం ప్రారంభించారు. అది నిజంగా ఆమెకు రాజకీయ పునరుజ్జీవనమే. ఆరవ లోక్‌సభకు ఎన్నికైన నాటినుంచి అహ్మద్ పటేల్‌కు ఇక తిరుగులేకుండా పోయింది. రాజకీయంగా ఆయన నాయకత్వం స్థిరపడిపోయింది. ఆ తర్వాత ఏడవ లోక్‌సభకు కూడా ఎన్నికవడంతో ఆయనకు అటు గుజరాత్ ప్రజల్లోనూ, ఇటు కాంగ్రెస్ శ్రేణుల్లోనూ పట్టూ, పలుకుబడీ పెరిగిపోయింది. ఇందిరాగాంధీకి ఆయన ఎంత చెబితే అంత అన్నట్టుగా కూడా అయిపోయింది. ఆ తరువాత 1984 నుంచీ ఆయన రాజీవ్ గాంధీకి కూడా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ రాజకీయ శిక్షణ ఇవ్వడం ప్రారంభించారు. 1984లో ఇందిరాగాంధీ హత్యకు గురైన తర్వాత రాజీవ్‌గాంధీ అధికారంలోకి రావడం, లోక్‌సభ ఎన్నికల్లో 400లకు పైగా సీట్లు గెలుచుకోవడంతో అహ్మద్ పటేల్ ఆ యువ నాయకుడికి కూడా సన్నిహితులయ్యారు. అప్పటి నుంచి ఆయన జాతీయ రాజకీయాల్లో ప్రవేశించి, కాంగ్రెస్ పార్టీ సంయుక్త కార్యదర్శిగా పదవిని చేపట్టారు. ఆ తర్వాత పార్టీ పార్లమెంటరీ కార్యదర్శిగా ప్రమోట్ అయ్యారు. చివరికి ఆయన పార్లమెంట్ సభ్యునిగా ఉంటూనే పార్టీ ప్రధాన కార్యదర్శి కూడా అయ్యారు.






**ఇందిరాగాంధీ హయాంనుంచీ కాంగ్రెస్‌పార్టీకి అత్యంత విశ్వసనీయుడు అహ్మద్ పటేల్. ఎమర్జెన్సీవల్ల ఓడిపోయిన ఇందిరాగాంధీలో తిరిగి ఆత్మవిశ్వాసం తెచ్చిందీ, రాజీవ్‌గాంధీకి రాజకీయశిక్షణ ఇచ్చిందీ ఆయనే. అలాంటి వ్యక్తిని రాజ్యసభ ఎన్నికల్లో ఓడించేందుకు బీజేపీ అధ్యక్షుడు అమిత్‌షా సర్వశక్తులూ ఒడ్డారు. కానీ విఫలమయ్యారు. అమిత్‌షాపై ఇప్పుడు అహ్మద్ పటేల్ కత్తిగట్టారు. దెబ్బతిన్న పులిలా ఉన్న పటేల్ ఏమాలోచిస్తున్నారంటే....**

## అసాధారణ నాయకుడు

పార్టీ అధ్యక్షురాలిగా సోనియాగాంధీ నియామకం తర్వాత ప్రధాని పదవి, పార్టీ అధ్యక్ష పదవి వేర్వేరు అయిపోయాయి. దాంతో ఆయన పార్టీలోనే కాక, ప్రభుత్వంలోనూ పట్టు సంపాదించుకోగలిగారు. కేంద్ర ప్రభుత్వంలో ఆయనకు ఎటువంటి పదవీ లేకపోయినా, ఆయన మాట చెల్లినంతగా మంత్రుల మాట కూడా చెల్లని పరిస్థితి ఏర్పడింది. పార్టీ అగ్రనేతలు కూడా అందుకు అవకాశమిచ్చారు. ఉద్దేశపూర్వకంగా వెసులుబాటు కల్పించారు. విచిత్రమేమిటంటే, పార్టీ అధిష్ఠానవర్గం ఆయనకు ఆరేడు సార్లు మంత్రి పదవిని ఇవ్వజూపింది. ఆయన మంత్రి పదవులను మొదటి నుంచీ వ్యతిరేకిస్తూనే వచ్చారు. దాంతో ఆయనకు పార్టీలో ప్రాధాన్యం మరింత పెరిగిపోయింది. సలహాలు, సూచనలు, పరిష్కారాల కోసం పార్టీలో ఆయన మీద ఆధారపడడం కూడా ఎక్కువైంది.

అయితే, పీవీ నరసింహారావు అధికారంలోకి వచ్చిన తరువాత ఆయన ప్రాభవానికి కొద్దిగా గ్రహణం పట్టింది. ప్రధాని పదవిని చేపట్టగానే నరసింహారావు ఆయనకు మంత్రి పదవిని ఇవ్వజూపారు. ఎప్పటి మాదిరిగానే ఆయన దాన్ని తిరస్కరించారు. తన మంత్రివర్గంలో ముస్లిం మతానికి చెందిన వ్యక్తి ఎవరైనా ఉంటే బాగుంటుందని భావించి, నరసింహారావు సరైన పదవిని ఎంపిక చేసి, అహ్మద్ పటేల్‌కు ఇవ్వాలనుకున్నారు. అయితే అహ్మద్ పటేల్ వద్దని చెప్పడంతో నరసింహారావు మాట్లాడకుండా ఉండిపోయారు. ఆ తర్వాత అహ్మద్ పటేల్ లోక్‌సభ ఎన్నికల్లో ఓడిపోయారు. ఆయన తన క్వార్టర్‌ను ఖాళీ చేయాల్సి వచ్చింది. ఢిల్లీలోని మీనాబాగ్‌లో ఆయనకు వసతి కల్పించడానికి ఆయన సన్నిహితురాలు నజ్మా హెప్తుల్లా ముందుకు వచ్చారు. కానీ నరసింహారావు ఇందుకు సుముఖత వ్యక్తం చేయలేదు.

అహ్మద్ పటేల్ కుమారుడు, కుమార్తె బోర్డు పరీక్షలు రాస్తున్న సమయంలో ఆయనకు క్వార్టర్ ఖాళీ చేయాల్సిందిగా నోటీసు వచ్చింది. ఆయన క్వార్టర్ ఖాళీ చేయడానికి మూడు రోజుల సమయం మాత్రమే ఇచ్చారు. తప్పనిసరిగా ఆయన ఖాళీ చేయాల్సి వచ్చింది. ఆ గడ్డు రోజుల్ని, ఆ గడ్డు రోజులకు కారకులైనవారిని ఆయన ఇప్పటికీ మరచిపోలేదు. అయితే, రాజీవ్‌గాంధీ ఆరంభించిన జవహర్ భవన్ ట్రస్ట్ కార్యదర్శి పదవిని ఇవ్వజూపినప్పుడు మాత్రం ఆయన అంగీకరించక తప్పలేదు. దీన్ని కాంగ్రెస్ పార్టీకి చెందిన మేధావుల కేంద్రంగా అభివృద్ధి చేయాలని రాజీవ్‌గాంధీ కలలు గన్నారు. రాజీవ్‌గాంధీ హత్యానంతరం సోనియాగాంధీ దీన్ని అభివృద్ధి చేశారు. ఈ జవహర్ భవన్ ప్రాంగణంలోనే రాజీవ్‌గాంధీ ఫౌండేషన్ కూడా ఉంటుంది. అప్పటి ఆర్థిక మంత్రి మన్మోహన్ సింగ్ ఈ ఫౌండేషన్‌కు బడ్జెట్‌లో 20 కోట్ల రూపాయలు కేటాయించారు. కానీ, సోనియా దీన్ని తిరస్కరించారు. జవహర్ భవన్ ట్రస్ట్ కార్యదర్శిగా నియమితులైన అహ్మద్ పటేల్ ఈ ప్రాజెక్టు కోసం అవిశ్రాంతంగా పనిచేసి, నిధులు సేకరించి, కాంట్రాక్టర్లను ఏర్పాటు చేసి, అభివృద్ధిచేసి, రాజీవ్‌గాంధీ ఆశయాలకు అనుగుణంగా ఈ సంస్థను తీర్చిదిద్దారు. ఈ కార్యదర్శి పదవి కారణంగా ఆయనకు సోనియాగాంధీకి సన్నిహితం కావడానికి అవకాశం కలిగింది.

## పీవీతో అభిప్రాయ భేదాలు

నరసింహారావు హయాంలో కాంగ్రెస్ నుంచి విడిపోవడానికి ప్రయత్నం చేసిన గ్రూపులో ఆయన చేరడానికి ఇష్టపడలేదు. షీలా దీక్షిత్, ఎన్‌డీ తివారీ వంటి నాయకులు ఈ గ్రూపులో చేరడానికి ప్రయత్నం చేసినప్పటికీ అహ్మద్ పటేల్ మాత్రం దీనికి దూరంగానే ఉన్నారు. నరసింహారావు పట్ల ఆయనకు ఏమాత్రం సదభిప్రాయం లేకపోయినా కాంగ్రెస్‌లో వేరు కుంపటి పెట్టడమనే అభిప్రాయానికి మాత్రం ఆయన పూర్తిగా వ్యతిరేకి. నిజానికి నరసింహారావు హయాంలో ఆయనకు పార్టీలో సీడబ్ల్యూసీ సభ్యుడు కావడంతప్ప పెద్దగా లబ్ధి పొందిందేమీ లేదు. ఆయన నరసింహారావు పట్ల గౌరవ భావంతోనే వ్యవహరించేవారు. అయితే, బాబ్రీ మసీదు విధ్వంసం జరగనిచ్చినందుకు మాత్రం ఆయన నరసింహారావును ఏనాడూ క్షమించలేదు. నరసింహారావుకు ప్రత్యామ్నాయాలు ఉన్నాయని తేలేసరికి ఆయన రావును తొలగించడంలో కీలక పాత్ర పోషించారు. ఏది ఏమైనా, అహ్మద్ పటేల్‌కు మాత్రం అవి దుర్దినాల కిందే లెక్క. పార్టీలో వివిధ పదవులు అధిష్ఠించిన అనుభవంతో ఆయన పార్టీ వ్యవస్థను ఎంతగానో పటిష్ఠం చేశారు. ఆయన దాంతోనే తృప్తి పడాల్సి వచ్చింది. 1993లో తిరుపతిలో జరిగిన పార్టీ సమావేశంలో సీడబ్ల్యూసీకి ఎన్నికలు జరిగినప్పుడు ఆయన అత్యధిక ఓట్లు సంపాదించుకుని మూడవ స్థానంలో నిలవడానికి ఇదే కారణం అయింది.

వాస్తవానికి 1996 తర్వాత నాలుగైదేళ్ల పాటు కాంగ్రెస్‌లో కూడా సంక్షోభం నెలకొని ఉంది. సీతారామ్ కేసరి కాంగ్రెస్ అధ్యక్షుడిగా నియమితులైన తర్వాత ఏదో ఒక ప్రభుత్వానికి మద్ధతునివ్వాల్సి వచ్చింది. దాంతో ప్రభుత్వాలకు అనుగుణంగా వ్యవహరించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇక పార్టీ అధ్యక్ష పదవికి సీతారామ్ కేసరి ఎన్నికైనప్పుడు ఆయనకు వ్యతిరేకంగా శరద్ పవార్ పోటీ చేశారు. అహ్మద్ పటేల్ మాత్రం కేసరికే మద్ధతునిచ్చారు. ఆయన తరఫునే ప్రచారం చేశారు. 'ఇందిరాగాంధీ కుటుంబం ఓ సూర్యగ్రహం లాంటిది. దాని దగ్గరికి వెడితే మాడి మసైపోతారు. సూర్యరశ్మి లేకుండా బతకలేం కాబట్టి, దూరం నుంచే ఆ వేడిని గ్రహించి ఊర్కోవాలి' అని కొందరు సీనియర్ నాయకులు ఇప్పటికీ చెబుతుంటారు. అహ్మద్ పటేల్ మాత్రం ఆ సూర్యగ్రహానికి బాగా దగ్గరకు వెళ్లగలిగారు. అయితే, ఆయన ఈ సాన్నిహిత్యాన్ని ఏనాడూ వ్యక్తిగత అవసరాలకు ఉపయోగించుకోలేదు. గుజరాత్‌లో ఓ ఎన్నికల సందర్భంగా ఆయన కేవలం ఫోన్ కాల్స్ ద్వారా 30 నిమిషాల్లో 30 కోట్ల రూపాయలు కూడగట్టగలిగారంటే ఆయన సామర్థ్యం ఏపాటిదో అర్థం చేసుకోవచ్చు.

ఇంతకూ గుజరాత్ రాజ్యసభ ఎన్నికల ద్వారా బీజేపీ గానీ, ఇతర పార్టీలు గానీ గ్రహించుకోవాల్సిందేమిటంటే అహ్మద్ పటేల్‌తో పెట్టుకోవద్దు. ప్రస్తుతం అహ్మద్ పటేల్ 2019లో జరగబోయే లోక్‌సభ ఎన్నికల కోసం ఎదురు చూస్తున్నారు. బీజేపీ అధ్యక్షుడు అమిత్‌షా ఆ ఎన్నికల్లో అహ్మదాబాద్ నుంచి పోటీచేసే అవకాశం ఉందని ఆయన భావిస్తున్నారు. అమిత్‌షాకు పగ్గాలు వేయడానికి ఆ ఎన్నికలను ఉపయోగించుకోవాలని ఆయన ఇప్పటినుంచే ఆలోచనలు మొదలుపెట్టారు. గుజరాత్ నుంచి కాంగ్రెస్‌కు వీలైనన్ని సీట్లు రాబట్టాలనే ఆలోచనతో పాటు, అమిత్‌షాను రాజకీయంగా అణచివేయాలనే ఆలోచన కూడా ఆయనను ఇప్పటినుంచే తొలిచేస్తోంది. రాజ్యసభ ఎన్నికలకు ముందు ఆరుగురు కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఫిరాయించడం, ఈ ఎన్నికల్లో తాను ఒక్క ఓటుతో గెలవడం ఆయనకు జీర్ణం కావడం లేదు. ప్రస్తుతం ఆయన ఒక విధంగా దెబ్బతిన్న పులి!...పగబట్టి పాము!...మున్ముందు గుజరాతలో ఏ ఎన్నికలు జరిగినా దేశవ్యాప్తంగా ఉత్కంఠ రేకెత్తించడం ఖాయం.

నవ్య




**సుడిగుండం ఏదో ఏర్పడినట్టు మహావేగంతో సుడులు తిరుగుతున్నాయి నీళ్ళు. అడుగు భాగంలో ఉన్న నాచుమొక్కలు, బండరాళ్ళు, ఆఖరికి సముద్రజీవులు అన్నీ గింగిరాలు తిరుగుతూ ఎటెటో వెళ్ళి పోతున్నాయి.**

**తను కూడా ఆ సుడిలో చిక్కుబడిపోయే ప్రమాదం ఉన్నట్టు అర్థమై, వేగంగా పక్కకు తిరిగాడు సూసీయన్.**

మానవ శరీరంలోని నాభి స్థానంలో నిక్షిప్తమై ఉంటుందట ఒక మహాశక్తి. దానిని నిద్రలేపగలిగితే అపూర్వమైన బలం మనిషికి స్వంతమైపోతుందిట. జోలపాటలు పాడి, పూజలు పునస్కారాలు చేస్తే మేల్కొనే శక్తి కాదు అది. వెయ్యి పడగలను కలిగి ఉండే మహానాగం అది. కేవలం మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను క్రమబద్ధం చేసుకోవటం ద్వారా మాత్రమే దానిని చైతన్యపరచవచ్చుట.

విద్యాపీఠంలో చేరిన మొదటిరోజు నుంచే ఆ జీవశక్తిని గురించి విద్యార్థులందరికి బోధిస్తారు. ఊపిరి ఎలా తీసుకోవాలో, తిరిగి ఎలా బయటికి వదలాలో సవివరంగా నేర్పిస్తారు.

సాధన చేయగా చేయగా కేవలం అతి కొద్దిమంది అదృష్టవంతులు మాత్రమే ఆ మహాశక్తి ఉనికిని తమ శరీరంలో గుర్తించగలుగుతారు. ఆ అదృష్టవంతుల్లో మరికొంతమంది మాత్రమే దానిని స్పృశించగలుగుతారు. అలా స్పృశించగలిగిన వారిలో ఒకరిద్దరు మాత్రమే ఆ ప్రక్రియను పూర్తి చేయగలుగుతారు.

విద్యాపీఠంలో సాధన ప్రారంభించిన ఇరవై సంవత్సరాల తర్వాత మొట్టమొదటిసారిగా నిద్రావస్థలో ఉన్న మహానాగాన్ని తడిమి, తట్టి కనులు తెరిపించగలిగాడు సూసీయన్.

పులకరించిపోయింది అప్పుడు అతని శరీరం. సూదుల మాదిరి లేచి నిలుచున్నాయి శరీరం మీద ఉన్న రోమాలు అన్నీ... శరీరం తేలికగా మారిపోయిన అనుభూతి కలిగింది. అవసరం అయితే ఒక్క గంతులో ఆకాశంలోకి ఎగిరి, వాయువేగ మనోవేగాలతో ప్రయాణం చేయవచ్చనీ, మబ్బులతో పరుగు పందేలు వేయగలననీ 0అనిపించింది. సామాన్య మానవులు ఎవరూ ఎత్తలేని బరువుల్ని ఒంటిచేత్తో పైకెత్తి అవతలకు విసిరి వేయవచ్చన్న నమ్మకం ప్రబలిపోయింది.

నిద్ర లేచిన జీవశక్తి, తన మనస్సు ఎటువంటిదో తన ఆలోచనలు ఎటువంటివో తెలుసుకోవటం కోసం సృష్టిస్తున్న భ్రమలు అవన్నీ అని గ్రహించి, తనను తాను నిగ్రహించుకున్నాడు అతను. అహంకరించకుండా, అరమూసిన కనులతో అలాగే సాధనను కొనసాగించాడు.

ఊపిరి తీసుకోకుండా గంటలకు గంటలు ధ్యానసమాధిలో గడపగల సామర్థ్యం అలవడింది. ఆ శక్తి ఇప్పుడు అక్కరకు వచ్చింది.

అతనికి సముద్రగర్భంలో తాడిచెట్టు ఎంత ఎత్తుగా ఉంటుందో, అంతే ఎత్తులో కనిపించింది ఒక కొండ గట్టు. సుడులు తిరుగుతున్న నీటిలో చిక్కుబడకుండా, దాని చాటుకుపోయి, ఆ గుట్ట మధ్య భాగంలో ఉన్న ఒక చిన్న గుహవంటి గోతిలో కూర్చున్నాడు అతను.

చూస్తూచూస్తూ ఉండగానే అధికం అయిపోయింది నీటి వేగం. తాటికాయల వంటి నీటి బుడగలు ఉద్భవించి సముద్రపు పైభాగంలోకి పరుగులు తీయటం మొదలైంది.

ఆ బుడగలు ప్రత్యక్షమైన తర్వాత మరికొద్ది సేపటికి, సూసీయన్ కనులకు కనిపించింది ఒక దృశ్యం.

ఇరవై బారల పొడవు, నాలుగు బారల వెడల్పు కలిగి ఉన్న జలచరాలు కొన్ని అతను దాక్కొని ఉన్న కొండగుట్టకు వంద అడుగుల దూరంలో ప్రత్యక్షం అయ్యాయి.

ఆకలిగా ఉన్నప్పుడే వేటకు బయలుదేరతాయి వన్య ప్రాణులు. సముద్రజీవుల్లో కూడా అటువంటి అలవాట్లే



## జరిగిన కథ

*కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే పీఠాధిపతి ఫ్యూజీ శాన్‌కు శత్రువుగా మారతాడు షాడో. గంగారాంతో కాంటన్ సిటీ చేరి, హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. డూడూ సామ్రాజ్యం గురించి గంగారాంకి చెబుతుంటాడు షాడో. కుంగ్‌ఫూ విద్యాపీఠాధిపతి సూసీయన్ దగ్గరకు గ్రామీణులు కొంతమంది వచ్చి, సముద్రం తమ పొలాల్ని ముంచేస్తోందని, రక్షించమని వేడుకుంటారు. దాంతో సూసీయన్ సముద్ర తీరాన్ని చేరి, ఎత్తెత్తి కొడుతున్న అలలకు అందకుండా, సముద్రంలో మునుగుతాడు.*

*ఆ తర్వాత...*

ఉంటాయి సాధారణంగా. పెద్దపెద్ద పడవలను, నౌకలను తల్లక్రిందులు చేయగల తిమింగలాలకు మాత్రం వర్తించని విషయం అది.

పడవ కనిపిస్తే పగబట్టిన పాముల మాదిరి వచ్చేస్తాయి. బలమైన తమ తలలతో మోది, తోకలతో బాది తలక్రిందులు చేసి సంతోషిస్తాయి.

లెక్కపెట్టటానికి వీలులేనన్ని ఆ భయంకరజీవులు ఇప్పుడు కనిపించాయి సూసీయన్‌కి. అతను దాగుకుని ఉన్న గుహ మాదిరిగానే కనిపిస్తున్న తమ నోళ్ళను తెరచి, నీటి బుడగలను సృష్టిస్తున్నాయి.

కనులు చిట్లించి చూస్తున్న సూసీయన్‌కు పది క్షణాల తరువాత కనిపించాయి రెండు మూరల పొడవు, ఒక మూరెడు వెడల్పు కలిగి ఉన్న పెట్టెలు కొన్ని. మృత్యుదేవత వంటి తిమింగలాల మెడల్లో వేలాడుతున్నాయి అవి. వాటి నోళ్ళలో నుంచి వెలువడుతున్నట్టు కనిపిస్తున్న నీటి బుడగలు నిజానికి ఆ పెట్టెలకున్న చిన్నచిన్న రంధ్రాలలో నుంచి బయటికి వస్తున్నాయి. వట్టిగా రావటం లేదు. విపరీతమైన ఒత్తిడిని కలుగచేస్తున్నాయి. నీటిని బలంగా పైకి నెడుతున్నాయి.

ప్రశాంతంగా ఉండవలసిన సముద్రం ఎందుకు అల్లకల్లోలం అవుతున్నదో, చెలియలికట్టను దాటి అలలు తీరాన్నంతా ఎలా సర్వనాశనం చేస్తున్నాయో అర్థమైపోయింది సూసీయన్‌కి.

అడవి జంతువుల కంటే క్రూరమైన ఆ తిమింగలాలు ఎక్కడి నుంచి వస్తున్నాయో, వాటి దగ్గర ఉన్న పెట్టెల్లో అటువంటి దారుణమైన శక్తి ఎలా నిక్షిప్తం చేయబడిందో అతనికి తెలియలేదు.

దూరంగా కూర్చుని ఆలోచనలతో కాలక్షేపం చేస్తే అర్థం అయ్యే విషయం కాదు అది. దగ్గరికి పోయి తెలుసుకోవాల్సిన విచిత్రమైన రహస్యం.

తను దాగుకుని ఉన్న గుహవంటి గోతిలో నుంచి ఒక్కసారిగా బయటికి వచ్చేశాడు అతను. గుండెల నిండా ఉన్న గాలిని అతి నెమ్మదిగా బయటికి వదులుతూ తన నాభిస్థానంలో ఉన్న జీవశక్తిని తలచుకున్నాడు.

ఆ మహాశక్తిని మొట్టమొదటిసారి స్పృశించినప్పుడు శరీరం ఎలా రోమాంచితం అయిందో, ఇప్పుడు కూడా అదే మాదిరి ఝల్లుమన్నది అతని ఒళ్ళు. తనకు తెలియకుండానే వింటి నుంచి వెలువడిన బాణం మాదిరి ముందుకు దూసుకుపోయాడు. ఎదురుగా కనిపించిన ఒక తిమింగలాన్ని రెండు చేతులతో పట్టుకుని, బలంగా పైకి విసిరాడు.

పూలచెండు మాదిరి పైకి లేచింది అది. ఒకే ఒక క్షణంలో నీటిపైకి తేలింది. అక్కడితో ఆగిపోలేదు. గాలానికి చిక్కుకున్న చేప మాదిరి గిలగిలా కొట్టుకుంటూపోయి అంతకుముందు వరకూ నీటితో నిండిపోయి ఉన్న ఒడ్డుమీద పడింది.

ఎంత హఠాత్తుగా ఉప్పొంగటం ప్రారంభించిందో, అంతే హఠాత్తుగా తిరోగమిస్తోంది సముద్రం.

నీరు తరిగిపోయి పొడిగా తయారయిన ఒడ్డు మీద నిస్సహాయంగా ఉండిపోయిన తిమింగలాన్ని చేరుకుని, దాని మెడలో ఉన్న పెట్టెను పట్టుకోబోతున్న సూసీయన్ వెనుకే ప్రత్యక్షం అయ్యారు కొంతమంది దృఢకాయులు.

తమ చేతుల్లో ఉన్న పొడవాటి ఈటెలతో అతన్ని గాయపరచటానికి ప్రయత్నించారు. నిర్మొహమాటంగా ఎదురు తిరిగాడు సూసీయన్. పిడికిళ్ళు బిగించి బొంగరం మాదిరి గిర్రుగిర్రున తిరుగుతూ గాలిలోకి ఎగరగొట్టేశాడు ఆ ఈటెలన్నిటినీ. ఒకరి తర్వాత ఒకర్ని, ఆ వ్యక్తులనందరినీ నేలమీదికి నెట్టేశాడు.

'పాహి...పాహి...పాహి' మోకాళ్ళ మీద లేచి చేతులు జోడిస్తూ వేడుకున్నాడు కింద పడిపోయిన వ్యక్తి ఒకతను.



మూడు నిమిషాలు పట్టింది సూసీయన్‌కి ఆ మాటల్ని అర్థం చేసుకోవటానికి. తాము మాట్లాడే భాష మాదిరిగానే ధ్వనిస్తున్నా, తమది కాదు అది! ఒకటిగా ఉండే తమ భూభాగం ప్రకృతి శక్తుల బీభత్సానికి గురై ముక్కలు ముక్కలుగా చీలిపోక ముందు ఉపయోగించబడిన అది పురాతనమైన భాష మాదిరిగా ధ్వనిస్తోంది.

'ఎవరు మీరు?' నడుము మీద చేతులు వేసుకుని, అనుమానంగా చూస్తూ అడిగాడు, వారు ఉపయోగిస్తున్న శబ్దాలనే తను కూడా అనుకరిస్తూ. యదార్థమైంది అతని ఊహ. తేలికగానే అర్థం చేసుకున్నాడు ఆ మనిషి. ఛెంగునలేచి ఒక్కసారిగా అతని దగ్గరికి వచ్చి తల వంచి నమస్కారం చేశాడు.

'డూడూ సామ్రాజ్యం మాది. జల విహారానికి వచ్చిన మా రాణీగారిని మీ సైనికులు బంధించి ఎక్కడికో తీసుకుపోయారు. కాపాడుకోవటం ఎలాగో తెలియక తలలు పగలగొట్టుకుంటున్నాము. సముద్రాన్ని రెచ్చగొట్టి భూభాగాన్ని ముంపుకు గురిచేస్తే ఉపయోగం ఉంటుందని, మా పరికరాల్ని ప్రయోగిస్తున్నాం' అడగక ముందే తమను గురించి పూర్తిగా చెప్పేశాడు.

తమ చుట్టూ ఉన్న ప్రపంచం గురించి తమ విద్యాలయంలో భద్రపరచబడి ఉన్న తాళపత్ర గ్రంథాలన్నీ గిర్రున తిరిగాయి సూసీయన్ కళ్ళ ముందు.

ఎప్పుడో ఎన్నో శతాబ్దాల క్రితం సముద్రపు ఆటుపోట్లకు గురైన తమ భూభాగం ముక్కలు ముక్కలై కొంత సముద్రంలో మునిగిపోవటం, మరి కొంత రకరకాల ద్వీపాలుగా రూపాంతరం చెందటం సవివరంగా రాయబడి ఉంది ఆ గ్రంథాల్లో.

ఇప్పుడు చెప్పబడుతున్న డూడూ సామ్రాజ్యం ప్రస్తావన మాత్రం వాటిలో లేదు... ఎందుకని?

ఆ ప్రశ్నకు సమాధానం లభించకముందే అతని దృష్టిని తనకేసి మరల్చుకున్నది నీటిలోనుంచి బయట పడిన తిమింగలం. బుస్సుమని శబ్దం చేస్తూ గిలగిలా కొట్టుకోవటం మొదలుపెట్టింది.

చటుక్కున దాని దగ్గరికి జరిగి, దాని మెడలో ఉన్న పెట్టెను పట్టుకోబోయాడు సూసీయన్.

వెంటనే అడ్డుకున్నాడు అతనితో మాట్లాడుతున్న మనిషి.

'సముద్రగర్భంలో తన శక్తిని ప్రకటిస్తూ ఉండే బడబాగ్ని ఈ పెట్టెలో భద్రపరచి ఉన్నది. వట్టి చేతులతో పట్టుకుంటే చేతులు మాడిపోతాయి. కండలు మాయమై ఎముకలు మాత్రమే కనిపిస్తాయి. అవి కూడా పొడుము పొడుముగా మారిపోతాయి' అన్నాడు.

తన చెవుల్ని తనే నమ్మలేనట్టు విచిత్రంగా చూశాడు సూసీయన్.

***

'వాడు ఎవడోగాని ఆ కుంగ్‌ఫూ వస్తాదు చెవుల్లో పువ్వులు పెడుతున్నాడు గురూ... సముద్రంలో బడబాగ్ని ఉండటం అనేది వట్టి కట్టుకథ... నీళ్ళలో నిప్పు ఉంటుందంటే నమ్మటం వట్టి తెలివితక్కువతనం' షాడో చెపుతున్న మాటల్ని శ్రద్ధగా వింటున్న గంగారాం వెంటనే అన్నాడు వెక్కిరింపుగా.

బురదనేలల్లో నుంచి వచ్చి, ఎముకలతో చేసిన నాణేల మూటను తమకు ఇచ్చిపోయిన కానిస్టేబుల్‌ని తను కూడా చూసి ఉంటే బాగుండి ఉండేదనిపిస్తోంది షాడోకి. ఆ ఆలోచనని అతి బలవంతంగా అణచుకుంటూ, 'సిగరెట్ కావాలి గంగా... అర్జంట్‌గా' అన్నాడు.

'ముందు ఈ బడబాగ్ని గురించి తేల్చు' అన్నాడు గంగారాం.

'నిప్పుని గురించి మాట్లాడితే నాకు ముందుగా సిగరెట్లే గుర్తుకు వస్తున్నాయి. అవి కావాల్సిందే' మొండిగా అన్నాడు షాడో.

గట్టిగా నిట్టూర్చి కింది నించి లేచాడు గంగారాం. 'నేను వెళ్ళి తీసుకువస్తాను. ఈ లోపల నువ్వు బడబాగ్ని గురించిన విషయాల్ని గట్టిగా గుర్తుచేసుకుంటూ ఉండు' అంటూ ఇంటి వెనుకనుంచి వీధిలోకి బయలుదేరాడు.

ఎంతో దూరం పోలేదు. వంద అడుగులు మాత్రమే వేశాడు. చెవులు చిల్లులు పడేటట్లు మోతలు చేస్తూ దూసుకువస్తున్న మోటార్ వెహికల్స్ కనబడే సరికి, రోడ్డు పక్కకు పోయి ఒదిగి నిలుచున్నాడు.

ఆ వాహనాల్లో ఉన్నవారి దృష్టిలో పడకుండా ఉంటే, వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళిపోతారని అనుకుంటున్నాడు అతను. అంతలోనే మరో విషయం స్ఫురణకు వచ్చి, ఒళ్ళు జలదరించినంత పని అయింది.

హుహుశాన్ జనమే వాళ్ళు. కాంటన్ నగరంలోని రోడ్ల మీద అంత వేగంగా వాహనాలు నడిపే ధైర్యం వాళ్ళకు మాత్రమే ఉంటుంది. తమ యజమాని అప్పచెప్పిన పనిని వదిలేసి అర్థాంతరంగా మటుమాయం అయిపోయిన మిచిషీ కోసమే అటుగా వస్తున్నారు వాళ్ళు. ఆమె కనిపించకపోతే చేతులు ఊపుకుంటూ వెనక్కి వెళ్ళిపోరు. ఇంటిని వెతుకుతారు. ఇంటివెనుక భాగంలోకి కూడా తొంగి చూస్తారు.

ఇటుకరాయిని తల కింద పెట్టుకుని, శ్రీకృష్ణపరమాత్ముడి మాదిరి కునికిపాట్లు పడుతున్న తన గురువు గారిని చూస్తారు. అంతే... వెంటనే మొదలు అవుతుంది మరో గందరగోళం.

వీధి పక్కకు పోయి నిలుచున్నవాడు కాస్తా, ఉన్నట్లుండి కదిలి, వాళ్ళ మధ్యలోకి వచ్చి, కరెంటు స్తంభం మాదిరి నిలబడ్డాడు గంగారాం.

కీచుధ్వనులు చేశాయి వాహనాలు. అతనికి నాలుగు అడుగుల దూరంలో ఆగిపోయాయి దుమ్ము తెరలను రేపుతూ.

'రేయ్ ఎవడ్రా నువ్వు? ఇంట్లో చెప్పేవచ్చావా?' కోపంగా అడుగుతూ ముందున్న బండిలో నుంచి దిగారు ఇద్దరు దృఢకాయులు.

'నా సంగతి తర్వాత.. మీరు మీ కుటుంబాలకు వీడ్కోలు పలికి వచ్చారో లేదో ఆలోచించుకోండి' అన్నాడు గంగారాం.

విపరీతమైన కోపంతో కమిలిపోయాయి ఆ మనుష్యుల ముఖాలు. 'మమ్మల్నే వెక్కిరించేటంత మొనగాడివా నువ్వు? ఎవరివి రా? ఎవరు నువ్వు?' అంటూ ఒక్కసారిగా మీద పడి తమ పిడికిళ్ళతో అతని ముఖం మీద కొట్టటానికి ప్రయత్నించారు.

ఒకరి వెనుక ఒకరుగా కిందికి దిగుతున్నారు వాళ్ళ సహచరులు అందరూ. తమ ఆయుధాలను గట్టిగా పట్టుకుని ముందుకు రాబోతున్నారు.

అంతమందిని ఎదిరించటం తనకు సాధ్యపడే పనికాదని గంగారాంకి తెలుసు. అందుకే చటుక్కున రూట్ మార్చాడు అతను. నిఠారుగా నిలబడిన వాడు కాస్తా గిరుక్కున పక్కకు తిరిగి, పది అంగల దూరంలో ఉన్న ఒక సందులోకి పరుగు మొదలుపెట్టాడు.

అతను అంత వేగంగా తిరోగమిస్తాడని ఊహించక పోవడం వల్ల, రెండంటే రెండు క్షణాలు బొమ్మల మాదిరి నిలుచుండిపోయారు ముందుగా అతని మీదికి వచ్చిన దృఢకాయులు.

వాళ్ళు తమ ఆశ్చర్యం నుంచి తేరుకుని 'పట్టుకోండి... వాడిని పట్టుకోండి' అని అరుస్తూ వెంట పడటం మొదలుపెట్టే సమయానికి, చాలా ఆలస్యం అయిపోయింది.

సందులోకి ఎంటర్ అయిన గంగారాం పాతిక అడుగుల దూరం వెళ్ళిపోయాడు. ఒక ఇంటి ముందు ఆడుకుంటున్న పదిమంది చిన్నపిల్లల్ని చూసి సడన్‌గా ఆగిపోయాడు.




**గుండెలనిండా గాలిపీల్చుకుని, నాభిస్థానంలో ఉన్న జీవశక్తిని తలచుకున్నాడతను. ఒక్కసారిగా ఝల్లుమన్నది అతని శరీరం. రోమాంచితం అయింది. వింటినుంచి వెలువడిన బాణంలా దూసుకుపోయాడు. ఎదురుగా కనిపించిన జలచరాన్ని రెండుచేతులతోను పట్టుకుని, బలంగా పైకి విసిరాడు. అంతే...ఎంత హఠాత్తుగా ఉప్పొంగటం మొదలైందో అంతే హఠాత్తుగా తిరోగమించింది సముద్రం. అసలా జలచరానికి, సముద్రం ఉప్పొంగటానికి గల సంబంధమేమిటి?**

నీలం రంగు గాజు గోలీలను పట్టుకుని, గురిచూసి ఒక గుండ్రటి రాయికేసి కొట్టే ప్రయత్నం చేస్తున్నారు వాళ్ళు.

'పెరిగి పెద్దవాళ్ళయిన తర్వాత మంచి చదువులు చదువుకుని, మరింత మంచి ఉద్యోగాలు చేయవలసిన వాళ్ళు మీరు. ఎందుకూ పనికిరాని ఒక రాయిని గురిచూసి కొట్టలేక పోతున్నారా?' వెక్కిరింపుగా అడిగాడు అతను.

అతని చేతిలోని గోలీలన్నిటినీ తీసుకుని నేల మీద మోకరించి కూర్చున్నాడు గంగారాం. అతను కూర్చున్న ప్రదేశానికి సరిగ్గా ఇరవై అడుగుల దూరంలో ఉన్నది రాయి.

ఒక కంటిని మూసి, గోలీని దానికేసి గురిపెట్టాడు.

తమ అడుగుల చప్పుళ్ళతో ఆ సందును కంపింప చేస్తూ వచ్చేశారు అతన్ని తరుముకుంటూ వస్తున్న దృఢకాయులు.

తమ దృష్టి అంతా తమకు చిక్కకుండా పారిపోతున్న మనిషి మీదే ఉండటం వల్ల, పిల్లల మధ్యలో మోకరించి కూర్చుని ఉన్న పర్సనాలిటీని వెంటనే పోల్చుకోవడం సాధ్యం కాలేదు.

'ఇటుగా వచ్చాడు ఒక రాస్కెల్. కనిపించాడా?' అని అడిగారు వాళ్ళు గుంపులో ఉన్న బాలికను.

'వచ్చాడు.. అడుగో... సందులో చివర ఉన్న ఇంట్లోకి పోయాడు' మూసిన కంటిని తెరవను కూడా తెరవకుండా, గురి చూడటాన్ని ఆపకుండా ఆ బాలిక కంటే ముందుగా తను సమాధానం చెప్పాడు గంగారాం.

చెపుతూనే చేతిలోని గోలీని విసిరాడు. వేగంగా పోయి ఫట్‌మంటూ గులకరాయికి తగిలింది అది.

గొల్లున అరచి చప్పట్లు కొట్టారు ఊపిరి బిగపట్టి చూస్తున్న గుంపులోని పిల్లలు చాలామంది.

'పదండిరా... త్వరగా పదండి' అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ సందు చివరికి పరిగెత్తారు దృఢకాయులు అందరూ.

చక్‌చక్‌మని తన దగ్గర ఉన్న గోలీలన్నిటినీ గులకరాయి మీదికి విసిరాడు గంగారాం.

టప్‌టప్‌మంటూ శబ్దం చేశాయి అవి రాయికి తగిలి.

మోకాళ్ళకు అంటిన మట్టిని దులుపుకుంటూ లేచి, తనకేసి ఆశ్చర్యంగా, అభిమానంగా చూసిన పిల్లాడి తల నిమిరాడు గంగారాం.

'సాధన అవసరం తమ్ముడూ... జీవితంలో ఏ పని చేయాలన్నా రెండో ఆలోచన పెట్టుకోకుండా తదేకదృష్టితో సాధనచెయ్యాలని మా గురువుగారికి, వాళ్ళ గురువులు చెపుతూ ఉండేవాళ్ళు. మీకు నేను చెపుతున్నాను. సాధన చెయ్యండి' అంటూ తాపీగా వెనుతిరిగి వచ్చిన దారినే మళ్ళీ మెయిన్‌రోడ్డు మీదికి పోయాడు.

'కనిపించాడా? వాడు దొరికిపోయాడా?' అడిగాడు కిందికి దిగి నిలబడివున్న వెహికల్ డ్రైవర్ ఒకతను.

తల అడ్డంతిప్పి అతని పక్కనుంచి అవతలికి పోవాలని అనుకున్నాడు గంగారాం. అదే సమయంలో అతని వెనకే ప్రత్యక్షం అయ్యారు సందులో గోలీలు ఆడుతున్న పిల్లలు.

'సందు చివరికి పోయిన వాళ్ళు తిరిగి వస్తున్నారు సారూ... మీరు అబద్ధం చెప్పినట్టు తెలిసిపోయింది వాళ్ళకి' అన్నాడు గోలీల్ని విసరగలవా అని ఛాలెంజ్ చేసిన పిల్లాడు.

## భానుమతి భయపెడుతుందా?

*తన నటనతో అందరినీ ఫిదా చేసిన సాయి పల్లవి బిజీ అయిపోయింది. తాజాగా ఆమె ఓ ఇంట్రస్టింగ్ సినిమాకు ఓకే చెప్పిందట. ప్రస్తుతం నాని సినిమాలో హీరోయిన్‌గా చేస్తున్న సాయి పల్లవి, ఓ థ్రిల్లర్ సినిమాలో నటించేందుకు అంగీకరించింది. లేడీ ఓరియంటెడ్ సినిమాగా తెరకెక్కుతున్న ఈ సినిమాను తెలుగుతో పాటు తమిళ, మలయాళ బాషల్లో ఒకేసారి రూపొందించేందుకు ప్లాన్ చేస్తున్నారు. నటనతో అందరినీ మెప్పించిన ఈ భామ ఎంత వరకు భయపెడుతుందో చూడాలంటూ సినీ జనాలు అనుకుంటున్నారు.*



తను ఎవరో అందరికీ అర్థమయ్యేలోపు అవతలికి వెళ్ళిపోవచ్చని అనుకుంటున్న గంగారాం ఆశ నిరాశ అయిపోయింది.

చిటికెలో ఎలర్ట్ అయిపోయాడు అతన్ని పలుకరించిన డ్రైవర్. పళ్ళు బిగించి అతని మీదికి ఎగబడ్డాడు.

'పారిపోండి.. దూరంగా వెళ్ళిపోండి' అంటూ పిల్లల్ని హెచ్చరించి, ఆ డ్రైవర్ గుండెల మీద పిడికిలితో పొడిచాడు గంగారాం. అతను వెనక్కి తూలగానే పక్కకు తిరిగి పరుగు మొదలుపెట్టాడు.

'రండిరోయ్... రండిరండి' అని అరుస్తూ కిందికి దూకారు మిగిలిన వెహికల్స్‌లో ఉన్న డ్రైవర్లు కూడా.

వారెవరికీ దొరికే ఆలోచన లేకపోవటం వల్ల మరింత వేగంగా పరుగుతీసి, వంద గజాల దూరంలో కనిపించిన మరో సందులోకి ఎంటర్ అయ్యాడు గంగారాం.

సందులోకి పోయిన వీరాధివీరులు, వెహికల్స్ లోనుంచి దిగిన డ్రైవర్లు అందరూ కలిసి ఆ సందులోకి వచ్చేసరికి, చాలాదూరం పోయి మటుమాయం అయిపోయాడతను.

***

'సిగరెట్టు కావాలని అడిగాను. కామ్‌గాపోయి ఒక పాకెట్టు తీసుకురావటానికి నీకు మూడు గంటలు పట్టింది' బయలుదేరిన తర్వాత చాలాసేపటికి అలసటగా అడుగులు వేస్తూ వచ్చిన జతగాడిని చూసి, విసుగునిండిన కంఠంతో వెక్కిరించాడు షాడో.

'శ్రీకృష్ణ పరమాత్మ మాదిరి చిలక నవ్వులు నవ్వుతూ కూర్చోవటం కాదు, సిగరెట్లు తీసుకురావటం అంటే. అలా ఒకసారి రోడ్డుమీదికి పోయి చూడు నీకే తెలుస్తుంది' పైజమా జేబులో నుంచి రెండు పాకెట్లను తీసి అందిస్తూ కోపంగా అన్నాడు గంగారాం.

సిగరెట్ వెలిగించుకుని గుండెల నిండా పొగను పీల్చుకుంటూ హాయిగా నిట్టూర్చాడు షాడో.

'నిట్టూర్పులు తర్వాత... ముందు మనం మకాం మార్చేయాలి' తలతిప్పి ఇంటి ముందుకు చూస్తూ అన్నాడు గంగారాం.

అతను ఆ మాట అంటూ ఉండగానే వినవచ్చింది ఇంటిముందుకు వెహికల్స్ వచ్చిన శబ్దం.

'ఈ హుహుశాన్‌గాడికి బుద్ధిలేదు. ఎన్నిదెబ్బలు తిన్నా ఇంకా ఇంకా కావాలని అంటూనే ఉన్నాడు' కోపంగా అంటూ షాడో చేయి పట్టుకుని బలవంతంగా పైకి లేపాడు గంగారాం.

'నాకు విసుగు ఎక్కువైపోతోంది గంగూ. లేచిన దగ్గర్నించి తిరిగి పడుకునే వరకు ఒకటే పరిగెత్తటం. ఇది బాగోలేదు' బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ అన్నాడు షాడో.

'వాళ్ళు వట్టి చంచాగాళ్ళు. ఇట్లాంటి వాళ్ళను కొట్టినా తిట్టినా ఏమీ ఉపయోగం ఉండదు. కొడితే సూటిగా పోయి వాళ్ళ యజమానికి తగలాలి. అంతే' అంటూ అతన్ని దూరంలో ఉన్న చెట్ల గుంపుకేసి అతి బలవంతంగా తీసుకుపోయాడు గంగారాం.

ఇంటిముందు ఆగిన వెహికల్స్‌లో నుంచి దూకి తోడేళ్ళ గుంపు మాదిరి వచ్చేశారు దృఢకాయులు. ముఖద్వారపు తలుపుల్ని విరగదన్ని లోపలికి ఎంటర్ అయినారు. గొడవగొడవగా మాట్లాడుకుంటూ ఇంటినంతా వెతికారు. ఇంటి వెనుక భాగంలో కూడా గాలించారు.

'మనం అక్కడ మకాం పెట్టినట్టు వాళ్ళకి తెలిసిపోతుంది' దూరంగా పోయిన తర్వాత ఒక చెట్టు

చాటున నిలబడుతూ అన్నాడు షాడో.

'ఎలా తెలిసిపోతుంది?' అడిగాడు గంగారాం.

'నేను కాల్చిన సిగరెట్ పీకలు అన్నీ అక్కడే పడేశాను. వాటిని చూస్తారు' అన్నాడు షాడో.

చిన్నగా నవ్వి తన ఎడమ చేయి గుప్పిట తెరచి చూపించాడు గంగారాం.

'వచ్చేటప్పుడు ఒక్కదాన్ని కూడా వదలకుండా షాడో పడవేసిన సిగరెట్ అవశేషాలన్నింటినీ వెంట బెట్టుకు వచ్చాడతను.

'నువ్వు చాలా గ్రేట్ గంగూ. నువ్వు వెంట లేకపోతే నేను ఏమైపోయి ఉండేవాడినో' మెచ్చుకున్నాడు షాడో.

రెండింతలు అయింది గంగారాం ఛాతి. అయితే ఆ విషయాన్ని ముఖంలో కనిపించకుండా చాలా జాగ్రత్తపడ్డాడు అతను. 'వద్దన్న పనులు చేస్తూ లేనిపోని తలనొప్పులు తెచ్చి పెట్టుకోవడం నీకు ఈ మధ్యన బాగా అలవాటు అయిపోయింది' కోపం నటిస్తూ అన్నాడు.

'నాకు ఆకలి వేస్తోంది' ఉన్నట్లుండి ఎనౌన్స్ చేశాడు షాడో.

'ఈ హుహుశాన్ చంచాలు ఇప్పుడు వెనక్కిపోయి జరిగింది ఏమిటో వాళ్ళ యజమానికి రిపోర్ట్ చేస్తారు. ఆ దేబెముఖంగాడు ఈసారి ఏం చేస్తాడో నా ఊహకి అందటం లేదు' అన్నాడు గంగారాం.

'వాడు ఏం చేస్తాడో నీకు తెలియనంత మాత్రాన ఇప్పుడు వచ్చిన నష్టం ఏమీ లేదు. ముందు నా ఆకలి సంగతి ఆలోచించు' అన్నాడు షాడో.

'ఆలోచిస్తాను. అంతకుముందుగా నువ్వు ఈ బడబాగ్ని విషయం పూర్తిచేయి' అన్నాడు గంగారాం.

అంతకుముందే కింద పడవేశాడు షాడో వెలిగించుకున్న సిగరెట్‌ని. అయినా సరే ఇప్పుడు ఇంకో సిగరెట్‌ని బయటికి తీశాడు.

అధికం అయిపోయింది గంగారాం అసహనం. 'బడబాగ్ని గురూ... నీటి అడుగున పుట్టి సర్వనాశనం సృష్టించే దారుణమైన శక్తి.. దాన్ని పెట్టెల్లో పెట్టటం ఎలా సాధ్యం?' అన్నాడు.

'బాణాలు, బరిశెలు, కత్తులుతప్ప మరో ఆయుధం అంటూ తెలియని మనిషి ఇప్పుడు తుపాకులు, రివాల్వర్లు ఉపయోగించటం ఎలా సాధ్యపడింది?' ఎదురు ప్రశ్నవేశాడు షాడో.

'టెక్నాలజీ గురూ... టెక్నాలజీ అభివృద్ధి చెందింది. తుపాకులు, రివాల్వర్లు ఏమిటి? ఆటం బాంబులు కూడా కనిపెట్టేశారు కదా' అన్నాడు

### హేతువాది తిరుగుబాట

ప్రముఖ సాహితీ విమర్శకుడు, పండితకవి, హేతువాది కొత్త సత్యనారాయణ చౌదరిగారు. 'దేవుడు ఉన్నాడా లేడా?' అని ప్రశ్నించి, ఉన్నాడన్న విద్యార్థులను తన తర్కబలంతో ఏడిపించారు.



ఒకసారి వేసవి సెలవుల్లో సత్యనారాయణగారికి జబ్బు చేసింది. మంచం దించారు. ఆ సమయంలో వారి పక్కింటివారు ఆయన భార్యచేత బలవంతాన ముడుపు కట్టించారు. లాభం లేదనుకున్న సత్యనారాయణ గారికి కొత్త ఊపిరి వచ్చింది. ముడుపు విషయం తెలిసినాగానీ ఆయన ఆగ్రహించలేదు. మరుసటేడు, బడి తెరిచేసరికి, ఆయన ఓ శతకంరాసి అచ్చువేయించి విద్యార్థులందరికీ పంచిపెట్టి, దేవుడు లేడంటే, చంపుతానని సుకుమారంగా చెప్పారు.

*సేకరణ: ఎన్. తారకరామారావు*

గంగారాం.

'ఆటంబాంబులకు అవసరం అయిన పదార్థం ఏమిటో తెలుసుకదా!'

'భలేవాడివి గురూ... మరీ చిన్నపిల్లాడికి చెప్పినట్టు చెపుతావు. నీ మాదిరి చదువుకోక పోయినా, నాకు కొంచెంగా వచ్చు. అది అణువిజ్ఞాన శాస్త్రం'.

'అదే ఆనాడు సూసీయన్‌కు తెలిసింది. అణువు, పరమాణువులతో సంబంధం కలిగిన టెక్నాలజీని ఉపయోగించి సముద్రం నీటిని రెచ్చగొట్టి భూమి మీదికి పంపించే సాధనాల్ని తయారుచేశారు డూడూ సామ్రాజ్యానికి చెందినవాళ్ళు. రేడియోధార్మికత కారణంగా వట్టిచేతులతో పట్టుకుంటే ప్రమాదం ఎదురవుతుందని చెప్పి సూసీయన్‌ని వారించాడు, ఆ పెట్టెను పట్టుకోకుండా' అన్నాడు షాడో.

'అంటే ఆ తిమింగలం మెడలో కట్టబడిన చిన్న పెట్టె ఒక అణురియాక్టర్ వంటిది అయి ఉంటుందా?' ఆశ్చర్యంగా అడిగాడు గంగారాం.

సిగరెట్ పొగను నాశికారంధ్రాలలో నుంచి బయటికి వదులుతూ తల ఊపాడు షాడో.

'నాకు నమ్మబుద్ధి కావటం లేదు. కాలినడకన తప్ప మరే విధంగానూ ప్రయాణం చేయటం చేతకాని ఆ రోజుల్లో అణురియాక్టర్లను, అందులోను పోర్టబుల్ రియాక్టర్లను తయారు చేయటం – అయ్యబాబోయ్... ఆ డూడూ సామ్రాజ్యం ఎటువంటిదో గాని, కళ్ళు తిరిగిపోతున్నాయి వింటూ ఉంటే' గుండెల మీద చెయ్యి వేసుకుంటూ అన్నాడు గంగారాం.

'నీ అనుమానం తీరిపోయింది కదా... నా ఆకలి సంగతి చూడు' అన్నాడు షాడో.

'అనుమానం తీరలేదు. అధికం అయింది. ఆ తర్వాత జరిగింది ఏమిటో చెప్పు' అన్నాడు గంగారాం.

దీర్ఘంగా నిట్టూర్చాడు షాడో. సగం మాత్రమే కాలిన సిగరెట్‌ని కింద పడవేశాడు.

***

'సామాన్యులు ఎవరూ సమీపించలేని మహత్తరమైన శక్తి మీ స్వాధీనంలో ఉంది. మీకు ద్రోహం చేసిన వారిని వదిలిపెట్టి, రెక్క ఆడితే గాని డొక్కలు ఆడని సామాన్యుల మీద మీ ప్రతాపం చూపిస్తున్నారు. ఇది భావ్యంగా ఉన్నదా?' చేతులు జోడించి వినయంగా నిలబడి ఉన్న దృఢకాయుడిని అడిగాడు సూసీయన్.

'మా దగ్గర ఉన్న శక్తి మహత్తరమైనదని అనుకోవటంలో తప్పులేదు. కాని అది నీటిలో ఉన్నప్పుడే తన మహిమను ప్రదర్శిస్తుంది. నీరు లేని పొడి నేల మీద అది నిర్వీర్యం అవుతుంది. మా రాణి వారిని అపహరించిన దుర్మార్గులు నీటిలో ఉండి ఉంటే ఈపాటికి ఖండఖండాలుగా నరికి, మా తిమింగలాలకి ఆహారంగా వేసి ఉండేవాళ్ళం' అన్నాడు అతను.

పదిక్షణాలు ఆలోచించాడు సూసీయన్. ఒక నిర్ణయానికి వచ్చినట్టు తల ఊపాడు. 'మీ రాణీవారిని నేను తీసుకువచ్చి మీకు అప్పగిస్తాను, ఆమె ప్రాణాలతో ఉండి ఉండే పక్షంలో. మీరు మాత్రం సముద్రాన్ని రెచ్చగొట్టే పనులు మానేయాలి. తీరభూమిని కలుషితం చేయకూడదు' అన్నాడు.

'మా రాణీవారు మాకు లభిస్తే మీరు కావాలని కోరుకున్నా, మేము మీకు కనిపించేది లేదు. మా సామ్రాజ్యానికి మేము తిరిగి వెళ్ళిపోవటమే కాదు, మరెన్నడూ ఈ ప్రదేశాల దగ్గరికి రావటం జరగదు' అన్నాడు.

గిలగిలా కొట్టుకుంటూనే ఉన్న తిమింగలం దగ్గరికి పోయాడు సూసీయన్. తను ఏం చేస్తున్నాడో అందరికీ అర్థం అయ్యేలోపుగా, దాన్ని అమాంతం చేతుల్లోకి తీసుకుని బలంగా సముద్రంలోకి విసిరేశాడు.

గింగిరాలు తిరుగుతూ పోయి నీటిలో పడింది అది. తోకతో నీటిని చెల్లాచెదురు చేస్తూ దూరంగా పారిపోయింది.

'మీ రాణీవారు ఈ ప్రదేశంలో అడుగుపెట్టిన ప్రదేశాన్ని నాకు చూపించండి' అన్నాడు సూసీయన్.

అటువంటి మాటలు అదే పనిగా చెప్పించుకోవటం అలవాటు లేనట్టు వెంటనే పక్కకు తిరిగి సముద్రపు ఒడ్డునే ఉన్న ఇంకో ఇసుక ప్రదేశం దగ్గరికి అతన్ని తీసుకుపోయారు వాళ్ళు.

సముద్రం పొంగినప్పుడు సగం వరకూ మునిగిపోయింది ఆ ప్రదేశం. మెత్తటి వస్త్రంతో అలవోకగా అద్దినట్టు అతిశుభ్రంగా కనిపిస్తోంది.

'పొంగివచ్చిన నీరు ఇక్కడి అడుగుజాడల్ని, ఇతర సంకేతాలను నాశనం చేసేసింది' నడుము మీద చేతులు వేసుకుంటూ అన్నాడు సూసీయన్.

నీరు చేరలేని ఒక ఎత్తయిన ఇసుకగుట్ట మీదికి అతన్ని తీసుకుపోయి కిందకి చూడమని సైగ చేశాడు ఆ దృఢకాయుడు.

**(ఇంకా వుంది)**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## సంతానలేమి లోపాల నివారణకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



సంతానలేమి – ఇది ఈ మధ్యకాలంలో ఎంతోమంది దంపతులకు ఎదురవుతున్న పెద్ద సమస్య. మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు, అధిక మానసిక ఒత్తిడి వలన ఈ సమస్య నానాటికీ పెరుగుతూనే ఉంది. సాధారణంగా సంతానలేమి అనగానే, ఎక్కువగా స్త్రీలను మాత్రమే నిందించడం జరుగుతుంది. కానీ 'సంతానలేమి'కి గల కారణాలు స్త్రీ,పురుషులలో సమాన స్థాయిలో ఉండే అవకాశం ఉంటుంది. ప్రస్తుత గణాంకాల రీత్యా ఈ సంతానలేమి లోపాలు స్త్రీలలో 50% మరియు పురుషులలో 45% వరకు కనిపిస్తున్నాయి. మరికొందరిలో ఎలాంటి లోపాలు కనిపించకపోయినా సంతానలేమి సమస్య ఏర్పడవచ్చు. దీనిని ఇడియోపతిక్ ఇన్‌ఫెర్టిలిటీ అంటారు.

**సంతానలేమి అనగా:** ఆరోగ్యవంతులైన దంపతులు ఏ విధమైన గర్భనిరోధక చర్యలు చేపట్టకుండా ఒక సంవత్సరం పాటు సాధారణ శృంగార జీవితం గడిపినా పిల్లలు కలగకపోటాన్ని సంతానలేమి అంటారు. **సంతానలేమి 2 రకాలు: (1). ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీ:** స్త్రీలు, తమ వివాహం అనంతరం 1 సం॥ పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినా గర్భం దాల్చకపోవడం. **(2). సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ:** ఒకసారి గర్భం దాల్చి పిల్లలు కలగడం లేదా గర్భస్రావం జరగడంతో 2వ సారి సంతానం కలగక పోవడం.

**పురుషులలో 'సంతానలేమి'కి గల కారణాలు:**

- **అజూస్పెర్మియా:** శుక్రకణాలు తక్కువగా ఉత్పత్తి కావడం, లేదా శుక్రకణాలు పూర్తిగా ఉత్పత్తి కాకపోవడం.
- **అస్తినోస్పెర్మియా:** శుక్రకణాలు ఉత్పత్తి అయినప్పటికీ వాటి కదలికలు సాధారణంగా లేకపోవడం, శుక్రకణాల నిర్మాణంలో తేడాలు ఉండటం (టెరటోస్పెర్మియా).
- **వెరికోసిల్:** వృషణాలలో ఉండే రక్తనాళాలు వాపునకు గురికావడం.
- **హైడ్రోసిల్:** వృషణాలు ఉండే తిత్తిలో నీరు చేరడం.
- వృషణాలు శోథమునకు గురికావడం, వృషణాలకు అధిక వేడి తగలడం, అంగస్థంభన, శీఘ్రస్కలనం వంటి లైంగిక సమస్యలు.
- పిట్యుటరీ, థైరాయిడ్ మరియు టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత.
- అధిక బరువు, మధుమేహం, పొగత్రాగటం మరియు జన్యుపరమైన అంశాలన్నీ 'సంతానలేమి'కి కారణాలయ్యే అవకాశం ఉంటుంది.



Male Infertility

**స్త్రీలలో 'సంతానలేమి'కి గల కారణాలు:**

- గర్భసంచి చిన్నదిగా ఉండటం లేదా గర్భసంచి లేకపోవడం.
- గర్భసంచి నిర్మాణంలో లోపాలు ఉండటం, గర్భసంచిలో కణితులు ఏర్పడటం, ఎండోమెట్రియోసిస్.
- ఫెలోపియన్ ట్యూబ్స్ లేకపోవడం లేదా ట్యూబ్స్ మూసుకుపోవడం.
- అండాశయం ఎదగకపోవడం లేక అండాశయంలో సరైన ఎదుగుదల లేకపోవడం.
- యోని చిన్నదిగా ఉండటం లేదా యోని మార్గం మూసుకుపోవడం.
- యోని మార్గంలో ఉండే మ్యూకస్ పొర శుక్రకణాలు ఈదటానికి అనువుగా లేకపోవడం.
- యోని – అధిక ఆమ్లగుణం కలిగి ఉండటం వలన శుక్రకణాలు చనిపోవటం.
- **హార్మోన్ సమస్యలు:** హైపోథైరాయిడిజమ్ మరియు హైపర్‌థైరాయిడిజమ్, పీ.సీ.ఓ.డి., ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., ప్రొలాక్టిన్ హార్మోన్‌ల అసమతుల్యత వంటి అంశాలన్నీ స్త్రీలలో సంతానలేమి ఏర్పడటానికి కారణాలు కావచ్చు.



Female Infertility

**'సంతానలేమి'కి నిర్ధారణ పరీక్షలు:**

**పురుషులలో:** సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్., సీ.యూ.ఇ., ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., యూ.ఎస్.జి. అబ్డమిన్, యూ.ఎస్.జి. స్క్రోటమ్, కంప్లీట్ సెమెన్ ఎనాలిసిస్, సీరమ్ టెస్టోస్టిరాన్, థైరాయిడ్ ప్రొఫైల్, ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., టెస్టిక్యులార్ బయాప్సీ. **స్త్రీలలో:** సీ.బీ.పి., ఇ.ఎస్.ఆర్., సీ.యూ.ఇ., ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., సీరమ్ ప్రొలాక్టిన్, థైరాయిడ్ ప్రొఫైల్, యూ.ఎస్.జి. అబ్డమిన్., హెచ్.ఎస్.జి., లాప్రోస్కోపీ, ఫాలిక్యులార్ స్టడీ.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్సలో భాగంగా, జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ విధానం ద్వారా స్త్రీ,పురుషులలో తలెత్తే సంతానలేమి లోపాలను సరిచేస్తూ శాశ్వత పరిష్కారం అందించడమే కాకుండా, రెండవ మరియు మూడవ సంతానానికి మార్గం సుగమం చేయటం జరుగుతుంది. సంతానలేమి సమస్యలను అధిగమించే క్రమంలో, హోమియోపతి వైద్య విధానం ద్వారా 50 నుండి 60 శాతం వరకు సత్ఫలితాలను అందుకోవడం జరుగుతోంది.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | **కన్సల్టేషన్ ఉచితం 955 000 1199** | www.homeocare.in



# ఇలా కూడా బతికేస్తున్నారు!

**మామూలుగా మనకు ఆకలేస్తే ఏం చేస్తాం? ఇంట్లో అప్పటికి అందుబాటులో ఉన్న ఏదో ఒక ఆహారం గబగబా తినేస్తాం. ఆహారం, నిద్ర, నీరు ప్రతి జీవికీ అతిముఖ్యమైన అవసరాలు. మనిషి ఏపని చేసినా చేయకపోయినాసరే ఆహారం, నిద్ర, నీరు లేకుండా జీవించడం సాధ్యంకాదు. కానీ ఇప్పుడు మనం చెప్పుకునే వ్యక్తులుమాత్రం అలా కాదు. నిద్ర లేకుండా గడపగలరు. నీరు తాగకుండా ఉండగలరు. ఆహారం తినకుండా బతకగలరు!**

జీవులన్నింటికీ ప్రాణాధారం గాలి. ఎవరైనా సరిగ్గా తిండి తినకపోతే, 'వీడికి తిండి, నిద్ర అక్కర్లేదురా, గాలి పీల్చి బతికేస్తాడు' అంటుంటాం అతిశయోక్తిగా. కానీ ఇది అతిశయోక్తి కాదు, సరదా అంతకంటేకాదు, నిజంగానే ఆ దంపతులు గాలి పీల్చి బతికేస్తున్నారు. ఇక గాలి తర్వాత మనిషికి ప్రధానమైనది నీరే కదా! గాలిపీల్చకుండా ఎలా ఉండలేమో నీరుతాగకుండా కొన్నిగంటలు ఉండడం కూడా మనిషికి కష్టమే. కానీ ఓ వ్యక్తిమాత్రం గంటలు కాదుకదా, ఏళ్ల తరబడి చుక్కనీరు కూడా తీసుకోకుండా బతికేస్తున్నాడు. ఇలాంటివాళ్ల గురించి చెబుతుంటే ఆశ్చర్యం కలుగుతోంది కదూ! ఎందుకాలస్యం వాళ్లెవరో చదివేసేయండి!!

## గాలి భోంచేస్తారు!

అమెరికాలో ఒక ఇద్దరు దంపతులు కేవలం గాలి పీల్చుకుని బతికేస్తున్నారు. అంటే వాళ్ల భోజనం గాలేనన్నమాట! కామిల్లా కాస్టెలో, అకాహి రికార్డో అనే ఆ భార్యాభర్తలిద్దరూ కాలిఫోర్నియా రాష్ట్రం ఈక్వెడార్ దగ్గర నివసిస్తున్నారు. వీళ్ళిద్దరూ బ్రెతేరియనిజం పాలో అవుతున్నారు. బ్రెతేరియనిజం? అదేంటి ఈ పదం కొత్తగా ఉందే అనుకుంటున్నారా? బ్రెతేరియనిజం అంటే ఇతర ఆహారం ఏమీ తీసుకోకుండా కేవలం గాలిపీల్చి బతకడమన్నమాట. ఇలా ఆ ఇద్దరూ తొమ్మిది సంవత్సరాలుగా ఏమీ తినకుండా కేవలం గాలిపీల్చి బతుకుతున్నారు. 2005లో వీరిద్దరికీ పరిచయం మొదలైంది. 2008లో పెళ్లిచేసుకున్నారు. ఆ తర్వాత ఒకసారి తెలిసిన వాళ్లెవరో ఈ గాలిపీల్చి బతకడం గురించి చెప్పిన తర్వాత వారికి కూడా అలాంటి జీవనశైలిని ప్రయత్నించాలనే కోరిక కలిగింది. అందుకోసం ముందు 21 రోజులు గాలి పీల్చి మాత్రమే ఉండాలని అనుకున్నారు. మొదటి వారం రోజులు ఏమీ తీసుకోకుండా కేవలం గాలి పీల్చి బతికారు. ఆతర్వాత రెండువారాలు నీళ్ళు, పండ్లరసం తీసుకుంటూ జీవించారు. ఈ జీవన శైలిలో వారికి తెలియనిశక్తి కనిపించిందట. అందుకే దీన్ని మరింత కాలం కొనసాగించాలనుకున్నారు. ఈ క్రమంలో ముందు తమ రెగ్యులర్ జీవనశైలి నుంచి శాకాహారులుగా, ఆ తర్వాత వేగన్లుగా మారారు. ఆపై కేవలం పండ్లు మాత్రమే తీసుకుంటూ డైట్‌ను పాటించారు. అనంతరం కేవలం గాలిపీల్చి తొమ్మిదేళ్లుగా బతికేస్తున్నారు.

## కేవలం మూడుసార్లు

గాలిపీల్చి బతకడం అలవాటైన తర్వాత మొదటి మూడేళ్ళు అసలు ఆహారమేమీ తీసుకోకుండా ఉన్నారు. ఆ తర్వాత నుంచి వారానికి మూడుసార్లు ఏదైనా పదార్థం తీసుకుంటున్నారు. ఏమీ తినకుండా ఉంటే ఆకలి వేయదా అనే అనుమానం రావచ్చు. అయితే ఇలా మూడుసార్లు ఆహారం తీసుకోవడం అనేది ఆకలివేసి కాదు, అసలు ఆకలి అనే ఫీలింగ్ కూడా వారికిప్పుడు లేదట. అసలు ఆహారం తినకపోవడంవల్ల ఏదైనా కోల్పోతున్నామనే భావన కూడా వారికి లేదు. కేవలం రుచులు తెలుసుకోవడానికే అప్పుడప్పుడూ పండ్లు, లేదా వెజిటబుల్ సూప్‌ను తీసుకోవడం అలవాటు చేసుకున్నారు. ఇదంతా కష్టంగా కూడా ఏమీ అనిపించదని చెబుతోంది కామిల్లా. తొమ్మిదేళ్లపాటు ఆహారం లేకుండా గడిపినా, మానసికంగా, శారీరకంగా చాలా ఆరోగ్యంగా ఉన్నారిద్దరూ. ఇంకా విశేషం ఏమిటంటే సరుకులు కొనకుండా మిగిలిన డబ్బుతో విదేశీపర్యటనలు చేసి జీవితాన్ని ఎంజాయ్ చేస్తున్నారు ఈ భార్యాభర్తలు.

## గర్భంతో ఉన్నప్పుడు కూడా

సాధారణంగా గర్భవతులు తొమ్మిదినెలలు పౌష్టికాహారం తీసుకోవాలని వైద్యులు సూచిస్తారు. కాని కామిల్లా మాత్రం ఎలాంటి ఆహారం తీసుకోలేదు. గర్భంతో ఉన్నప్పుడు కూడా ఆహారం తీసు





# బ్రెతేరియనిజం

పూర్వకాలంలో మహర్షులు, మునులు ఏమీ తీసుకోకుండా కేవలం గాలి మాత్రమే పీల్చుకుని తపస్సు, యోగ సాధనాలద్వారా బతికారని మన పురాణాలు చెబుతున్నాయి. దాని నుంచి వచ్చిన కాన్సెప్టే ఈ బ్రెతేరియనిజం. మానవులు సులువుగా పాటించగలిగే చక్కటి పద్ధతి ఈ బ్రెతేరియనిజం. దీన్ని ప్రారంభించేటప్పుడు కాస్త ఇబ్బందిగా అనిపించవచ్చు. కానీ అలవాటయితే ప్రకృతిలోని శక్తిని గాలిద్వారా తీసుకుంటూ జీవించవచ్చు. ఈ విశ్వంలోని ప్రతి వస్తువులోనూ శక్తి దాగి ఉంటుంది. ఆ కాస్మిక్ ఎనర్జీని గాలి ద్వారా తీసుకోగలిగే శక్తి ఉన్నన్నాళ్లూ ఏమీ తినకపోయినా ఆనందంగా జీవించగలుగుతాం.

కోకుండా ఉండిపోయింది. మొత్తం తొమ్మిదినెలల కాలంలో ఆమె ఆహారం తీసుకున్నది కేవలం ఐదు సార్లే. అది కూడా బయట ఫంక్షన్లకు వెళ్లినప్పుడు తీసుకోవాలి కాబట్టి అలా తీసుకున్నవే. ప్రెగ్నెన్సీ సమయంలో పిల్లలకోసమన్నా తన లైఫ్‌స్టైల్ మార్చుకోవాలని ఆమె ప్రయత్నించింది. కానీ అసలు ఆకలే వేసేదికాదట. దాంతో ఆహారం తినాలనే కోరిక కూడా పుట్టలేదు. ఆహారం తినకపోయినా తనలోని, తనచుట్టూ ఉన్న శక్తి మొత్తం కడుపులోని బిడ్డకు అందుతుందన్న సంగతి తనకు తెలుసని, అందుకే ఎలాంటి చింతలేకుండా ఉన్నానని చెబుతోంది కామెల్లా. ఆమె ఊహించినట్లుగానే ఎప్పటికప్పుడు చేయించుకున్న ప్రతి వైద్య పరీక్షలోనూ తన కడుపులోని బిడ్డ ఎదుగుదల సాధారణంగానే ఉందని తేలింది. ఆఖరికి కామెల్లా ప్రసవం కూడా సహజంగానే జరిగింది. ఇలా ఆహారం తీసుకోని లైఫ్‌స్టైల్ వల్ల అనారోగ్యంగా ఉన్న ఆమె ఆరోగ్యం కూడా బాగుపడింది. ఆమెకు పిఎంఎస్ సమస్య ఉండేది. అంతేకాక బరువులో హెచ్చుతగ్గులు ఎక్కువగా ఉండేవట. గాలిపీల్చి బతకడంవల్ల అవన్నీ తొలగిపోయాయి. ఇంకా ప్రసవమయ్యాక వచ్చే ఇబ్బందులేవీ రాకపోగా కొన్నిరోజులకే తిరిగి మామూలుగా మారిపోయింది. తనూ, తన భర్తా గాలిపీల్చి బతికేస్తున్నా తన పిల్లలకి మాత్రం అన్నీ వండిపెడుతుంది కామెల్లా. వారు కూడా బ్రెతేరియనిజంకి అలవాటు పడతామంటే తనకేమీ అభ్యంతరం లేదని చెబుతోంది. ఇప్పటివరకు బ్రెతేరియనిజం చేసినవాళ్లు మూడుసంవత్సరాలకు మించి బతకలేదు. తొమ్మిది సంవత్సరాల వరకు ఎలాంటి అనారోగ్యం లేకుండా ఇంకా చలాకీగా ఉంటున్న ఈ జంట ఇప్పుడు సోషల్‌మీడియాలో వైరల్ అయింది. ఈ క్రమంలో చాలామందికి దీనిపై ఆసక్తి ఏర్పడింది. అయితే శరీరతత్వాన్ని బట్టి దీన్ని పాటించాలని వైద్యులు హెచ్చరిస్తున్నారు.

### నీరు తాగకుండా

గాలి తర్వాత అంతే ప్రాధాన్యం నీరుకు ఉంది. నీటికి దూరంగా బతకడం సాధ్యం కాదు. నీరు తాగకుండా ఉంటే నోరు ఆరిపోయి, గొంతు పిడచకట్టుకుపోతుంది. అప్పటికైనా గుక్కెడు నీళ్ళు గొంతులో పడకపోతే, ఎలాంటి వాళ్లయినా గుడ్లు తేలేయడం ఖాయం. అయితే, పీటర్ ఫిలాక్ (26) అనే అమెరికన్ యువకుడు మాత్రం ఏకంగా మూడేళ్లుగా నీళ్ళు తాగకుండానే నిక్షేపంగా బతికేస్తున్నాడు. నీరు తాగకుండా కూడా బతకొచ్చు అని నిరూపిస్తున్నాడు.




ఇదివరకు మేల్ నర్స్‌గా పనిచేసిన పీటర్, ప్రస్తుతం వెబ్‌కామ్ మోడల్‌గా పనిచేస్తున్నాడు. ఇతగాడు పూర్తి శాకాహారి. ఉన్నట్టుండి ఒకసారి ఇతనికి నీరు తాగకుండా బతకలేమా? అనిపించింది. అలా అనిపించడమే తడవుగా, 2012 మే 5 నుంచి నీళ్ళు తాగకుండా ఉండేందుకు ప్రయత్నాలు ప్రారంభించాడు.

తొలినాళ్లలో కొద్దిరోజులు నీటికి బదులు సోడాలు, మిల్క్‌షేక్‌లు తాగేవాడు. అయితే, ఆ పరిస్థితిని కూడా పీటర్ త్వరగానే అధిగమించాడు. నీరే కాదు, ఎలాంటి ద్రవాలైనా తాగకుండా కేవలం కూరగాయలు, పండ్లు మాత్రమే తీసుకోవడం ప్రారంభించాడు. ఆరోగ్యంలో ఎలాంటిమార్పు రాకపోవడంతో, ఇప్పటికీ అలాగే కంటిన్యూ అయిపోతున్నాడు.

### నీరు తాగితే అనారోగ్యం!

శరీరంలోని మలినాలు బయటికి పోవాలంటే నీరు ఎంతో అవసరం. కానీ నీరు తాగితేనే అనారోగ్య సమస్యలు వచ్చే అవకాశం ఉందని వాదిస్తున్నాడు పీటర్. నీరు తాగకుండా ఉంటే నిక్షేపంలా బతకొచ్చని, నీటిని శుద్ధి చేసేందుకు ఉపయోగించే అనవసర రసాయనాలన్నీ రోజూ నీటిని తాగడం వల్ల అవి శరీరంలోకి చేరి అనారోగ్యానికి కారణం అవుతాయనేది పీటర్ వాదన. ఈ వాదననే ఇతగాడు తన వెబ్‌సైట్ ద్వారా బలంగా వినిపిస్తున్నాడు.

### 150 ఏళ్ళు బతకడం కోసమే...!

చిన్నప్పటి నుంచి ఆరోగ్యంపట్ల పీటర్‌కి శ్రద్ధ ఎక్కువే. ఆరోగ్యంగా జీవించాలనే ఆలోచనతో బడికి వెళ్లే వయసులోనే శాకాహారిగా మారాలనుకున్నాడు. ఇదే విషయం తల్లిదండ్రులకు చెబితే, వారు తొలుత అతనికి ఏమైనా అవుతుందేమోనని ఆందోళన చెందారు. అయినప్పటికీ పూర్తి శాకాహారం తీసుకుంటున్నా పీటర్ ఆరోగ్యంగా ఉండటంతో, కొన్నాళ్లకు అతడి తల్లిదండ్రులు సైతం పూర్తి శాకాహారులుగా మారిపోయారు. ఇంతకీ నీరు తాగడం మానేయాలనే కోరిక ఎందుకు కలిగిందని ఎవరైనా ప్రశ్నిస్తే, తాను 150 ఏళ్లు పూర్తి ఆరోగ్యంతో జీవించాలనుకుంటున్నానని, అందుకే నీరు తాగడం మానేశానని బదులిస్తాడు పీటర్.

– సంతోషలక్ష్మి దహాగాం

## బీరు లేనిదే పొద్దు గడవదు

లండన్‌కు చెందిన గ్లాడీస్ ఫీల్డన్ అనే ముసలమ్మకి బీరులేనిదే పొద్దు గడవదు. ఈమధ్యే లండన్‌లో తన శతజయంతి ఉత్సవాలను ఘనంగా నిర్వహించుకుంది. 'తన వందేళ్ల జీవనయానానికి కారణం బీరే' అంటోంది ఆ బామ్మ.




ఆమెకు బీరే బ్రేక్‌ఫాస్ట్. బీరుతోనే తన దినచర్య మొదలవుతుందట. ప్రతిరోజు ఉదయం 10.30 గంటలకు బీరులో కొంత వెనిగర్, ఉప్పు కలిపి తాగుతుంది. 70 సంవత్సరాల నుంచి ఇదే పద్ధతి ఆమె పాటిస్తోంది. ఇక ఆమె తాగే బీరు పేరు కూడా విచిత్రమే. ఈమె తాగే బీరును 'గిన్నీస్' అనే కంపెనీ తయారుచేస్తోంది. ఇన్ని సంవత్సరాల నుంచి 'గిన్నీస్' బీరు తప్ప ఇంకో బ్రాండ్ ముట్టుకోలేదట. ఇంకో ఆశ్చర్యకర విషయమేమిటంటే 90 ఏళ్లు వచ్చేదాకా గ్లాడీస్ ఓ బేకరీలో పనిచేసింది. ఇలా రోజు నేను గిన్నీస్ బీరు తాగుతానని ఈ బామ్మ ప్రకటించేసరికి, ఇది తమకు ఉచిత ప్రచారమేనని సంతోషపడ్డ 'గిన్నీస్' బీరు కంపెనీ, ఆమెకు ఓ కేసు బీర్లను ఉచితంగా అందించింది.

ఎప్పుడో 70 ఏళ్ల కిందట గర్భవతిగా ఉన్నప్పుడు ఆరోగ్యమని ఎవరో చెబితేనే గ్లాడీస్ బీరు రుచి చూసిందట. అప్పటి నుంచి బీరు లేనిదే పొద్దు గడవట్లేదని అంటోంది ఈ బామ్మ.

# అన్నపూర్ణ

## -మణి వడ్లమాని

**సర్వపాపాలను ప్రక్షాళన చేసే దేవతాస్వరూపిణి, నిరంతర ప్రవాహ తరంగిణి గంగ. ఆ పవిత్ర గంగ ఒడ్డున కూర్చుని, సాయంకాలవేళ జరిగే నిత్యహారతిని చూడటానికి వచ్చే మహా జనసందోహంతో ఉజ్వలమైన దీపహారతుల వెలుగులు, గంగలో తళుక్కుమని మెరుస్తుంటే ఆ దృశ్యం చూడటం ఒక అద్భుతమైన అనుభవం. ఘంటానాదంతో శంఖం పూరిస్తూ, శ్లోకాలు పఠిస్తూ లయబద్ధంగా పూజారులు హారతి ఇస్తూ ఉంటే అవి అందుకుంటూ శివపార్వతులు అక్కడ ఆనందతాండవం చేస్తున్నట్లనిపిస్తుంది.**

కాని ఈ అలౌకికమైన ఆనందాన్ని ఘాట్ మెట్ల మీద కూర్చుని ఉన్న అన్నపూర్ణ మాత్రం పూర్తిగా అనుభవించటంలేదు. ఆమె కళ్ళు, మనసు దేని కోసమో అన్వేషిస్తూ ఉన్నాయి. ఇలా ప్రతిరోజూ జరుగుతుంది. ఘాట్‌కి వస్తుంది, హారతి అయ్యే వరకు ఉండి వెళ్ళిపోతుంది. కానీ ఆమె వచ్చేది పూర్తిగా హారతి చూడటంకోసం మాత్రం కాదు. "అన్నపూర్ణగారు రండి రండి రండి, అప్పుడే రాత్రి తొమ్మిది అయింది" అని చెప్పి హెచ్చరించాడు ఆశ్రమంలో తనతోపాటు ఉండే రమణ అనే కుర్రాడు. అతను కూడా ఈమెలాగే బతుకుతెరువు కోసం తెలుగురాష్ట్రం వదిలి కాశీకి వచ్చాడు."ఆ వస్తున్నా! పద పద" అంటూ లేచింది. "మీరు ఎందుకండీ రోజూ వస్తారు హారతి చూడటానికి, మీకు విసుగు అనిపించదా ఈ జనం, ఈ హడావిడి" అన్నాడు రమణ. "లేదు రమణా, ఎన్నిసార్లు చూసినా తనివి తీరదు" (మనసులో మాత్రం అతను కనిపించేవరకు రాక తప్పదు అనుకుంది) అంటూ ఆ విశ్వనాథుడికి, గంగమ్మతల్లికి నమస్కారం చేసుకుంది. ఆ ఇరుకు సందులుగుండా, గోమయం తొక్కకుండా జాగ్రత్తగా అడుగులువేస్తూ ఆశ్రమందారి పట్టారు ఇద్దరూ. ఆశ్రమానికి చేరుకున్నాక, వంటశాలలోకి వెళ్ళి, ఫలహారం కానిచ్చుకుని మరుసటిరోజు భోజనసదుపాయం ఎంతమందికి చెయ్యాలో లెక్క చూసుకుని దానిప్రకారం అన్నీ ఏర్పాటు చేసుకుంది. ఉదయమే త్వరగా లేవాలి అనుకుంటూ నిద్రకుపక్రమించింది. విజయవాడకు చెందిన అగ్నిహోత్ర శర్మగారి కుటుంబం మూడుతరాలనుంచి కాశీలోనే స్థిరపడింది. ఆయన పోయాక ఆశ్రమం వారి పేరు మీదే నడుస్తోంది. ఇప్పుడున్నవాళ్ళు మూడోతరం. ఇద్దరు అన్నదమ్ములు, ఒక చెల్లెలు. మొత్తం అందరూ కలిసే ఉంటారు. పూజలు, పితృకార్యక్రమాలు మగవారివంతు. వంటలు చేయడం, నిత్య పూజలు చేయడం ఆడవారివంతు. పెద్దకోడలి అనారోగ్య కారణంవల్ల మిగిలిన ఇద్దరితో పని కష్టం అవటంచేత, దూరపుబంధువైన అన్నపూర్ణని రప్పించారు. అప్పటినుండి మిగతావాళ్ళకి చాలా వెసులుబాటు దొరికింది. విసుగులేకుండా పని అంతా చేస్తుంది. వయసు ఇరవైఎనిమిది, ముప్పై మధ్య ఉండొచ్చు. గుండ్రటి మొహం, పెద్దకళ్ళు, ఎప్పుడూ నవ్వుతూ కళకళలాడే రూపం. ఆప్యాయంగా భోజనం పెట్టడంలో నిజంగా ఆమె కాశీఅన్నపూర్ణే. రోజూ పొద్దునే ఆమె గొంతెత్తి "నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ.." అంటూ అన్నపూర్ణాష్టకం మధురమైన కంఠస్వరంతో చదువుతుంటే ఆశ్రమంలో ఉండేవాళ్ళు మంత్రముగ్ధులై వింటారు. వీళ్ళ దగ్గరకు తరచూ వచ్చే వాళ్ళలో ఒకడు విశ్వనాథ టూర్స్ అండ్ ట్రావెల్స్ నడిపించే రాఘవ. కృష్ణశర్మకి, రాఘవకి విజయవాడలో పరిచయం అయింది. అప్పటినుంచి రాఘవ తన టూర్ ద్వారా వచ్చేవాళ్ళని ఈ ఆశ్రమానికే తీసుకొస్తున్నాడు. ఇక్కడ దొరికే భోజన, వసతి సదుపాయాలు, చేయించే పూజా కార్యక్రమాలు కూడా పద్ధతిగా ఉండటంతో అక్కడే ఉండేందుకు అందరూ ఇష్టపడతారు. అందుకే ఏడాదిలో మూడుసార్లు తప్పకుండా టూర్ వేస్తాడు. రాఘవది విజయవాడే. ఒక ప్రభుత్వపాఠశాలలో సోషల్ టీచర్‌గా పనిచేస్తూ ఉండేవాడు. మూడేళ్ళ క్రితం అతని భార్య కేన్సర్‌వ్యాధితో కాలం చేసింది. అప్పటినుంచి అతను ఒంటరిగానే ఉంటున్నాడు. మానసిక శాంతికోసం చేస్తున్న ఉద్యోగం స్వచ్ఛందంగా మానేసి, సహజంగా ప్రయాణాలంటే ఉండే ఆసక్తివల్ల ఈ యాత్రలు నిర్వహించే పని కల్పించుకున్నాడు. రెండోపెళ్ళి చేసుకోమని అప్పటికే అతనికి చాలామంది సలహా ఇచ్చారు. పైగా మొదటిభార్య వల్ల అతనికి సంతానం కూడా లేకపోవడం ఒక ముఖ్యకారణం. అయితే రెండవది అతను నడివయసులో ఉండటం మూలంగా తెలిసినవాళ్ళు సంబంధాలు చెప్పసాగారు. కాని అతనికి వెంటనే పెళ్ళి చేసుకోవాలనే దృష్టి ఎంతమాత్రం కలగలేదు. అసలా ఉద్దేశం కూడా లేదని స్పష్టంగా చెప్పాడు. కానీ మనసు ఉందే అప్పుడప్పుడు చిత్రవిచిత్రంగా గమ్మత్తులు చేస్తుంది. అలాంటిదే ఒక సంగతి జరిగింది. కృష్ణశర్మతో ఉండే పరిచయంతో యాత్రకువచ్చిన ప్రతిసారీ అన్నపూర్ణను కలుసుకునేవాడు. తన పనులు తాను చేసుకుపోయే అన్నపూర్ణని చూస్తే రాఘవకు తెలియని అభిమానం, ఆత్మీయత కలిగింది. పదేపదే ఆమెని చూడాలనిపించేది. ఆమె ఒంటరిదని తెలిసింది. తనలాగే ఆమె కూడా జీవితంలో ఎదురుదెబ్బలు తిన్న మనిషికాబట్టి జీవితం విలువ తెలుస్తుంది. ఒకరినొకరు అర్థంచేసుకునే గ్రహింపు ఉంటుంది. ఎప్పటికైనా ఒక తోడు కావాలి, ఆ తోడు అన్నపూర్ణ అయితే ఇంకా బాగుంటుంది అనుకున్నాడు. వెంటనే యాత్ర మిష పెట్టుకుని తక్కువమంది యాత్రికులతో కాశీ ప్రయాణమయ్యాడు అన్నపూర్ణతో ముఖాముఖి మాట్లాడటానికి. రెండురోజులు గడిచాయి. ముఖ్యమైన ప్రదేశాలు, విశ్వనాథుని గుడి, అలహాబాదు, గయ అన్నీ యాత్రికులకు చూపించడం పూర్తయింది. ఇక మిగిలింది కాశీ పట్టణం. ఆరోజు శర్మగారి తాలూకు వాళ్ళందరూ విశాలాక్షి అమ్మవారి ఆలయంలో పూజలు చేయడానికి వెళుతూ ఆ రోజు బాధ్యత అంతా అన్నపూర్ణకి అప్పజెప్పారు. ముందురోజునుంచే రాఘవకి విపరీతమైన జ్వరం రావడం, అది కాస్తా పొద్దునకి మరీ ఎక్కువైపోవడంతో కృష్ణశాస్త్రిగారు ఆశ్రమ బాధ్యతతోపాటు రాఘవని కాస్త మధ్యలో చూస్తూ ఉండమనికూడా చెప్పారు. రాఘవతో వచ్చిన యాత్రికులకు బయట అన్నీ చూపించే పని ఆశ్రమ ఉద్యోగి రమణకు

> **పవిత్ర గంగానది ఒడ్డున కూర్చుని నిత్యహారతి చూడటం ఆమెకొక అద్భుత అనుభవం. అందుకే ఆమె రోజూ ఆ సమయానికి అక్కడికొస్తుంది. నిత్యహారతి వైభవం వీక్షిస్తుంది. ఆమె కళ్ళు ఇంకా దేనికోసమో, ఎవరికోసమో వెదకులాడుతూ ఉంటాయి. ఆ రోజు అతడుకూడా ఆమెకోసమే కాచుకుని ఉన్నాడు. ఆమెతో ఏదో చెప్పాలని అతడి తపన. ఇంతకూ ఆమె వెదకులాట దేనికి? అతడు చెప్పాలనుకుంటున్నదేమిటి?**

అప్పజెప్పారు. అందరూ ఉదయమే వెళ్ళిపోయారు. రాఘవకి ఎలా ఉందో చూద్దామని వెళ్ళింది అన్నపూర్ణ. ఎన్నిసార్లు పిలిచినా పలకక పోవటంతో దగ్గరగా వెళ్ళి చూసింది. జ్వరంతో ఒళ్ళు కాలిపోతోంది. పని కుర్రాడిని పిలిచి తెలిసిన డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళమని చెప్పింది. అతను చూపించి తీసుకువచ్చాడు. మందులు తెప్పించి వేసింది. మధ్యాహ్నానికి కాస్త తగ్గింది. అప్పుడు అతనికి భోజనం తీసుకుని వెళ్ళింది. రాఘవ మొహమాటపడుతూనే, "నాకు అసలు ఎప్పుడూ జ్వరం రాదండీ, అలాంటిది

ఏమిటో ఇక్కడకు వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టేస్తున్నాను" అన్నాడు అన్నపూర్ణతో. "మీరు చెప్పేది భలేగా ఉంది రాఘవగారు. అన్నీ చెప్పి వస్తాయా! ఏమీ పర్వాలేదు, మీరు అస్సలు మొహమాటపడకండి" అని వెళ్ళిపోయింది. ఆ రోజున ఆశ్రమ నిర్వాహకులు ఇంకెవరూ లేకపోవటంతో హారతి చూడటానికి వెళ్ళలేకపోయింది అన్నపూర్ణ. రాఘవతో పాటు వచ్చినవాళ్ళు దగ్గర్నుంచి హారతి చూడాలని మూడుగంటలకే ఘాట్‌కి బయలుదేరారు. రమణే వాళ్ళని తీసుకెళ్ళాడు. రాఘవను అన్నపూర్ణ దగ్గరుండి చూసుకుంది. దాంతో, "మీకు చాలా రుణపడిపోయాను పూర్ణగారు" అన్నాడు రాఘవ. "అయితే తప్పకుండా నా రుణం తీర్చుకుని వెళ్ళండి" అని నవ్వుకుంటూ వెళ్ళిపోయింది అన్నపూర్ణ. ఎందుకో ఆ క్షణంలో ఎలా అయినా మనసులోని మాట చెప్పేయాలని అన్నపూర్ణ కోసం ఎదురు చూశాడు. ఆమె పైన ఉంది. చిరుచీకట్లు ముసురుకున్నాయి. ఆశ్రమం రెండో అంతస్తులోని బాల్కనీ నుండి దూరంగా ఘాట్ కనిపిస్తోంది. విద్యుత్ దీపాలకాంతి నీళ్ళలో పడటంతో, ఆకాశంలో ఉండే తారలు నీళ్ళలో దిగి జలకాలాడుతున్నట్లుగా మెరిసిపోతున్నాయి. బాల్కనీలో కుర్చీ వేసుకుని అటే చూస్తున్న అన్నపూర్ణతో అన్నాడు రాఘవ, "సారీ మీరు నా మూలంగా ఇవాళ హారతి చూడలేకపోయారు" అని. "అయ్యో ఏం పర్వాలేదు. ఒక్కరోజు వెళ్ళకపోతే ఏమి కాదు. అదొక అలవాటు అంతే" అంది. కానీ ఆమె చూపులుమాత్రం ఘాట్‌వైపే ఉన్నాయి. "పూర్ణా! కాస్త మీతో నా పర్సనల్ విషయం ఒకటి చెప్పాలనుకుంటున్నాను. మీకు నా వివరాలు బహుశా కృష్ణశర్మ చెప్పే ఉంటాడు. వసంత పోయిన తరువాత నుంచి మనశ్శాంతి వెతుక్కుంటూ ఈ యాత్రలు చేస్తున్నాను. ఎందుకో నేను కోరుకున్న శాంతి మీ సమక్షంలో దొరికింది. ఇప్పుడు నేను చెప్పబోయేది కనుక మీకు నచ్చకపోతే నన్ను క్షమించండి. ఇక మళ్ళీ ఎన్నటికీ ఆ ప్రస్తావన తీసుకురాను" అన్నాడు. రాఘవ మాటలకి ఆశ్చర్యపోతూ అతనివైపు తిరిగి "చెప్పండి" అంది ప్రశ్నార్థకంగా.

"అదే నేను, మిమ్మల్ని" అంటూ తడబడ్డాడు. "పెళ్ళి చేసుకోవాలి అనుకుంటున్నాను. మీ అభిప్రాయం చెప్పండి" అని గబుక్కున అనేశాడు. ఆమె ఒక్క నిమిషం మౌనంగా ఉండిపోయింది. అదిచూసిన రాఘవలో పశ్చాత్తాపం మొదలైంది. అనవసరంగా తొందరపడ్డానా? ఛీ ఛీ ఆమె ఏమనుకుంటుంది? కృష్ణశర్మగారికి ఎలా మొహం చూపించాలి.

అయ్యో నా బుద్ధి, వివేకం ఏమయ్యాయి అని తనని తనే తిట్టుకుంటున్నాడు. అంతలో అన్నపూర్ణ కొద్దిగా తేరుకుని "రాఘవగారు మనది సుమారు రెండేళ్ళ పరిచయం. మీ గురించి కృష్ణశర్మగారు ఎప్పుడూ చెబుతూ ఉంటారు. అలాగే నా వివరాలు కూడా చెప్పి ఉంటారే" అంది. "అవును చెప్పారు మీకు పెళ్ళయింది కానీ మీ భర్త సాధువులతో కలిసి ఎక్కడికో వెళ్ళిపోయారనీ, మీరు ఒంటరిగా ఉన్నారనీ చెప్పారు. మీకు అభ్యంతరం లేకపోతే మీ గురించి వివరంగా చెప్పండి" అడిగాడు రాఘవ.

"మీరు అడిగిన దానికి జవాబు కూడా ఇవ్వాలికదా, తప్పకుండా చెబుతాను వినండి" అంటూ పూర్ణ చెప్పడం మొదలుపెట్టింది.

***

"మాది చాలా పేద కుటుంబం. మేము నలుగురు సంతానం. అందరం ఆడపిల్లలమే. ఏదో భుక్తికోసం నాన్న చావు మంత్రాలు చెబుతూ, అమ్మ వాళ్ళ ఇళ్ళల్లో వీళ్ళ ఇళ్ళల్లో వంటలు వండుతూ సంసారం వెళ్ళబుచ్చేవారు. అందరి కంటే నేను పెద్దదాన్ని. చదువంటే... ఏదో అక్షరం



ముక్క నేర్చుకున్నాను. పెళ్ళీవయసు వచ్చింది. కాని పెళ్ళి ఎలా చేస్తారు? ఏం పెట్టి చేయగలరు? వచ్చే సంపాదనతో అందరికీ నాలుగువేళ్ళు నోట్లోకి వెళ్ళడమే గగనమైపోతోంది. ఆ సమయంలో రాజ మండ్రిలో ఉండే మా మేనత్త, వాళ్ళ అబ్బాయికి నన్ను అడగటానికి వచ్చింది. వాళ్ళకి ఒక్కడే కొడుకు. కానీ అమాయకుడు. వయసు వచ్చినా మానసిక పరిపక్వత లేదు. నా జీవితం గురించి ఆలోచించ లేదు. ఇక్కడినుంచి నేను వెళితే ఒక మనిషి బరువు తగ్గుతుంది. నాకు కడుపునిండా తిండి దొరుకు తుంది. అని మాత్రం ఆలోచించి సరే అన్నాను. బావతో నా పెళ్ళి జరిగింది. కాపురానికి వెళ్ళిపోయాను. గమ్మత్తు ఏంటంటే బావకి నేను భార్యని కాలేక పోయాను కానీ అతనికి మరో తల్లినయ్యాను. ఎప్పుడో ఒక స్వామీజీ "కాశీ" గురించి చెప్పాడట. అప్పటినుంచి కాశీకి పోతానని బావ ఒకటే గొడవ. నన్ను కూడా అడిగాడు తీసుకెళ్ళమని. అలాగే వెళదాం అన్నాను. కాని ఇంతలోనే ఒకరోజు గోదా వరి గట్టున ఉండే పెద్దగుడికి కాశీ నుండి ఎవరో స్వామీజీ వచ్చారని బావకి తెలిసింది. అంతే, ఇంట్లోంచి చెప్పకుండా వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళిన వాడు మళ్ళీ తిరిగిరాలేదు. పోలీసు రిపోర్టు కూడా ఇచ్చాను. ఏమీ లాభం లేకపోయింది. ఈ సంఘ టనతో మావయ్య మంచాన పడ్డారు. అత్తయ్యకి షుగర్ కంప్లయింట్ ఉంది. దానితో కంటిచూపు దెబ్బతింది. నీకు అన్యాయం చేశాం పూర్ణా అని అత్తయ్య, మావయ్య కూడా రోజుకొకసారైనా ఏడ్చే వారు. ఈ కష్టసమయంలో నేను వాళ్ళని వదిలి ఎక్కడికీ వెళ్ళలేకపోయాను. అప్పుడు అనుకున్నాను, 'దేవుడు నా జీవితానికే పరీక్ష పెట్టాడు. దీన్ని ఎదు ర్కోవటంతప్ప వేరే మార్గం లేదు. ఎవరో వచ్చి ఆదుకునే సమస్య కాదు నాది అని నాకు నేను ధైర్యం తెచ్చుకున్నాను. బావకోసం వెతుకుతూనే ఉన్నాను. ఆ స్వామీజీ బృందంతో కలిసి బావ కాశీ వెళ్ళిపోయి ఉంటాడని నాకు అనిపించేది. మాకు తెలిసిన వాళ్ళద్వారా అక్కడ కూడా వెతికించమని చెప్పాను. ఇదంతా జరిగి నాలుగేళ్ళు అయింది. అత్తామామలు పండుటాకులయ్యారు. ఏ క్షణ మైనా రాలిపోవచ్చు. ఇలాంటి సమయంలో ఎవరో చెప్పారు, కాశీలో గంగాహారతి ఇచ్చే ప్రధానఘాట్ దగ్గర బావ కూర్చొని ఉండగా చూశామని చెప్పారు. అప్పుడు అత్తయ్య అంది, "మాకు దూరపు బంధువు అగ్నిహోత్రశర్మ కుటుంబం ఆశ్రమం నడి పిస్తూ ఎప్పటినుండో కాశీలోనే స్థిరపడిపోయింది. మనమూ అక్కడికే వెళ్ళి వాడిని వెదుకుదాం. వాడు కనిపించాడా సరే, ఒకవేళ కనిపించకపోతే, నేను కాశీలోనే పోతాను. అంతకంటే మహద్భాగ్యం ఇంకేముంది" అంది. తీరా మేము బయలుదేరే సమయానికి అత్తయ్యకు బాగా సీరియస్ అయింది. "వాడు అమాయకుడే, నువ్వే వాడిని చూసుకోవాలి" అంది. ఆ తల్లి ప్రాణం కొట్టుకులాడుతూ, బావ మీద బెంగతోనే కన్ను మూసింది. "కాశీకి వెళ్ళాలని దాని కోరిక, వాడు అక్కడే ఎక్కడో ఉన్నాడన్న నమ్మకం నాకూ ఉంది. పదమ్మా మనం కాశీకి వెళ్ళి పోదాం" అన్నాడు మావయ్య ఏడుస్తూ. అప్పుడు ఈ కృష్ణశర్మగారే మమ్మల్ని ఆదుకున్నారు. మమ్మల్ని కాశీ వచ్చేయమన్నారు. ఇక్కడికి వచ్చాక కొన్ని రోజులు మావయ్య బానే ఉన్నారు. కాని తరువాత అత్తయ్య పోయిందన్న దిగులు, బావ కనిపించక పోవడం, నా జీవితం ఇలా కావడానికి తనే కారణం అనుకుంటూ కుంగిపోసాగారు. ఆ దేవుడు నన్ను తొందరగా తీసుకుపోతే నువ్వు విముక్తమవు తావు అనేవారు రోజూ. నేను ఎంత సముదాయిం చినా లాభం లేకపోయింది. ఇంక పాపం కొడుకు మీద బెంగతోనే ప్రాణాలు విడిచారు. వాళ్ళు లేక పోవచ్చు, కానీ వాళ్ళ కన్నబిడ్డ, నా భర్త ఇక్కడే కాశీలోనే ఉన్నాడు. అతన్ని వెతకాలి. వాళ్ళ ఆఖరి కోరిక తీర్చాలనే పట్టుదలతో ఇక్కడే ఉంటున్నాను. "పెద్దవాళ్ళు ఎలాగూ పోయారు. నీ మొగుడా అమాయకుడు. కనిపించే జాడలేదు. ఎందుకు నీ జీవితం పాడు చేసుకుంటావు, ఎవరినైనా పెళ్ళి చేసుకో" అని చాలామంది ఉచిత సలహాలు ఇచ్చారు. నాకు లేని దిగులు వాళ్ళకెందుకో. అప్పుడే నేను గట్టిగా చెప్పేశాను, "అతను నా బాధ్యత అని". 'నీ పుట్టింటికి వెళ్ళకపోయావా?' అన్నారు కొంత మంది. వాళ్ళవి అసలే అంతంతమాత్రం బతుకులు, వీళ్లైతే వాళ్ళ బరువు బాధ్యతలు నేను మోయాలి తప్ప వాళ్ళకి నేను భారం కాకూడదు. ఇదీ నా జీవితం. అనుకోకుండా ఇలా రెండు మహాపుణ్య నదుల మధ్య నా జీవితం గడచిపోతోంది. ముందు ముందు ఈ జీవన ప్రవాహం ఎటు సాగుతుందో తెలియదు. రాఘవగారూ, ఒక్కమాట! మీరు చెప్పింది నాకు అర్థమైంది. మన్నించండి, నేను పెళ్ళికి సిద్ధంగా లేను. ఒక బాధ్యతకు కట్టుబడి ఉన్నాను. ఇక్కడ నన్ను అందరూ ఆకలి తీర్చే అమ్మలాగే చూస్తారు. నా జీవితం ఇలా సార్థకత చెందాలని ఆ దేవుడు నా నుదుటన రాశాడని నమ్ముతున్నాను" అని ముగించింది. ఇంతలో అక్కడ ఘాట్‌లో దూరంగా హారతి మొదలైంది. శంఖనాదం వినిపిం చింది. దూరంగా వెలుగు కనిపిస్తోంది. ఇద్దరూ అటువైపు చూసి రెండుచేతులూ జోడించారు. అన్న పూర్ణ యథావిధిగా మెట్లుదిగి కింద భోజనశాల లోకి వెళ్ళింది. వయసులో చిన్నదైనా ఆమె మోసే బాధ్యత మాత్రం కొండంత. ఆత్మవిశ్వాసంతో జీవనం సాగిస్తున్న అన్నపూర్ణ సాక్షాత్తూ కాశీ అన్నపూర్ణే. ఎవరినైనా ఆదరించి పట్టెడన్నం పెట్టడమే తన బాధ్యత అన్నట్లుగా ఉండే ఆ కాశీ అన్నపూర్ణాదేవికి అప్రయత్నంగా రెండు చేతులు జోడించాడు రాఘవ.

సెల్: 096520 67891

## పచ్చబొట్టు




ఏ స్వప్నం లేని
నా తొలి యవ్వన సీతాకోక చిలుక
కంటి చూపుల ముందు వాలిన ఆ వెన్నెల పువ్వు
ఎక్కడుందో
నేత్ర ద్వయంతో జయించింది
ఓ వారం రోజులు ఖోఖో ఆటస్థలంలో పరి
మళించి
పొద్దు పిలుపై వెళ్ళిపోయింది ఎటో



ఏ ఒయాసిస్సు లేని
నా దహన దేహపు ఎడారి ఓడ
పాద ముద్రల ముందు రాలిన ఆ మెరుపుల మేఘం
ఎక్కడుందో
కంఠ స్వరంతో జయించింది
ఓ రెండేళ్ళు విశ్వవిద్యాలయ ప్రాంగణంలో
చిటపటమని
గాలివాటై తేలిపోయింది ఎటో-

ఏ తీరమూ దరీలేని
నా బతుకు నమ్మకపు వలసపిట్ట
పరాయి పంచముందు ఎగిరిన ఆ మిణుగురు
బూచి ఎక్కడుందో
మైత్రీభావంతో జయించింది
ఓ ఆర్నెల్లు రాజమహేంద్రవరంలో ప్రవహించి
తోక చుక్కై
మాయమయ్యింది ఎటో

వాళ్ళు
నా జ్ఞాపకంలో పుట్టుమచ్చలు
ఇప్పుడు
ఆ వెన్నెల పువ్వూ ఆమే
ఆ మెరుపుల మేఘమూ ఆమే
ఆ మిణుగురు బూచీ ఆమే

ఆమె నా హృదయంలో పచ్చబొట్టు

—రవి నన్నపనేని
సెల్: 99636 71531

## సైనసైటిస్‌కు హోమియో చికిత్స

సైనసైటిస్...ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం.సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుంటుందని సైనసైటిస్ బాధితులు చెబుతుంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొందవచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్క అమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

**1. అక్యూట్ :** వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

**2. సబ్ అక్యూట్ :** 4నుంచి 8వారాలు ఉంటుంది.

**3. క్రానిక్ :** ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్‌ఫ్లూయెన్‌జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదెలా ఉన్నా, సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్లీ రాకుండా నివారించవచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫీనాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి.

**కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశవ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షాకాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం.

**లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి, ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర. దగ్గు,జలుబు. చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు.

**నిర్ధారణ:** ఎక్స్‌రే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**దుష్పరిణామాలు:** దీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియకపోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదలలోపాలు కలుగుతాయి.

**సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధపడుతున్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్లే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

1. ముఖభాగంలో నొప్పి - అవును / కాదు

2. తలనొప్పి - అవును / కాదు

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



3. ముక్కుదిబ్బడ - అవును/కాదు 4. చిక్కటి పసుపు, ఆకుపచ్చ ముక్కుస్రావాలు - అవును/కాదు. 5.జ్వరం (99-100 ఫారెన్‌హీట్స్) - అవును/కాదు. 6. నోటి దుర్వాసన - అవును / కాదు.. 7. పంటినొప్పి - అవును /కాదు.

**నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని చుట్టూ బురధ లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండకూడదు. ఎందుకంటే ఆనీళ్లు ముక్కు లోపలి దళసరిచర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్న్యూలియా, లెమ్‌నార్‌మైనార్, స్పైజీలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.

**www.starhomeopathy.com** తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ **✆ 90300 64224**

## సంతానలేమికి ఆధునిక పరిష్కారాలు

**మన దేశంలో ఎంతోమంది దంపతులు సంతానలేమితో బాధపడుతున్నారు. అందుకు పాశ్చాత్య సంస్కృతిలాగా రాత్రి పగలూ తేడా లేకుండా వృత్తిపనుల్లో బిజీగాఉండటం, సరైన వయసులో పెళ్లిళ్లు కాకపోవడం, మానసిక ఒత్తిడికి లోను కావడం వంటివి హార్మోన్ సంబంధమైన సమస్యల్ని సృష్టిస్తున్నాయి. అయితే ఇదిపరిష్కారం లేని సమస్యలేమి కాదని, సరైన చికిత్స తీసుకుంటే లైంగిక సమస్యలు పరిష్కారం కావడమే కాక, సంతానం కలగడానికి కూడా అవకాశం ఉంటుందనిప్రముఖ వైద్యు రాలు డా॥జ్యోతి. ఫర్టీ 9 హాస్పిటల్‌లోని నిపుణులు దీన్నితేలికగాపరిష్కరిస్తున్నారని కూడా ఆమె చెబుతున్నారు.**

చాలామంది స్త్రీలలో నెలసరి సమస్యలున్నా, భర్తకన్నా భార్య వయసు ఎక్కువగాఉన్నా, భార్యాభర్తలిద్దరూ సంతాన నిరోధక పద్ధతులేవీ పాటించకుండా సంవత్సరంకాలం పాటు ప్రయత్నించినాగర్భధారణకాకపోవచ్చు.మరికొంత మందిలోసంవత్సర కాలందాటినా అంటే, ఏళ్ళు గడుస్తున్నా గర్భధారణ కాకపోవచ్చు. **స్త్రీలు మాత్రమే బాధ్యులా?:** సంతానలేమితో బాధపడుతు న్నారంటే స్త్రీలలోనేలోపం ఉండవచ్చనే అపోహ చాలా మందిలో ఉంటుంది. కానీ సంతానలేమికి అసలుకారణం స్త్రీపురుషులిద్దరూ కావచ్చు. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికీ లోపం ఉన్నా గర్భధారణ కలుగకపోవచ్చు. పురుషులలో వీర్యకణాల ఉత్పత్తిలో లోపం ఉన్నా సంతానలేమికి దారి తీయవచ్చు. అదే స్త్రీలలో అయితే హార్మోను లోపం, థైరాయిడ్, పి.సి.ఒ.డి... ఇలా కొన్నిరకాల కారణాలుండవచ్చు. సాధారణంగా దంపతు లిద్దరూ ఏ విధమైన గర్భనిరోధక విధానాలూ పాటించ కుండా దాంపత్య జీవితం గడిపితే 5నెలల లోపే 50% మందికి గర్భం వస్తుంది. ఏడాది లోపు 75% మందికి గర్భం వస్తుంది. 2 సంవత్సరాల లోపు 90% మందికి గర్భం వస్తుంది. ఎవరికైనా ఇంతకాలం గడిచినా గర్భం రాలేదంటే ఏదో సమస్య ఉందనే భావించాలి. సమస్యను తెలుసుకోవాలని స్త్రీలుముందుకొచ్చి వైద్యపరీక్షలు చేయిం చుకుంటున్నా, పురుషులు మాత్రం అందుకు సిద్ధంగా ఉండటం చాలాతక్కువ. **ఆకృతి కోల్పోయినా...** మన జీవన శైలితో పాటు కాలుష్యం, వాతావరణం, పొగతాగటం, మద్యం సేవించటం, బిగుతు దుస్తులు ధరించటం, అధిక బరువులు మోయటం, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపడం వల్ల పురుషులలో శుక్రకణాల సంఖ్య తగినంత లేకపోవడం, ఒకవేళ ఉన్నా వాటిలో చురుకుదనం లేక పోవటం జరుగుతోంది. వాటి ఆకృతి బాగా లేకపోయినా కష్టమే. కొందరిలో శుక్రకణాలు అసలు ఉండవు. స్త్రీలలో నెలసరి సమస్యలు, అండం విడుదల సరిగా లేకపోవటం లేదా విడుదలైన అండాలు నాణ్యంగా లేకపోవటం ప్రధాన కారణాలు. వయసు పెరిగే కొద్దీ గర్భస్రావాలయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. 30 సంవత్సరాలు దాటిన స్త్రీలలో సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. **సరైన పద్ధతులు:** 1. ఐ.యు.ఐ, 2.ఇక్సీ 3.ఐ.వి.ఎఫ్. **ఐ.యు.ఐ:** భర్త నుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి దానిలోంచి ఆరోగ్యంగా, చురుగ్గా ఉన్న కణాలను మాత్రం వేరుచేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టంద్వారా స్త్రీగర్భాశయంలోకి ప్రవేశపెడ తారు. ఇలా ఒక నెలలో చేస్తే 15 % వరకు సంతానం కలిగే అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితం లేకపోతే అప్పుడు ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించవచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుంచి సేకరించిన అండంలోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మాన్యులేటర్ సహాయంతో ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశ పెడతారు. ఈ పద్ధతి ద్వారా 40% వరకు విజయం సాధించవచ్చు. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఇదిమరింత ఉపయోగకరం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ బేబి విధానం అంటారు. ముందు స్త్రీ నుంచి పక్వమైన అండాలను బయటకు తీసి పురుషుడి శుక్రకణాలతోబయటేఫలదీకరణంచెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండులేదా మూడింటి ని తిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. దీని ద్వారా 30-35 శాతం ఫలితం పొందవచ్చు. ఇటీవల కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటులోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన పిండాలను అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటినే వాడటం జరుగుతుంది. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్ర కణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం జరుగుతుంది. వీటితోపాటు పిండాన్ని మరో స్త్రీగర్భాశయం లో పెంచే ఒక వినూత్నమైన 'సరోగసి' విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగటం లేదని ఏళ్ళ తరబడి బాధపడే కన్నా, ఎన్నో ఆధునిక పద్ధతులున్నా '**ఫర్టీ 9 హాస్పిటల్**' ని ఆశ్రయించటం ఎంతో శ్రేయస్కరం.

**- డా॥ సి.జ్యోతి** ఫర్టిలిటీ స్పెషలిస్ట్
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**

ADVT

**✆ 90300 15588** సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । సంతోష్‌నగర్ । వరంగల్ **www.ferty9.com**

# CRIME కామాతురాణాం

**సాయంత్రం ఆరుగంటల సమయం. మసకచీకటి జలపాతమై కురుస్తోంది. ఆరుబయట కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న ఆ కాలనీవాసులు ఎందుకో అసౌకర్యంగా ఫీలవ్వసాగారు. తమ అసౌకర్యానికి కారణం ఏమిటా అని కొంతమంది ఆలోచనలో పడ్డారు.**

మరికొందరు ఆ కారణానికి మూలం ఎక్కడ? అని అన్వేషణ ప్రారంభించారు.

వారి అసౌకర్యానికి కారణం భరింపరాని దుర్వాసన అని, బహుశా ఏ ఎలుకో, పిల్లో చచ్చిపోయి ఉంటుందని కాలనీవాసులు మొదట్లో భావించారు. అయితే రానురాను ఆ వాసన పెరిగిపోవడంతో ఆ వాసన ఎక్కడ నుంచి వస్తోందా అని ఆరా తీశారు.

చివరికి ఆ వీధిలో ఉన్న రవీంద్ర ఇంటినుంచి ఆ దుర్వాసన వస్తోందని కనుక్కోవడానికి వాళ్ళకి ఎక్కువ సమయం పట్టలేదుగానీ, ఆ ఇంటి తాళం కప్ప వాళ్ళను వెక్కిరించింది.

రవీంద్ర భార్య సావిత్రికి మూడోకాన్పు. ప్రసవం నిమిత్తం పుట్టింటికెళ్ళింది. రవీంద్ర మరదలు రమ, అతడి ఇద్దరు పిల్లల్ని రెండురోజుల క్రితం చూశామనీ, బహుశా వాళ్ళు కూడా ఊరెళ్ళి ఉంటారనీ ఇరుగుపొరుగువారు అనుకున్నారు.

ఉన్నట్టుండి తాళంవేసి ఎక్కడికి వెళ్ళారు? ఇంట్లో పిల్లి లేక కుక్క ఏదైనా చచ్చిపోయిందా? లేక పోతే.....? అని వేరే సందేహంతో ఇరుగుపొరుగు వారంతా కలవరపడ్డారు.

కొద్దిసేపు తర్జనభర్జనలు పడి అందరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి పోలీసులకు ఫోన్ చేశారు. తమకేదో అనుమానంగా ఉందని చెప్పారు.

కబురు అందగానే ఇన్‌స్పెక్టర్ సింగ్ పోలీసులను వెంటబెట్టుకుని హడావుడిగా కాలనీకి చేరుకున్నాడు. పోలీసుల్ని చూడగానే అక్కడ గుమిగూడిన జనం చెల్లాచెదురయ్యారు.

ఫోన్ చేసినవాళ్ళు ఇన్‌స్పెక్టర్ దగ్గరకొచ్చి నిలబడ్డారు. పోలీసులు తాళాలు పగులగొట్టి తలుపులు తెరిచారు. ఆ మరుక్షణం ఇంట్లోంచి దుర్గంధం గుప్పుమంటూ బయటికొచ్చింది.

ముక్కులకు జేబురుమాళ్ళు కట్టుకుని లోపలికి అడుగుపెట్టారు పోలీసులు. బెడ్రూమ్‌లో యువతి శవం!

ఆమె ఒంటిమీది దుస్తులు చిరిగి పీలికలయ్యాయి. చిరిగిన దుస్తుల్లోంచి ఆమె శరీరం నగ్నంగా కనిపిస్తోంది. ఆమె పొత్తికడుపు చీల్చబడి ఉంది. ఒంటి మీద మిగిలినచోట్ల కూడా అనేక గాయాలున్నాయి. గాయాలనుంచి కారిన రక్తం ఆమెచుట్టూ మడుగు కట్టింది. ఆ గదికి మరోమూల ఇద్దరు పిల్లలు రక్తపుమడుగులో నిర్జీవంగా పడి ఉన్నారు. వారి గొంతులపై కత్తిగాయాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆ దృశ్యాలు చూసి పోలీసులు నిర్ఘాంతపోయారు.

హత్య జరిగిన తీరు ఇన్‌స్పెక్టర్ సింగ్‌ను కలచి వేసింది. హంతకుడు అత్యంత కిరాతకుడు అనుకున్నాడు.

ఇల్లంతా క్షుణ్ణంగా పరిశీలించాడు. ఇంట్లో సామాను చెల్లాచెదురు కాలేదు. అన్నీ యథాతథంగా ఉన్నాయి. దొంగతనంకోసం జరిగిన హత్యలుకాదని నిర్ణయించుకున్నాడు సింగ్. వేలిముద్రల నిపుణులు, ఫొటోగ్రాఫర్ వచ్చాక సింగ్ బయటికి వచ్చాడు. ఇరుగుపొరుగువారిని పిలిచాడు. లోపలికెళ్ళి ఆ దృశ్యాలు చూసి రమ్మన్నాడు.

వారు వెళ్ళి పరుగుపరుగున తిరిగి బయటికొచ్చారు. వారిలో ఒకరిద్దరు వాంతులు చేసుకున్నారు. మరణించిన యువతి రవీంద్ర మరదలు రమ. అతడి భార్య సావిత్రి ప్రసవానికి పుట్టింటికి వెళ్ళింది. పిల్లలకు వండిపెట్టేందుకు రమ బావ గారింటికి వచ్చింది. రవీంద్ర చాలామంచివాడని, ఎవరితోనూ అతనికి గొడవలులేవని, తన ఉద్యోగం, తన సంసారం అన్నట్టునే ఉండేవాడని దర్యాప్తులో తేలింది.

అయితే రవీంద్ర ఎక్కడున్నాడు? ఒకవేళ అతన్ని కూడా.....? అలా అయితే అతని శవం ఏమైంది? రమను, పిల్లల్ని చంపిన హంతకుడు రవీంద్రను వదిలి పెడతాడా? రవీంద్ర కుటుంబానికి శత్రువులున్నారా? పగతో చేశారా? ఆలోచనలతో సతమతమయ్యాడు ఇన్‌స్పెక్టర్ సింగ్.

అయితే అంత క్రూరంగా రమను పొట్టచీల్చి చంపటం మిస్టరీగా అనిపించింది!

> **నగ్నంగా ఉన్న అతని ఛాతీమీద చేయి వేయగానే ఆమె ఒళ్ళు ఝల్లుమంది. ఆ స్పర్శకు ఆమె శరీరంలో ఏదో పులకింత.. చప్పున ఆమెను తనమీదకు లాక్కుని గాఢంగా చుంబించాడతను. పెదవులకు ఏదో కొత్తరుచి తగలటంతో మైమరచి పోయిందామె. మెల్లగా ఆమె దుస్తులు ఒక్కటొక్కటిగా తొలగించాడు...అతడి స్పర్శకు, చేష్టలకు కోరికతో రగిలిపోతూ అతణ్ణి అల్లుకుపోయింది ఆమె. కానీ....**

అదే సమయంలో ఆ దగ్గరలో ఉన్న రైల్వేట్రాక్ వద్ద ఓ వ్యక్తి అపస్మారకస్థితిలో పడి వున్నాడని సమాచారం అందింది. ఇద్దరు కానిస్టేబుల్స్ జీపులో వెళ్ళి ఆ వ్యక్తిని తీసుకొచ్చారు. ఆ వీధిలోని వారు అతడిని రవీంద్రగా గుర్తించారు.

అతను స్పృహలోకి వచ్చాక ఏదేదో గొణుగుతూ వణికిపోసాగాడు.

పోలీసులు శవాలను పోస్ట్‌మార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించారు.

రవీంద్రను పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. ఆ దారుణ హత్యలు, అందుకుగల కారణాలేమిటో పోలీసు దర్యాప్తులో వెలుగులోకొచ్చాయి. ఇంతకీ ఈ హత్యలు ఎందుకు, ఎలా జరిగాయంటే....

***

"అబ్బా! తల బద్దలైపోతోంది. కాస్త జండూబామ్ తెచ్చివ్వు?" బెడ్రూములోంచి కేకేశాడు రవీంద్ర. రమ ఉలికిపడింది. వెంటనే అల్మారాలోంచి జండూబామ్ తీసుకెళ్ళింది.

గది మధ్య డబుల్‌కాట్ మంచంమీద రవీంద్ర పడుకుని కణతలు నొక్కుకుంటున్నాడు.

రమ సంకోచంతో గదిబయటే ఆగిపోయింది.

రవీంద్ర పంచెమీద ఉన్నాడు. నగ్నంగా విశాలంగా ఉన్న ఛాతీ, బలమైన భుజాలు చూడగానే రమ మనస్సులో కలవరం మొదలైంది.

గుమ్మంలోనే ఆగిపోయిన రమను చూసి,

"తల పగిలిపోతోంది. ప్లీజ్ కాస్త జండూబామ్ రాయవా?" అన్నాడు.

ఆమెలో సంశయం. బిడియపడుతూనే వెళ్ళి అతని పక్కన కూర్చుని జండూబామ్ వేలికి తీసుకుని నుదుటి మీద, కణతలకు సున్నితంగా రాయసాగింది.

రెండు నిముషాల తరువాత, "నీ చేతిలో ఏదో మాయ ఉంది రమ, తలనొప్పి తగ్గుతున్నట్టుంది, ఛాతీలో కూడా కాస్త నొప్పిగా ఉంది, రాయవూ?" అన్నాడు.

రమ నగ్నంగా ఉన్న అతని ఛాతీమీద చేయి వేయగానే ఆమె ఒళ్ళు ఝల్లుమంది.

అతని ఛాతీమీద ఆమె వేళ్ళు కదులుతూంటే ఆమె శరీరంలో ఒక విధమైన పులకరింత.

ఏదో మైమరపు ఆమెను ఆవరించసాగింది.

పద్దెనిమిదేళ్ళ రమ సున్నితమైన వేళ్ళు తన ఛాతీ మీద నర్తిస్తుండగా రవీంద్ర ఒంట్లో విద్యుత్తు సంచరించినట్టయింది. కోరికలు ఉవ్వెత్తున ఎగిసి పడ్డాయి.

చప్పున ఆమెను మీదికి లాక్కుని ఆమె పెదవులను గాఢంగా చుంబించాడు.



ఈ హఠాత్ పరిణామానికి రమ బిత్తరపోయింది. అయితే తన పెదవులకు ఏదో కొత్త రుచి తగలటంతో ఆమె కొద్ది క్షణాలు మైమరచిపోయింది.

అంతలో ఏదో గుర్తుకొచ్చినట్టు, "ఛీ...ఛీ...ఇదేం పని బావా? అక్క చూసిందంటే చంపేస్తుంది" అంది అతని చేతుల నుంచి విడిపించుకోవటానికి ప్రయత్నిస్తూ.

"మీ అక్క ఇక్కడ ఉంటే కదా చూడటానికి. మీ ఊళ్ళో, మీ ఇంట్లో ఉంది" అన్నాడు ఆమెను ముద్దులతో ఉక్కిరిబిక్కిరి చేస్తూ.

"వద్దు బావా, ఇది పాపం. ప్లీజ్ నన్ను వదిలేయండి" అంది రమ.

"నువ్వు నా మరదలివి, అంటే సగం భార్యవన్న మాట" అంటూ ఆమెను తన బిగి కౌగిలిలో నలిపేయసాగాడు.

రమ ఏదో చెప్పబోతుండగా ఆమె పెదవులను తన పెదవులతో మూసేశాడు.

మెల్లగా ఆమె దుస్తులు ఒక్కటొక్కటిగా తొలగించాడు.

అతడి స్పర్శకు, చేష్టలకు కోరికతో రగిలిపోతూ అతణ్ణి అల్లుకుపోయింది.

ఆ గదంతా వేడి ఊర్పులతో నిండిపోయింది.

***

ఆ రోజు నుంచి రవీంద్ర, రమ ఏకాంతం దొరకగానే పడకగదిలో దూరిపోయేవారు.

పద్దెనిమిదేళ్ళ పరువంలో ఉన్న రమ ఇస్తున్న సుఖంముందు ఇద్దరు పిల్లల తల్లి సావిత్రి ఇచ్చే సుఖం చప్పగా అనిపించింది రవీంద్రకు. ఎట్టిపరిస్థితుల్లో రమను వదులుకోకూడదనుకున్నాడు. "నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నా, ఎలాగైనాసరే, మీ అక్కను ఒప్పించి నిన్ను పెళ్ళి చేసుకుంటా" అని చెబుతూ ఆమెతో సంబంధం కొనసాగించాడు.

తొలిసారి శారీరకంగా స్వర్గసుఖాలందించి ఆ రుచి చూపించడమే కాకుండా, తనను పెళ్ళి చేసుకుంటానంటున్న బావను రమ తన సర్వస్వంగా భావించింది.

వారి అక్రమ సంబంధానికి సాక్ష్యంగా రమకు నెల తప్పింది. అది అర్థం కాగానే రమ భయంతో వణికిపోయింది. రవీంద్రకు చెప్పింది. ఊహించని పరిణామానికి రవీంద్ర అదిరిపడ్డాడు. ముందు జాగ్రత్తలు పాటించనందుకు తననుతాను తిట్టుకున్నాడు. రమను తిట్టాడు. అబార్షన్ చేయిస్తానన్నాడు. బావ మాటలకు రమ షాక్ తింది.

నిజానికి అతను ఆమెను పెళ్ళి చేసుకోవాలను కోలేదు. కేవలం కోరికలు తీర్చుకోవటానికే అందమైన అబద్ధాలు చెప్పాడు. పెళ్ళి చేసుకుంటానన్న బావ ఎందుకు అబార్షన్ చేయిస్తానంటున్నాడో ఆమెకు అర్థం కాలేదు.

తనను పెళ్ళిచేసుకోక తప్పదనీ, అంతవరకు తన ఒంటిమీద చెయ్యి వెయ్యొద్దనీ రమ తెగేసి చెప్పడంతో రవీంద్ర అహం దెబ్బతింది.

ఆ రోజు రాత్రి రవీంద్ర బాగా తాగి ఇంటికి వచ్చాడు. ఆమె గదిలో అడుగు పెట్టాడు.

మంచంమీద పడుకున్న రమ చప్పున లేచింది.

ఆమెను బలవంతంగా దగ్గరికి తీసుకోబోయాడు.

రమ అతడిని దూరంగా తోసింది.

ఇచ్చినమాట ప్రకారం అక్కను ఒప్పించి తనను పెళ్ళి చేసుకున్న తరువాతే తన దగ్గరికి రమ్మంది. రగులుతున్న కోరికతో వచ్చిన రవీంద్రకు ఆమె మాటలు ఆగ్రహం తెప్పించాయి. తాగిన మైకంలో ఆమె మీదపడి చేతికి దొరికిన విధంగా ఆమె దుస్తులు చింపేశాడు. బలవంతంగా ఆమెను ఆక్రమించుకోబోయాడు. తనను కోరికలు తీర్చుకునే ఆటబొమ్మగా చేసిన బావమీద రమకు విపరీతమైన అసహ్యం కలిగింది. ఆగ్రహం పెల్లుబికింది. తన బలమంతా ఉపయోగించి అతని ప్రయత్నాన్ని అడ్డుకుంది.

ఎంత ప్రయత్నించినా రవీంద్రకు లొంగిపోలేదు రమ. రవీంద్ర కోపంతో పిచ్చివాడయ్యాడు. మరుక్షణం ఆమెను మంచంమీదికి తోసి ఆమె మీదికి దూకి గొంతు పట్టుకుని నొక్కేశాడు. రమ కొద్దిసేపు గిలగిలా తన్నుకుని ప్రాణాలొదిలేసింది.

అయినా రవీంద్ర కసి తీరలేదు. వంటింట్లోకి వెళ్ళి కాయగూరలు కోసే కత్తితెచ్చి తన కోరికలు తీరడానికి అడ్డుపడిన ఆమె ప్రెగ్నెన్సీ మీద కోపంతో ఆమె పొట్ట చీల్చేశాడు.

అదే సమయంలో పక్కగదిలోంచి పిల్లలిద్దరూ వచ్చి ఆ దృశ్యం చూశారు. భయంతో కేకలు పెట్టసాగారు. తనేం చేస్తున్నాడో కూడా గుర్తించని పరిస్థితిలో వాళ్ళిద్దరి మీద రవీంద్ర కత్తి విసిరాడు. దాంతో పిల్లలిద్దరూ నేల కూలారు. కొద్దిక్షణాల పాటు రక్తపు మడుగులో గిలగిలా తన్నుకుని ప్రాణాలొదిలారు.

కొంతసేపటికి రవీంద్రకు తాగిన మైకం దిగిపోయినట్టయింది.

భయం, దుఃఖం ఒక్కసారిగా అతడిని చుట్టుముట్టాయి.

తను చేసిన ఘోరకృత్యాలు తలుచుకుని తల బాదుకున్నాడు.

పశ్చాత్తాపంతో వణికిపోయాడు. ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్నాడు.

గబగబా ఇంటికి తాళం వేసి చీకట్లో రైల్వేస్టేషన్ వైపు పరుగుతీశాడు.

***

పోలీసు విచారణలో రవీంద్ర తన నేరం అంగీకరించాడు.

ఇన్‌స్పెక్టర్ సింగ్ కేసు నమోదుచేసి రవీంద్రను కోర్టులో హాజరు పరిచాడు.

చేసిన నేరాలకు బాధపడుతూ రవీంద్ర జైలులో ఉన్నాడు.

—సూర్యనేత్ర

13

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

# ప్రయత్నపు ప్రతిబింబమే...విజయం

**ఎదుట ఉన్న గమ్యం చేరడమే దుర్లభం అనిపిస్తుంది మొదట. కానీ నిజాయితీగా, నమ్మకంగా ప్రయత్నం చేసేవారికి 'విజయం' నల్లేరు మీద నడక.**

– గాంధీజీ

ప్రయత్నం విజయంవైపు ప్రయాణానికి తొలి అడుగు.

పరీక్షల్లో టాప్‌ర్యాంక్ సాధించాలన్నా, ఇంటర్వ్యూలో నూరుశాతం బెస్ట్‌గా నిలబడాలన్నా, నేటి కార్పొరేట్ పోటీప్రపంచంలో నిన్ను నువ్వు నిరూపించుకోవాలన్నా, వ్యాపారంలో సంథింగ్ డిఫరెంట్‌గా రాణించాలన్నా ప్రయత్నమే తొలి అడుగు.

కాళ్ళూచేతులూలేని ఎంతోమంది దివ్యాంగులను నిత్యం మనం చూస్తాం. వైకల్యాన్ని అధిగమించడానికి, ఏ రంగంలోనైనా తమసత్తా చూపడానికి వాళ్ళెన్నో ప్రయత్నాలు చేస్తారు. వారి ప్రయత్నాలకు 'విజయం' సలాం చేస్తుంది.

'ప్రయత్నం' మనలోని చైతన్యానికి ప్రతిబింబం. మనలోని తపనకు, రేపు సాధించబోయే విజయాలకు మనంపెట్టే పెట్టుబడి ప్రయత్నమే. జీవితంలో సాధించాలనుకున్న విషయాలపై అందమైన కలలు కంటాం. అవి ఆవిష్కృతమవ్వాలంటే కావాల్సింది ప్రయత్నం... ప్రయత్నం.... ప్రయత్నం...

ప్రయత్నం అనే తొలి, మలి, తుది అడుగులు వెయ్యాల్సిందే.

కొంతమందికి తొలి ప్రయత్నంలోనే విజయం వరిస్తుంది.

ఇలాంటివారు తమ కల నిజం చేసుకోడానికి నిత్యచైతన్యంతో ఉంటారు. నిజాయితీ అనే పెట్టుబడితో నమ్మకం అనే తీరం చేరడానికి, తడబడకుండా, తప్పులు దొర్లకుండా, సిన్సియర్‌గా ప్రయత్నం చేస్తారు. కార్యాచరణలో కర్మయోగులై శక్తియుక్తుల్ని నూరుశాతం వినియోగించి విజేతలవుతారు.

డాక్టరుగా ప్రస్థానం ప్రారంభించిన లోక్‌సత్తా పార్టీ అధ్యక్షుడు జయప్రకాష్‌నారాయణ తొలి ప్రయత్నంలోనే సివిల్స్ టాపర్‌గా నిలిచారు.

### తొలి ప్రయత్నం, అవరోధాలు

వాయిదా, తాత్సారం లాంటివన్నీ ప్రయత్నానికి ప్రథమ శత్రువు. అయితే ప్రయత్నానికి కాలం (టైం) ప్రాణస్నేహితుడు.

**"కాలాన్ని సరిగా ఉపయోగించుకోకపోతే, ఆ కాలమే తర్వాత మనపై లాఠీఛార్జి చేస్తుంది."**

–కిరణ్ బేడి

'దేనికైనా కాలం కలిసిరావాలి' అని నిరాశావాదులు, బద్ధకస్తులు, పలాయనవాదులు చెప్పే నిర్వీర్యపు మాటలు వినకండి.

**రేపు రహస్యం:** కొంతమంది బద్ధకస్తులు ప్రతి విషయం 'రేపటికి' వాయిదా వేస్తారు. ఆ 'రేపు' ఎడారిలో ఎండమావే. ఎప్పటికీ కార్యాచరణ కార్య రూపం దాల్చదన్నది బహిరంగ రహస్యమే. 'రేపు' అనిచెప్పే వాయిదావీరులు చాలామంది అనుకున్న పని పూర్తిచెయ్యకుండానే జీవితంనుండి నిష్క్రమించడం చూస్తూనే ఉంటాం.

వాయిదావీరులకున్న అలవాట్లే వారికి అవరోధాలు. అనుకున్న పనిని పక్కతోవ పట్టిస్తాయి.

వ్యసనాలకు బానిసైనవారికి స్థిరచిత్తం ఉండదు, ఆరంభశూరత్వమే. ప్రారంభించిన పనిలో క్రమంగా నమ్మకం కోల్పోయి మధ్యలోనే ఆపేస్తారు. ఇలాంటి వ్యక్తుల్లో చైతన్యం జావగారిపోతుంది. తెలివితేటలుండీ ఏమీ సాధించలేని నిస్సహాయులైపోతారు.

"ఈ క్షణమే మనది, గడిచిపోయిన క్షణం తిరిగి రాదని గుర్తించి సమయం సద్వినియోగం చేసుకున్నవాడే విజేత.

జీవితంలో మనం ఎవర్ని కలవాలో 'కాలం' నిర్ణయిస్తుంది. మనకెవరు కావాలో 'హృదయం' నిర్ణయిస్తుంది. కానీ మనమెలా జీవిస్తున్నామనేది మాత్రం మన 'ప్రవర్తన' నిర్ణయిస్తుంది. మన ప్రవర్తన ఎలా ఉంటుందనేది మన 'విజయం' నిర్ణయిస్తుంది. మన విజయం ఎలా ఉంటుందనేది మన 'ప్రయత్నం' నిర్ణయిస్తుంది.

### మలి ప్రయత్నం

తొలి ప్రయత్నంలో విజయం సాధించనంత మాత్రాన ప్రయత్నాన్ని పక్కకునెట్టకండి.

నూరుశాతం ప్రయత్నం చేసినా మనకు కలిసిరాని అదృశ్యాంశాలెన్నో ఉంటాయి.

పోటీపరీక్షలో చదివినవి రాకపోవడం, అవకతవకలవల్ల పరీక్షరద్దు, సకాలంలో పరీక్షాకేంద్రానికి చేరుకోలేకపోవడం వంటివాటివల్ల అపజయం కల్గిందని మళ్ళీ ప్రయత్నం విరమిస్తే మన మనుగడ

ప్రశ్నార్థకమే.

మొదటి ప్రయత్నంలో ఎదురైన అవరోధాలు దాటి, మలియత్నంలో విజేతలైన వారిలో కలెక్టర్లు, డాక్టర్లేకాదు, పలురంగాల్లో తమ సత్తాచాటిన హెన్రీ ఫోర్డు, బిల్‌గేట్స్, వాల్ట్‌డిస్నీ, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, చార్లెస్ డార్విన్, సర్ ఐజాక్ న్యూటన్, థామస్ ఎడిసన్, అబ్రహాం లింకన్, చార్లీచాప్లిన్, స్టీవ్‌జాబ్స్ వంటి ఎందరో ఉన్నారు. అనితర విజయాలతో వీళ్ళంతా చరిత్రలో తమ పేరు సుస్థిరం చేసుకున్నవారే.

### తుది ప్రయత్నం

తొలి, మలి ప్రయత్నాల్లో విజయం సాధించ లేనంత మాత్రాన చతికిలబడి పోయేవారి విజయం 50/50కి చేరుకుంటుంది.

లక్ష్యంమీద గురి, తమమీద తమకి నమ్మకం, నిజాయితీ ఉన్నవారుమాత్రం అవరోధాలను విశ్లేషించుకుని, అవి పునరావృతం కాకుండా, సమయాన్ని సద్వినియోగం చేసుకోవటంలో సఫలమై విజేతలు అవుతారు.

"ప్రతి వ్యక్తి చుట్టూ అనంతమైన అవకాశాల ద్వారాలు పరిభ్రమిస్తుంటాయి. నువ్వు చైతన్యవంతుడివి (వైబ్రెంట్) అయితే తొలి ప్రయత్నంలోనే ఆ ద్వారాలు వాటంతటవే తెరచుకుంటాయి. నువ్వు మేధావి (బ్రిలియెంట్) అయితే మలిప్రయత్నంలో చాలాద్వారాల్ని తెరవగలవు. నువ్వు శ్రద్ధాపరుడివి అయితే తుదియత్నంలో కొన్ని అవకాశ ద్వారాల్ని తెరవగలవు.

### ఏదీ అసాధ్యం కాదు

విజయసాధనకు అవలంబించాల్సిన సూత్రం ఆశావాదం. 'కాదేదీ ప్రయత్నానికి అసాధ్యం' అని గుర్తించాలి. ఆశావాదులను ఎలాంటి ఫలితమైనా బాధించదు. ఆశావాదం ఎంతబలంగా ఉంటే మన ప్రయత్నాలు, ఆలోచనలు అంత దృఢంగా ఉంటాయి.

విజయం లభిస్తే పొంగిపోకూడదు. మరో వినూత్న ప్రయత్నానికి ఆ విజయం ఊతమిస్తుంది. ఒకవేళ ప్రయత్నం ఫెయిలైతే, అదే ఉత్ప్రేరకమై మనల్ని ప్రోత్సహిస్తుంది. జయాపజయాలకు అతీతమైన వ్యక్తుల లక్షణమిది.

ఆశావాదం ఎవరిసొత్తూ కాదు. సిగ్గుపడే అంశం అసలేకాదు. రాజకీయనాయకుడు మంత్రి పదవి కోరుకోవటం, చిరువ్యాపారి అంబానీస్థాయికి ఎదగాలనుకోవటం, జూనియర్ ఆర్టిస్ట్ మెగాస్టార్ కావాలనుకోవటం, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ బిల్‌గేట్స్‌లా ఎదగాలనుకోవడం దురాశ కాదు.

"ఉన్నతస్థాయికి ఎదగాలనుకునేవారికి ఆశావాదమే ఆయువుపట్టు. దానికి ప్రయత్నం ఒక్కటే పట్టుగొమ్మ. ఉన్నతస్థానానికి చేరుకోవాలన్న ఆశావాదం విజయంలో తొలిదశ. తక్షణమే ప్రయత్నం ప్రారంభించడం మలిదశ. ఆశించినది, అనుకున్నది అందేవరకూ పోరాడటం తుదిదశ. అందిన విజయాలతో కలలు సాకారం చేసుకోవడం సాఫల్యదశ.

"పెద్దపెద్ద దర్శకులకు తన ఫొటో ఆల్బమ్ చూపించి హీరో వేషాలిమ్మని అడిగేవాడు ఆయన. ఎంతో ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నాలేవీ కలిసి రాలేదు. అయినా ఆశావాదాన్ని వదలలేదు. ప్రయత్నం ఆపలేదు. హీరో కావాలన్న కలను తాత్కాలికంగా పక్కనపెట్టి, మొదట వీడియోరంగంలో కాలు మోపాడు. తర్వాత ఓ సినిమాకి దర్శకత్వం వహించే స్థాయికి ఎదిగాడు. మెల్లిగా దర్శకత్వంతోపాటు తన చిత్రాలకే సంగీత దర్శకుడయ్యాడు. వరుస విజయాలు సాధించాక, నిర్మాత స్థాయికి చేరుకున్నాడు. ఇక అప్పుడు మళ్ళీ హీరో కావాలన్న తన ఆశావాదాన్ని మేల్కొలిపి, కథ, సంగీతం, దర్శకత్వ బాధ్యతలతో స్వీయనిర్మాణంలో 'ఉగాది' చిత్రంలో హీరోగా నటించి విజేతగా నిలిచాడు. ఆయనే ప్రముఖ దర్శకుడు ఎస్వీ.కృష్ణారెడ్డి.



## హేట్సాఫ్ – డాక్టర్ ఎ.ఎస్.రావు



అద్భుతమైన ఆలోచనాశక్తి గల దేశం గర్వించదగ్గ శాస్త్రవేత్త, దార్శనికుడు, మానవతావాది... అందరికి ఎ.ఎస్.రావుగా పరిచయమైన ఆయన అసలు పేరు అయ్యగారి సాంబశివరావు. మంచి కార్యనిర్వాహకులు. మనసున్న మనిషి.

ఆంధ్రప్రదేశ్ పశ్చిమగోదావరి జిల్లా మోగల్లులో 1914 సెప్టెంబరు 20న మధ్య తరగతి కుటుంబంలో జన్మించారు. చదువుకునేందుకు డబ్బు లేని పరిస్థితిలో ఆయన తల్లి తన పెళ్ళిచీర అమ్మి... రావుగారిని స్కూలుకు పంపింది. అలాంటి ఎన్నో ఆర్థిక ఇబ్బందులు ఆయన చదువుకు అవరోధాలుగా మారలేదు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్రంలో బ్యాచిలర్స్, మాస్టర్స్ డిగ్రీల్లో గోల్డ్ మెడల్ సాధించారు. ఆయన ప్రతిభని గుర్తించిన టాటా కంపెనీ... ఆయనకు ఆర్థిక సహాయం చేసి స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీలో ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ మాస్టర్స్ డిగ్రీ చదవటానికి సాయం చేసింది. ఆ చదువు పూర్తయ్యాక యూనివర్సిటీ వాళ్ళు నెలకి లక్షా ఏభై వేల జీతంతో అసిస్టెంట్ ప్రొఫెసర్ ఉద్యోగం ఇచ్చినా కాదని తనని ప్రోత్సహించిన టాటా గ్రూప్‌లో నెలకి 300 రూపాయల జీతంతో పని చేశారు. ఆ తర్వాత హోమిబాబాతో పరిచయం కలిగి కాస్మిక్ రే ప్రయోగాల్లో పాలుపంచుకున్నారు. 1953లో ఆసియా ఖండంలోనే మొదటి న్యూక్లియర్ రియాక్టర్ ప్రాజెక్ట్ 'అప్సర'లో పనిచేశారు. భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన బాబా కమిటీలో రావుగారు ముఖ్యభూమిక పోషించారు. 1967లో హైదరాబాదులోని ఇసిఐయల్ సంస్థకి మేనేజింగ్ డైరెక్టర్ బాధ్యతలు చేపట్టారు. న్యూక్లియర్, రక్షణ రంగాలలో భవిష్యత్తులో అవసరమయ్యే ఉపకరణాల తయారీ దిశగా ఆయన ఇసిఐయల్‌ను ముందుకు నడిపించారు. డిజిటల్ కంప్యూటర్, సాలిడ్‌స్టేట్ టి.వి. కంట్రోల్ ఇనుస్ట్రుమెంటేషన్ సిస్టం, ఎర్త్‌స్టేషన్ ఏంటెనా, ఇవిఎం (ఎలక్ట్రానిక్ ఓటింగ్ మెషిన్), కాక్‌పిట్ రికార్డర్... వంటి ఉపకరణాల తయారీ ఇసిఐయల్‌లోనే చేపట్టేందుకు రావుగారు విశేష కృషి చేశారు.

భారత తొలి ఉపగ్రహం అయిన చంద్రయాన్ కోసం 32 మీటర్ల డీప్ స్పేస్ నెట్‌వర్క్ ఏంటెనా భారతదేశానికే తలమానికంగా నిలిచింది.

ఆయన గొప్ప మానవతావాది. క్రింది స్థాయి ఉద్యోగులకు కూడా అందుబాటులో ఉండే వారాయన. నిరంతర శ్రామికుడు. ఎనభైఏళ్ళ వయసులో కూడా సాధారణ బస్సుల్లో ప్రయాణించిన నిరాడంబరుడు.

1960లో పద్మశ్రీ, 1969లో శాంతిస్వరూప్ భట్నాగర్ అవార్డు 1972లో పద్మభూషణ్ సహా మరెన్నో అవార్డులు ఆయనను వరించాయి.

1982లో తన పదవీ విరమణ సమయానికి ఇసిఐయల్ ఎంప్లాయీస్ కో ఆపరేటివ్ హౌసింగ్ ప్రాజెక్ట్ పూర్తవ్వాలని ఆశించారు. అది సకాలంలో పూర్తయింది. ఆ కాలనీకి ఎ.ఎస్.రావు నగర్ అని నామకరణం చేశారు. ఈ మహోన్నత దార్శనికులు నిరంతర ప్రయత్నాలు ఫలితాలు వెలకట్టలేనివి. ఆ మహావ్యక్తి ప్రస్థానం అక్టోబరు 31, 2003న ముగిసినా... ఆయన సేవలు చిరస్మరణీయం.

* చెయ్యాలనుకున్న పనికి కోరిక ఒకటే ఉంటే సరిపోదు. ప్రయత్నం చేసే చొరవ కావాలి.
* ప్రయత్నంవల్ల విజయం లేదా అనుభవంతప్ప మనకు పోయేదేమీ లేదు.
* మనం ఏం చెయ్యగలమో ప్రయత్నం వల్లనే మనకు బోధపడుతుంది.
* ఆకులురాలే చెట్టు కొత్తచిగుళ్ళు తొడగడం మానేస్తుందా? మనలోని ఆశావాదం కూడా ప్రయత్నం అనే కొత్త చిగుళ్ళు తొడిగితేనే విజయం లభిస్తుంది.
* ఆకాశంలో ఎగిరేపక్షిలా ఎగరాలన్న ప్రయత్నంతో.. విమానం, దూరప్రాంతాల వారితో సంభాషించాలన్న ప్రయత్నంతో.... టెలిఫోన్ ఇలా నేడు మనం అనుభవిస్తున్న ఆధునిక సౌకర్యాలు ఎప్పుడో ఎవరో ఒకరు కలలుగని సాధించి నవే... ప్రయత్నం. మీది నిస్వార్థపు విజయమైతే ఫలితపు ప్రతిబింబంలో ఎన్నితరాలైనా మీరు కన్పిస్తూనే ఉంటారు.



13

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**మనసులో నుండి బాలగోపాల్‌కు సంబంధించిన ఆందోళన తొలగిపోయేసరికి కల్యాణ రాగాలు పసందుగా వినిపించసాగాయి.**

**చూస్తుండగానే పెళ్ళి దగ్గర పడింది. కానీ, వారం రోజుల నుండి రాగిణి దర్శనమే లభించడం లేదు. నిన్నటి నుండైతే ఫోన్‌లో కూడా దొరకడం లేదు.**

నాకు పదిహేను రోజుల లీవ్ శాంక్షన్ అయింది. ముందు రోజు నా ఫ్రెండ్సుకు కార్డులు ఇవ్వడం వంటి పెళ్ళి పనులు పూర్తి చేశాను. లీవు శాంక్షన్ కాగానే నాకయితే కొత్తగా రెక్కలు మొలిచినంత ఆనందంగా ఉంది. నా ఆనందాన్ని రాగిణితో పంచుకోవాలని అలాగే బాలగోపాల్ సమస్య కూడా సమసిపోయిందని చెబుదామనుకుంటే ఎప్పుడు ఫోన్ చేసినా ఎవరో ఎత్తి తమిళంలో మాట్లాడుతున్నారు. నాకేమో పెళ్ళి నిర్ణయమైన తర్వాత వాళ్ళింటికి వెళదామంటే సిగ్గుగా ఉంది.

అందుకే ఇక లాభం లేదనుకుని, పెళ్ళికి నాలుగు రోజుల ముందు నాడు రాగిణి వాళ్ళ నాన్నగారికే ఫోన్ చేశాను.

"నమస్కారం బాబూ! బాగున్నావా? అమ్మా నాన్నా వాళ్ళు వచ్చారా?" అని అడిగారు.

"అంకుల్! వాళ్ళు రేపుగానీ, ఎల్లుండి గానీ వచ్చేస్తారు! పనులన్నీ అవుతున్నాయా అంకుల్?" అని పరామర్శలు చేసి,

"అంకుల్! ఒకసారి రాగిణిని నాతో బయటకు పంపించగలరా? కొంతమంది క్లోజ్ రిలేటివ్స్, ఫ్రెండ్సు, కొలీగ్స్‌కి మేం ఇద్దరం కలిసి వెడ్డింగ్ కార్డ్సు ఇవ్వాల్సి ఉంది. నాకేమో తనతో మాట్లాడడమే వీలు కావడం లేదు" అన్నాను.

ఆయన నవ్వుతూ,

"ఔను బాబూ! ఇంటి నిండా చుట్టాలున్నారు. పెళ్ళి దగ్గరకు వచ్చేసింది కదా! అమ్మాయిని బంధువులంతా రోజుకొకరు పెళ్ళికూతురుగా ముస్తాబు చేస్తున్నారు. రేపు కూడా మా తమ్ముడు వాళ్ళు సాయంత్రం తీసుకువెళ్తారు. అందుకని, మీరు పొద్దున్నే వెళ్ళి లంచ్ టైంకల్లా మళ్ళీ వచ్చేయండి బాబూ!" అన్నాడు.

మరో రెండు నిమిషాలు మిగిలిన విషయాలు మాట్లాడి ఫోన్ పెట్టేశాను.

ఆ రాత్రంతా మధురోహల్లో తేలిపోయాను. రాగిణిని పొద్దున్నే కలుస్తున్నానన్న సంతోషంతో ఊగిపోయాను. రాగిణితో కలిసి దాదాపు సంవత్సరంన్నర పైగా కలిసి ఉద్యోగం చేస్తున్నాను. కానీ, ఈ వారం రోజుల విరహాన్ని మాత్రం తట్టుకోలేకపోతున్నాను. ఎంతో దిగులుగా ఉంది.

రాగిణి తనకు నచ్చని వారిని, పరిచయం లేని వారిని చాలా దూరం పెడుతుంది. అలాగే తనకు ఆత్మీయమైన వాణ్ణి, నన్ను మాత్రం, అనుక్షణం మోహావేశంలో ముంచేస్తుంది. ఆ ఆత్మీయతా బంధంతోనే నన్ను కట్టి పడేసింది.

***

కాబోతున్న పెళ్ళికొడుకును కాబట్టి, వాళ్ళ బంధువులంతా మొదటిసారిగా నన్ను చూస్తారు కాబట్టి, రాగిణి వాళ్ళింటికి వెళ్ళే ముందు కొంచెం ఎక్కువగానే ముస్తాబయ్యాను. బ్లూ జీన్స్ ప్యాంట్ మీద పసుపు రంగు చారల షర్టు, దానిమీద నేవీ బ్లూ బందగలా కోట్ వేసుకున్నాను. ఆ కోట్ అంటే నాకు చాలా ఇష్టం. అందులో నాకు నేనే ముద్దొస్తాను. ఎవరినైనా పడేయాల్సిన అవసరం ఉంటే ఆ కోటే వేసుకుంటాను. అలా తయారై వాళ్ళింటికి వెళ్ళాను.

రాగిణి వాళ్ళ ఇల్లంతా గోలగోలగా ఉంది. నన్ను చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

"ఎన్నా! ఎవరు కావాలి?" అని అడిగారు. హాల్లో పదిమంది వరకూ అమ్మాయిలు కూర్చుని ఉన్నారు. వాళ్ళంతా నన్నే కొరుక్కు తినేట్టు చూస్తున్నారు. నేను కొంచెం నాటీగా వారిని ఏడిపించాలనుకున్నాను.

నేను, "కొరియర్" అన్నాను.

"కొరియరా?" అని అనుమానంగా చూశారు.

"హా! రాగిణి కౌన్ హై?" అని కొంచెం కసురుకున్నట్టుగా అరిచాను.

వాళ్ళంతా కంగారు పడ్డారు. అందులో ఇద్దరు అమ్మాయిలు లోపలికి వెళ్ళి రాగిణిని వెంట పెట్టుకుని వచ్చారు.

రాగిణి తలంటు పోసుకుందేమో జుట్టంతా గాలికి ఎగురుతుంటే, దాన్ని పట్టుకోలేక అవస్థ పడుతూ వచ్చింది. సౌందర్య రాశులన్నింటినీ కలిపి ఒకే చోట కుప్పగా పోస్తే రాగిణి అవుతుంది. ఆ క్షణాన అంత అందంగా ఉంది. కల్యాణ శోభతో వెలిగిపోతోంది. నాకేమో ఎగురుతున్న ఆ కేశాలతో ఆడుకోవాలని మనసు ఆరాటపడింది.

నేను తనను చూసి కన్ను కొట్టాను. రాగిణి అర్థం చేసుకుని మౌనంగా నిలబడింది.

రాగిణి రావడం చూసి అమ్మాయిలంతా నన్ను చుట్టుముట్టి, నా చేతుల్లో ఏ ప్యాకెట్ లేకపోవడంతో అనుమానమొచ్చి,

"కొరియర్ ఏది?" అని అందరూ గోలగోలగా అరవసాగారు.

"ష్..." అని నేను వాళ్ళను సైలెంటుగా ఉండమని చెప్పి,

నేను గుండెల మీద చెయ్యి వేసుకుని, ఎడమ కాలు మడిచి కింద కూర్చుని, రాగిణిని లాగి నా కుడి కాలు మీద కూర్చోబెట్టుకుని,

"హే మేరా దిల్ లేలో మేరీ జాన్ రాగిణీ" అన్నాను.

అమ్మాయిలకు ఏమీ అర్థం కాక, గోలగోలగా తమిళంలో కెవ్వు కెవ్వుమని అరవసాగారు. రాగిణి అలాగే నా కాలు మీదే కూర్చుని ముసిముసిగా నవ్వుతూ ఉండిపోయింది గానీ ఒక్కమాట కూడా

## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పని చేసే ఆ అధికారి, మాకనూరు బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా ఏర్పాటు చేసిన పార్టీలో, రామస్వామిని చూసి, గతస్మృతులలోకి జారుకుంటాడు. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. స్కేల్ టూ ఆఫీసర్‌గా ప్రమోషన్ వస్తుందతనికి. స్టెనో ఆఫీసర్ రాగిణితో సాన్నిహిత్యం పెరిగి, ఇద్దరూ ఒక్కటవుతారు. పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. ఎంపీ బాలగోపాల్ విద్యుత్ ప్రాజెక్ట్ లోన్ విషయంలో అతన్ని కలిసి చూసీచూడనట్లు వెళ్ళమంటాడు. కానీ అందుకు ఒప్పుకోడతను. ఆ తర్వాత...

మాట్లాడలేదు.

ఆ గోల విని లోపలి నుంచి ఆంటీ బయట కొచ్చి, మోకాలిమీద కింద కూర్చున్న నన్నూ, నా కుడి కాలి మీద కూర్చున్న రాగిణిని చూసి,

"అయ్యో మురుగా! అల్లుడు గారూ..." అంటూ నా దగ్గరకు వచ్చింది.

దాంతో, నా రహస్యం బట్టబయలైంది. అందరూ నన్నూ రాగిణినీ చూసి గొల్లుమని నవ్వారు. అక్కడున్న పదిమందిలో ఎనిమిదిమంది నాకు మరదలు వరుస అవుతారట. వాళ్ళందరికీ నేను చేసిన ప్రాంక్ బాగా నచ్చింది.

వాళ్ళంతా నేను బ్రేక్‌ఫాస్ట్ చేసి రాగిణితో బయలుదేరేంత వరకూ నా చుట్టే తిరుగుతూ అవసరమున్నవీ లేనివీ అందించసాగారు.

రాగిణి తయారై వచ్చింది. రాగిణి ముఖంలో పెళ్ళి కళ ఉట్టి పడుతోంది. చేతులు గోరింటాకుతో శోభిల్లుతున్నాయి. అసలే నడుము సన్నన. దానిని వడ్డాణంతో బంధించే సరికి మరీ చిక్కిపోయింది. ఆకుపచ్చని గళ్ళ పట్టుచీర, డిజైనర్ బ్లౌజ్, ముక్కున పుడక...అప్పుడే, అక్కడే 'కూర్గ్'లోని హరిత సౌందర్యమంతా కుప్పబోసినట్టుగా ఉంది.

"ఎన్నో రాత్రులొస్తాయి గానీ రాదీ వెన్నెలమ్మా..." అన్న పాటలో

"గట్టి ఒత్తిళ్ళ కోసం గాలి కౌగిళ్ళు తెచ్చా"

అనే ఒక చరణం ఉంది.

ఆ పాటలోని సాహిత్యం నాకు బాగా ఇష్టం. అందుకే, ఆ క్షణం రాగిణిని చూడగానే, మదిలో సంతోషంతో పాటు సంగీతం కూడా పొంగింది.

"ఎన్నోసార్లు చూశాను గానీ ఇలా చూడలేదమ్మా...

ఒక్క ముద్దు కోసం నాకున్న ప్రాణాలు ధారపోస్తా.."

అని మనసులో పాడుకున్నాను.

రాగిణి కుడిచేతికి దండ కడియం పెట్టుకుంది. అది కొంచెం టైట్ అయినట్టుంది, ఆ చోట ఎరుపెక్కింది. అది చూసి, కంగారుగా,

"అరే.." అంటూ నేను, రాగిణిని ముట్టుకోబోయాను.

అంతే, మరదళ్ళందరూ 'హేయ్' అని అరిచారు. నేను ఉలికిపడి చూశాను.

'నో టచింగ్' అని చేతులు అడ్డంగా ఊపుతూ గోలగోలగా నవ్వారు.

నేను "ప్లీజ్, ప్లీజ్" అని వాళ్ళను బ్రతిమిలాడాను.

"ఓకే, ఓకే. ఓన్లీ వన్ టైం" అంటూ పర్మిషన్ ఇచ్చారు. నేను నవ్వుతూ తలూపి, రాగిణి చెయ్యి పట్టుకుని చూశాను. తలంటుకున్న జుట్టులోంచి వచ్చిన పరిమళంతో పరవశించి, మైమరచిపోయాను.

మేమిద్దరం బయటకొస్తుంటే, వాళ్ళంతా ఏడుపు ముఖం పెట్టుకుని, "మళ్ళీ ఎప్పుడొస్తారు బావా?" అని అడిగారు. నేను నవ్వాను.

"అక్కా! బావను మళ్ళీ తీసుకురా!" అని చెప్పారు. రాగిణి నవ్వుతూ 'సరే' అన్నది.

నా బైక్‌పై వెళ్దామంటే, "పొల్యూషన్‌కి ముఖం పాడవుతుంది. నిన్ననే ఫేషియల్ చేయించుకున్నాను" అంటూ రాగిణి వాళ్ళ కారు తీసింది. రాగిణి డ్రైవ్ చేస్తుంటే గమ్మత్తుగా అనిపించింది.

"జాగ్రత్త మేడం! అసలే పెళ్ళి కావాల్సిన వాణ్ణి" అన్నాను.

తను కొంటెగా చూస్తూ,

"అచ్చా! మీ ఆవిడకు నిన్ను సేఫ్‌గా అప్పగించే బాధ్యత నాది" అని అనేసరికి ఇద్దరమూ నవ్వుకున్నాము.

ముందుగా బ్యాంకుకు వెళ్ళాము. మా ఇద్దరినీ చూసి, రాగిణి పెళ్ళి నాతోనేనని తెలిసి బ్యాంకు కొలీగ్స్ అంతా నిర్ఘాంతపోయారు. ఇంత గొప్ప రహస్యం బ్యాంకులో ఎవరికీ తెలియకుండా మెయిన్‌టెయిన్ చేసినందుకు అందరూ అభినందించారు. అందరినీ పెళ్ళికి రమ్మని సాదరంగా ఆహ్వానించాము.

జెడ్ఎం ఛాంబర్‌లోకి వెళ్ళి ఆహ్వాన పత్రిక ఇచ్చి,



ఇద్దరమూ ఆయనకు పాదాభివందనం చేశాము. ఆశీర్వదించమని అడిగాము. రామస్వామి కంగారు పడ్డాడు.

నేను ఆయన కాళ్ళకు మొక్కుతానని రామస్వామి కలలో కూడా ఊహించలేదు. కానీ, నాకు ఆయనంటే వ్యక్తిగతంగా ద్వేషమేమీ లేదు. పెద్దవాడు, ఎంతైనా మాకు తిండి పెడుతున్న సంస్థకు లోకల్ ప్రతినిధి. కాబట్టి, రామస్వామి కాళ్ళకు మొక్కుదామని రాగిణితో నేనే అన్నాను. రాగిణి ముందు ఒప్పుకోకపోయినా తర్వాత సరేనంది. ఆ మా చర్యతో అప్పటివరకు నా మీదా, ఇకపై మా ఇద్దరి మీదా ఆయనకు ఏవైనా ద్వేషభావాలుంటే, కలిగితే, అవి పోవాలని నా ఆశ.

అక్కణ్ణించి 'హేవ్ మోర్' పార్లరుకు వెళ్ళి ఐస్‌క్రీం తిన్నాము. ఐస్‌క్రీం తింటూ రాగిణి చిలిపిగా చూసింది. నేను,

"ఏంటి?" అన్నాను.

"ఇక్కడే!" అంది.

"అవును. అరే! ఇక్కడే కదా! మరి మళ్ళీ ఒకసారి దేవి కరుణించి ప్రసాదం ఇస్తే.....!"

"ఏయ్! ఛీ.. ఎల్లుండి పొద్దున్న పెళ్ళి పెట్టుకుని.... ఏంటిది.. ఆ౦.." అంటూనే చటుక్కున ముద్దు పెట్టుకుంది.

"వార్నీ! నిజంగానే ఆడాళ్ళు ఎంతకైనా తెగిస్తారు. మగవాళ్ళందరూ ఉట్టి వెధవాయలు" అని అనుకుంటూనే ఆ అధరామృతాన్ని గ్రోలసాగాను.

చల్లటి ఐస్‌క్రీం తిన్నదేమో పెదాలు మంచు ముద్దల్లా, పక్వానికొచ్చి మధుర రసం నింపుకుని ఉన్న ద్రాక్షల్లా ఉన్నాయి. నాలో ఎక్కడో స్విచ్ వెలిగినట్టయింది. అసంకల్పిత ప్రతీకారచర్య లాగా నా సర్వావయవాలు సన్నద్ధం కాసాగాయి. అందుకు అనుగుణంగా, తన పొట్ట మీద కదులుతున్న నా చెయ్యిని తీసి పడేసి,

"ఇదేం పని స్వామీ! చాలు, ఇంక కాసేపుంటే పెళ్ళి సంగతేమో కానీ, శోభనం జరిగేటట్టుంది!" అని లేచి నిలబడింది.

"రాక్షసీ! స్వర్గానికి టికెట్ ఇస్తావు. కానీ, అడ్మిషన్ లేదంటావు" అన్నాను కినుకగా.

తను నవ్వుతూ,

"రైట్ ఆఫ్ అడ్మిషన్ ఈజ్ రిజర్వుడ్! నువ్వు కోరుకున్నప్పుడు కాదు. నేను అనుమతించినప్పుడు మాత్రమే ప్రవేశం" అంది.

"పాపాత్మురాలా! అబద్ధాలు ఆడుతున్నందుకు నీకు అందరూ ఆడపిల్లలే పుడతారు ఫో! నీ కాబోయే భర్తగా ఇదే నా వరం నీకు" అన్నాను.

**పెళ్ళి దగ్గర పడింది. తల్లీదండ్రీ ఇంకా రాలేదు. వాళ్ళను తీసుకురావడానికి ఊరికి బయలుదేరాడతను. దారిలో రాగిణి వాళ్ళ నాన్నగారు ఫోన్ చేస్తున్నట్టుగా అలర్ట్స్ రాసాగాయి. ఏమైందో అనుకుంటూ తిరిగి మామగారికి కాల్ చేశాడు. ఫోన్‌లో మామగారు చెప్పిన విషయం విని అతనికేం పాలుపోలేదు. అయోమయానికి గురయ్యాడు. ఇంతకీ ఫోన్‌లో ఆయన చెప్పిన విషయం ఏమిటి?**

"ధన్యోస్మి స్వామీ! స్వర్గం ఇక్కడ కాదు నాయనా! నీ టికెట్టుకు అడ్మిషన్ కూర్గ్‌లో లభిస్తుంది" అంది చిలిపిగా కన్ను కొడుతూ నవ్వుతూ.

ఆ మాటలు అంటున్న క్షణంలో మేము పార్లర్ చీకటి నుండి వెలుతురులోకి వచ్చాము. వెలుతురు కిరణమొకటి రాగిణి ముఖం మీద పడింది. ఆ వెలుతురులో, ఆమె నవ్వు ముఖం అద్భుతంగా అనిపించింది. ఆ దృశ్యాన్ని నా మనోమంజూషలో బలంగా ముద్రించుకున్నాను. అపురూపంగా భద్రపరుచుకున్నాను.

కానీ, ఆ క్షణాన, నాకేం తెలుసు అది నేను చూసిన, తన ఆఖరి చిరునవ్వని.

***

పెళ్ళి దగ్గర పడింది. ఎల్లుండి ఉదయాన్నే పెళ్ళి పెట్టుకుని, అమ్మానాన్న ఇంకా ఊరి నుంచి రాలేదు. ముందురోజే రావాల్సింది. కానీ ఇంకా రాలేదు. ఫోన్ చేస్తే కలవడం లేదు.

మధ్యాహ్నం మూడింటి తరువాత, ఏదో ల్యాండ్‌లైను నుండి నాన్న ఫోన్ చేసి,

"మేమొస్తున్న కారు జనగామ దగ్గర బ్రేక్ డౌన్ అయింది. ఫోనులో ఛార్జింగ్ అయిపోయింది. రెండు గంటల నుండి రిపేరు చేస్తున్నారు. కానీ, ఎప్పటి కవుతుందో తెలియడం లేదు. ఒకసారి, టాక్సీ అబ్బాయితో మాట్లాడు" అన్నాడు.

"ఇంకెంత టైం పడుతుంది?" అని అడిగాను.

"సార్! ఇక్కడ సరైన మెకానిక్ లేడు సార్! ఏదో పార్టు పాడైందని అది తేవడానికి వెళ్ళాడు. మా ఓనరుకు చెబితే డబ్బులు మీ దగ్గర తీసుకోమన్నాడు. ఎప్పటికి బాగవుతుందో నేనైతే చెప్పలేను సార్!" అన్నాడు.

నేను 'ఎల్లుండి నా పెళ్ళి ఉంది. దానికి సంబంధించిన పనులు చాలా ఉన్నాయని' చెబితే,

"సార్! ఈ కారు మీద నమ్మకం పెట్టుకోకండి సార్! మీ దగ్గర కారుంటే మీరొచ్చి పికప్ చేసుకోండి. లేకపోతే బస్సు ఎక్కించమంటే నేను బస్సు ఎక్కిస్తాను" అన్నాడు.

"ఛీ, కొడుకు పెళ్ళి అవుతుంటే మరీ బస్సులోనా?" అన్నాను.

"అయితే, మీరు రండి సార్! హైదరాబాదు నుంచి జనగామకి ఒక గంటలో రావచ్చు సార్!" అన్నాడు.

డ్రైవర్ ఒక గంట అన్నాడు గానీ, ఈ ట్రాఫిక్ పద్మవ్యూహంలో నుండి బయటపడి అక్కడకు చేరుకునే సరికి మినిమమ్ రెండు మూడు గంటలవుతుంది. అందుకే, ఒక గంట ఆగి ఫోన్ చేస్తే, తిరిగి అదే సమాధానం చెప్పాడు డ్రైవర్.

ఎంత మగ పెళ్ళివారమైనా, ఆచారాలు పెద్దగా పాటించకపోయినా, చిన్న చిన్న ఏర్పాట్లు చేసుకోవాలంటే అమ్మానాన్నా, చెల్లి ఉండడం అవసరం. అందుకే, ఇక నేను పెళ్ళికి ఎంగేజ్ చేసిన కారు తీసుకుని బయల్దేరాను. రాగిణికి ఈ విషయం చెబుదామని ఎన్నిసార్లు ట్రై చేసినా ఫోన్ కొన్నిసార్లు 'నాట్ రీచబుల్' అనీ, కొన్నిసార్లు 'అవుటాఫ్ కవరేజ్ ఏరియా' అని వస్తోంది.

నేనొస్తున్నానని, ధైర్యంగా ఉండమని నాన్నకు చెబుతుండగానే రాగిణి వాళ్ళ నాన్నగారి దగ్గర నుండి పదేపదే ఫోన్లు వస్తున్నట్టుగా అలర్ట్ రాసాగాయి.

నేను నాన్న ఫోన్ కట్ చేసి, ఆయనకు ఫోన్ చేశాను. ఆయన ఫోన్ ఎంగేజ్ వస్తోంది. మళ్ళీ రాగిణికి చేశాను. అదే సమాధానం, 'నాట్ రీచబుల్'. ఇంతలో అంకులే ఫోన్ చేశాడు.

"అంకుల్! ఏంటి విశేషం? చాలాసార్లు ఫోన్ చేశారు! నేను మీకు చేస్తే ఎంగేజ్ వస్తోంది!" అన్నాను నవ్వుతూ.

"బాబూ! నాలుగవుతోంది. అమ్మాయిని దీపాలు పెట్టకముందే మా తమ్ముడు వాళ్ళింట్లో పెళ్ళికూతురిని చేయాలి. తొందరగా వచ్చేయండి. అమ్మాయి ఫోన్ కలవడం లేదు!" అన్నాడు కాస్త నిష్ఠూరంగా.

నేను దిగ్భ్రాంతికి గురయ్యాను.

"అదేంటి అంకుల్? రాగిణి ఇంటికి రాలేదా?", అని ఆత్రుతగా ప్రశ్నించాను.

"అదేంటి మీరిద్దరే కదా కలిసి వెళ్ళారు. మరి అమ్మాయి రాలేదా అని నన్నడుగుతారు?" అన్నాడు



కోపంగా.

నేను బిత్తరపోయాను.

"కాదంకుల్! నేనూ రాగిణీ కలిసి రెండింటికే మీ ఇంటికొచ్చాము. కారు అపార్ట్‌మెంటు ముందు ఆపి కాసేపు మాట్లాడుకున్నాక, నేను నా బైక్ తీసుకుని వచ్చేశాను. మరి తను ఎక్కడికి వెళ్ళింది అంకుల్?" అని అడిగాను.

"అరే! మరి రాగిణి ఇంటికి రాకుండా ఎటు వెళ్ళింది? అమ్మా! తాయీ.." అంటూ కంగారు పడడం మొదలు పెట్టాడు.

నాకు కాళ్ళూ చేతులూ ఆడడం లేదు.

"అంకుల్! అంకుల్..." అని ఫోనులో అరిచాను. ఆయన గొంతు నీరసంగా వినిపించింది.

"తన ఫోన్ కలవడం లేదు. మీ ఫోన్ కూడా చాలాసేపటి నుండి కలవలేదు. దాంతో మీరిద్దరూ కలిసే ఉన్నారనుకున్నాము" అన్నాడాయన ఆదుర్దాగా.

"లేదంకుల్! రాగిణి దగ్గర నుంచి రూముకు వచ్చాక, అమ్మావాళ్ళు వస్తున్న కారు జనగామ దగ్గర బ్రేక్ డౌన్ అయిందంటే అటు వెళ్తున్నాను, వాళ్ళను తీసుకురావడానికి. అందుకే మీకు ఫోన్ కలవడం లేదు."

"మరి...? రాగిణి ఎక్కడకు వెళ్ళి ఉంటుంది?"

"అంకుల్, మీరు కిందికి వెళ్ళి కారు ఉందో లేదో చూడండి. అలాగే అక్కడి సెక్యూరిటీ వాళ్ళను అడగండి" అని చెప్పాను.

ఆయన "సరే" అంటూ ఫోన్ పెట్టేశాడు.

నా పల్స్ రేట్ పెరిగిపోసాగింది. గుండె గొంతులోకి వచ్చిన ఫీలింగ్ కలగసాగింది. మనఃఫలకం మీద చాలామంది ముఖాలు ఫ్లాష్‌లా వెలుగుతూ మలిగిపోతున్నాయి.

నేను ప్రయాణిస్తున్న కారుని డ్రైవర్ నడుపుతున్నాడు కాబట్టి సరిపోయింది. లేకపోతే నేనయితే దేనికో ఒక వెహికల్‌కు గుద్దేసేవాణ్ణి. నేను మళ్ళీ రాగిణి ఫోన్ ట్రై చేశాను. ఫలితం లేదు.

నేను వెంటనే నా ఐపీయస్ ఫ్రెండుకి ఫోన్ చేశాను. ఎవరో కానిస్టేబుల్ ఎత్తి 'సార్ కమీషనర్ గారి దగ్గర ఉన్నారని' చెప్పాడు.

ఐస్‌క్రీం పార్లర్ బయటికి రాగానే నవ్వుతూ కనిపించిన ముఖం, నేను అపార్ట్‌మెంటు నుండి బైక్ మీద ఎక్కి బయలుదేరుతున్నప్పుడు తను 'బై' చెప్పినప్పుడు, తన చేతినిండా ఉన్న సప్తవర్ణాల గాజులూ, మణికట్టుకు కట్టిన గౌరీపూజ కంకణం, మోచేతి వరకూ పెట్టుకున్న మెహందీ...అన్నీ కళ్ళ ముందు కదలాడసాగాయి. నాకు తెలియకుండానే నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'సుకుమారాల రాశే తను, తనకేమైంది?'

ఇటువంటి విపత్కర పరిస్థితిలో నేను హైదరాబాదులో కాకుండా ఎక్కడో మార్గమధ్యంలో ఉండడం ఎంత దురదృష్టం అనుకున్నాను.

కారులో అమ్మానాన్న వాళ్ళను తీసుకుని హైదరాబాదు చేరేసరికి రాత్రి ఎనిమిదయింది. ఆ రోజు పగబట్టినట్టుగా దారి పొడుగునా ట్రాఫిక్కే. ఉప్పల్ చౌరాస్తాలో అరగంట ఇరుక్కుపోయాము. అంకుల్ దగ్గర నుంచి ఏ శుభ సమాచారమూ లేదు. నాకైతే గుండె లోతుల్లో నుంచి దుఃఖం తన్నుకొస్తోంది.

నేను రాగిణి వాళ్ళ ఇంటి ముందు దిగి, అమ్మావాళ్ళను నా రూము దగ్గర దించమని చెప్పాను.

అప్పటివరకూ నిమిష నిమిషానికి ఫోన్ చేస్తూనే ఉన్నాను. రాగిణి జాడ దొరకనే లేదు. నేను వెంటనే పోలీసులను అలర్ట్ చేయమని లేదా మా ఐపీయస్ ఫ్రెండు దగ్గరకు వెళ్ళమని చెప్పినా, అంకుల్ ఎందుకో స్తబ్ధుగా ఉండిపోయాడు.

నేను, కాళ్ళీడ్చుకుంటూ వాళ్ళింట్లోకి వెళ్ళేసరికి అందరూ విషణ్ణ వదనాలతో కూర్చున్నారు.

రాగిణికి సంబంధించి ఏ జాడా లేదు. ఏ ఫోన్ కాల్ రాలేదు.

పోలీసుల దగ్గరకు వెళ్ళడం మినహా మరో మార్గం లేదు. కానీ, నేను ఎంత చెప్పినా,

"తెల్లారి మరునాడు పెళ్ళి కావలసిన పిల్ల గురించి పోలీస్ కంప్లయింట్ ఇస్తే పరువు పోతుందని" భోరుమన్నారు అందరూ.

కానీ, నేను ఊర్కోలేదు.

"అంకుల్! ఇది పరువు గురించి ఆలోచించాల్సిన

## లాకర్ నెం.369
### కూపన్ నెం.9 విజేత

**వానపల్లి కనకరత్నం**
కశింకోట, విశాఖపట్నం

---

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-10 (6-9-2017)

మా ప్రశ్న: **రాగిణి కుడిచేతికి ఏం పెట్టుకుంది?**

మీ జవాబు-----------------------------------------------------------

చిరునామా-----------------------------------------------------------

--------------------------------------------------------------------

-----------------------------పిన్-------------------ఫోన్‌నెం-------------------

ఈ కూపన్‌ను 5 సెప్టెంబర్ 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



*నిబంధనలు వర్తిస్తాయి

సమయం కాదు. ప్రాణాలు కాపాడుకోవలసిన తరుణం" అని నచ్చ చెప్పి, నా ఐపీయస్ ఫ్రెండుకు ఫోన్ చేసి పరిస్థితి వివరించాను.

'ఇంత ఆలస్యం చేస్తారా? అప్పుడే, వెంటనే చెప్తే మొత్తం సిటీ అంతా అలర్ట్ చేసేవాళ్ళం. ఈ పాటికి ట్రేస్ అయ్యేది. షిట్ మ్యాన్' అని విసుక్కున్నాడు. హుటాహుటిన రాగిణి వాళ్ళింటికి వచ్చాడు. అఫీషియల్‌గా కంప్లయింట్ నమోదు చేయకపోయినా అన్ని పోలీస్ స్టేషన్లను అలర్ట్ చేశారు. సిటీ చుట్టూ ఉన్న అన్ని చెక్ పోస్టులకు కాషన్ పంపించారు. కారు నెంబరు కంట్రోల్ రూముకు పంపి ట్రేస్ చేయమని చెప్పారు. ఒక క్లూస్ టీం వచ్చి అపార్ట్‌మెంట్ చుట్టుపక్కల విచారించసాగారు.

అంకుల్, ఆంటీ ఏం మాట్లాడలేదు కానీ వాళ్ళ చుట్టాల్లో కొందరు మాత్రం రాగిణిని ఉదయం బయటకు తీసుకెళ్ళిన నేను మళ్ళీ అంకుల్ ఫోన్ చేసే వరకూ రాగిణి ఎక్కడుందో చెప్పలేదనీ, నా మీదనే అనుమానం ఉన్నట్లుగా మాట్లాడసాగారు. ఆ మాటలు నా చెవిన పడుతూనే ఉన్నాయి. నాకు తెరలు తెరలుగా దుఃఖం ముంచుకొచ్చింది.

'నా రాగిణిని..... నేనే...' అంటూ అంకుల్‌ని పట్టుకుని భోరున ఏడ్చాను.

"అంకుల్! రాగిణిని నేనే ఏమైనా చేస్తానా? మీకూ నా మీద అనుమానం ఉందా?" అని అడిగాను. ఆయన,

"ఛ, ఛ" అని నా భుజం తడుతూ, తనూ ఏడుస్తూ, వాళ్ళ బంధువులను నోరు మూసుకోమని చెప్పాడు.

రాత్రి పదకొండు గంటల వరకు నా ఐపీయస్ ఫ్రెండ్ నానా విధాలుగా ప్రయత్నించాడు. తన సీనియర్లతోనూ, కమీషనర్‌తోనూ మాట్లాడాడు. కానీ, ఏ జాడా లభించలేదు.

మరదళ్ళంతా ఏడుస్తూ కూర్చున్నారు. 'పాపం బావను మళ్ళీ తీసుకురమ్మని అక్కకు చెప్పారు. కానీ, అసలు అక్కే మాయమైంది.'

అందరం విషాద సంద్రంలో మునిగిపోయి ఉన్నాము. నా ఫ్రెండ్ నన్ను పక్కకు పిలిచి,

"ఇంక ఈ రాత్రికి ఇక్కడ ఉండి మనం చేసేదేమీ లేదు. వెళ్దాం పద. ఎక్కడైనా డిన్నర్ చేసి, కంట్రోల్ రూముకు వెళ్దాం" అన్నాడు.

ఈ సమయంలో డిన్నర్ అనగానే నాకు వాంతికొచ్చినంత పనైంది.

ఈ సమయంలో వాళ్ళను వదిలి నేను రాలేనన్నాను. అతను నన్ను కన్విన్స్ చేయలేక వెళ్ళిపోయాడు.

అపార్ట్‌మెంట్ వాసులు ఏదో జరిగిందనే విషయం పసిగట్టారు. కానీ, అడగడానికి సందేహపడుతూ, అప్పుడొకరు, ఇప్పుడొకరు తొంగి చూసి వెళ్ళిపోతున్నారు. పెళ్ళి కోసం ఆ చిన్న స్థలంలోనే ఇంటి ముందు పందిరి వేసి డెకొరేట్ చేశారు. అదంతా ఇప్పుడు వెక్కిరిస్తున్నట్టుగా కనపడసాగింది.

అందరూ చూస్తున్నారని నేను తలుపు మూయబోతుంటే, అంకుల్ చటుక్కున లేచి నా చేయి పట్టుకుని ఆపి,

"వద్దు. నా తల్లి వచ్చేస్తుంది. తలుపు మూసి ఉంటే మళ్ళీ వెళ్ళిపోతుంది" అంటూ పిచ్చి పిచ్చిగా ఏడవసాగాడు.

అందరూ ఒక్కసారి ఉలికిపడ్డారు. పది నిమిషాల్లో మళ్ళీ కునికిపాట్లలోకి జారుకున్నారు. నాకు మాత్రం కన్ను మూతపడడం లేదు. గుండె లోతుల్లో నుండి దుఃఖం అలలు అలలుగా పొంగుకొస్తోంది. ఇదే ఇంట్లో ఉదయం నవ్వులు వికసించాయి. బంగారు తల్లుల వంటి ఇంత మంది పడుచుల నవ్వులతో కళకళలాడింది. ఇప్పుడు విషాదం తాండవిస్తోంది. 'బావా' అంటూ ఆట పట్టించిన అమ్మాయిలంతా బిక్కమొహం వేసుకుని ఉన్నారు. 'నన్ను మళ్ళీ రమ్మన్నారు. నేనొచ్చాను. కానీ వాళ్ళ అక్కే రాలేదు.'

## తుమ్మల నిజాయితీ

*"అయ్యా తిక్కన భారతంలో మీ దృష్టిలో చెత్త పద్యమనిపించేదొకటి చదివి, మీరు రాసిన మంచి పద్యం కూడా చదివి, మీరేవిధంగా అభినవ తిక్కన బిరుదుకు తగినవారో వివరించి, మాకు జ్ఞానం ప్రసాదించండి"* అని ఒకాయన తుమ్మల సీతారామ్మూర్తి చౌదరిగారిని అడిగాడు.




*"ఎవరో ఇస్తే కాదన లేక తీసుకున్నాగానీ, నేనం తటివాణ్ణికాదని ఎరుగుదును. ఒక నిండుసభలో ఇచ్చిన బిరుదాన్ని, మళ్ళీ ఆ సభలోనే వదులుకోబోతున్నాను. నేను గాంధీ కవిని, తెలుగులెంకను. నాకు ఆ రెండే తగిన, చాలిన బిరుదులు"* అని చెప్పి మరుసటి నెల నరసరావుపేటలో జరిగిన సాహితీసభలో తన మాట నిలబెట్టుకున్నారు. అదీ తుమ్మలవారి నిజాయితీ, వినయం. 'విన్నంత-కన్నంత' పుస్తకంలో డా.బూదరాజు రాధాకృష్ణ ఈ విషయం పేర్కొన్నారు.

రాత్రి రెండింటికి నా ఫ్రెండ్ ఫోన్ చేశాడు.

"రాగిణి కారు కొంపల్లికి వెళ్ళే దారిలో సుచిత్ర జంక్షన్ దగ్గరున్న చెక్‌పోస్టులో సాయంత్రం నాలుగు గంటలకు కనిపించిందనీ, కానీ డ్రైవింగ్ సీటులో రాగిణి లేద"ని చెప్పడంతో మరింత కంగారుపడ్డాం.

"రాగిణి అక్కడకు ఎందుకు వెళ్తుంది?" అని నేనడిగితే,

"అటు వైపు మాకు స్నేహితులు గానీ, బంధువులు గానీ లేరు" అని అంకుల్ చెప్పాడు.

"అయినా ఎటైనా వెళ్ళినా ఇంటి వరకు వచ్చి ఇంట్లోకి రాకుండా, భోంచేయకుండా, మాకు చెప్పకుండా ఎందుకు వెళ్తుంది?" అని ఆంటీ కళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

"నా తల్లిని ఎవరో కిడ్నాప్ చేశారు!" అంటూ అంకుల్ ఏడవడం మొదలు పెట్టారు.

ఆ మాట వింటూనే నాకయితే గుండెల్లో జలదరింపు కలిగింది.

అందరి మనసుల్లో, మధ్యాహ్నం నుండే 'కిడ్నాప్' అనే కఠోరమైన చేదు వాస్తవం మెదులుతున్నా, అది కాదేమోననీ, ఇప్పుడో అప్పుడో రాగిణి తిరిగి వస్తుందనే ఆశ కూడా మిణుకు మిణుకుమంటూ ఉంది. అంకుల్, అలా బయటపడే సరికి ఇంటిల్లిపాదీ గొల్లుమన్నారు.

నేను హతాశుణ్ణయ్యాను. నా సర్వశక్తులూ ఉడిగిపోయాయి.

నా ఫ్రెండ్ కూడా అదే అన్నాడు.

తను అఫీషియల్‌గా 'కిడ్నాప్' కంప్లయింట్ రిజిస్టర్ చేయిస్తానన్నాడు. నేను సరేనన్నాను.

నా మనసు పరిపరివిధాల ఆలోచించడం మొదలు పెట్టింది.

ఇది కేవలం నా మీద పగదీర్చుకోవడానికి జరిగిన కుట్రేనని నా మనసు ఘోషించసాగింది.

'పొద్దున్నే వెళ్ళి పాదాభివందనం చేసి పెళ్ళికి రమ్మని ఆహ్వానించామే! అయినా అతని మనసు కరగలేదా? పెళ్ళి అయితే మా ఇద్దరి వల్ల తన పట్ల వ్యతిరేకత పెరుగుతుందని, పెళ్ళి కాకూడదనే కక్ష కట్టాడా? ఒకవేళ కక్ష గట్టినా ఇంత వేగంగా ప్రతిస్పందించడం జెడ్‌ఎంకు సాధ్యమవుతుందా?' అన్న ప్రశ్న నాలో సుళ్ళు తిరగసాగింది.

'అతన్ని కలిసిన టైముకు, రాగిణిని ఇంటి దగ్గర వదిలిన టైముకు మధ్య గ్యాప్ మూడు గంటలుంది. ఈ మూడు గంటల్లోనే కిడ్నాప్ ప్లాన్ చేయడం వీలవుతుందా? లేక ముందు నుంచే ఇట్లాంటిదేదో చేయాలనే తయారీలో ఉండి అవకాశం దొరకగానే లేక వాళ్ళకు అనుకూలంగా పరిస్థితులు ఉన్నాయని అనిపించగానే కిడ్నాప్ చేయడానికి ముందే ప్రణాళిక సిద్ధం చేసి పెట్టుకున్నారా?...'

అలా ఆలోచిస్తూనే ఎప్పుడు కళ్ళు మూతలు పడ్డాయో గానీ, అలాగే కుర్చీలో ఒరిగిపోయాను.

ఒక్కసారిగా ఘొల్లుమని ఏడుపులు వినిపించాయి. నేను ఉలికిపడి లేచాను.

టైం, ఆరు కావస్తోంది.

ఘోరమైన ఏ వార్త వినవలసి వస్తుందోనని సూర్యుడు మెల్లి మెల్లిగా, జంకుతూ బయటకొస్తున్నాడు, అప్పుడే.

నేను చుట్టూ చూసేసరికి, ఇంటి నిండా పోలీసులున్నారు.

ఒక ఇన్‌స్పెక్టర్ నా దగ్గరకొచ్చి నా చెంప మీద ఫెడేల్‌మని కొట్టాడు. అతడు నన్ను పట్టుకుని లేపగానే, ఒక కానిస్టేబుల్ నా చేతులకు బేడీలు వేశాడు.

నేను విస్మయంగా చుట్టూ చూశాను. అంకుల్, ఆంటీ కన్నీరు మున్నీరు అవుతున్నారు. నేను ఇంకా నిద్ర మత్తులో నుంచి పూర్తిగా తేరుకోలేదు. దాంతో అక్కడ జరుగుతున్న సంఘటనలేవీ నా మెదడులో రిజిస్టర్ కావడం లేదు. అందుకే,

"ఏమైంది?" అని అడిగాను.

"రాగిణి చనిపోయింది."

**(ఇంకా వుంది)**






# రిమ్ జిమ్.. రిమ్‌జిమ్

**'రిమ్‌జిమ్ రిమ్‌జిమ్ హైదరబాద్.. రిక్షావాలా జిందాబాద్.. మూడు చక్రములు గిరగిర తిరిగితే మోటర్‌కారు బలాదూర్..' అని రేడియో మిర్చిలో బాలసుబ్రమణ్యం కమ్మగా పాడుతున్నాడు. 'అవి మూడు చక్రాలు.. మావి నాలుగు చక్రాలు' అని నవ్వాడు యాదగిరి. అద్దంలో నుంచి బయటకు చూశా. అన్ని వైపులా ట్రాఫిక్.**

'ఈ ట్రాఫిక్‌లో రోజుకు 12 గంటలు డ్రైవింగ్..' ఆ ఆలోచనే వెన్నులో వణుకు పుట్టించింది. 'ఈ ఉబర్ నడిపి రోజుకు ఎంత సంపాదిస్తావు యాదగిరి..' అని అడిగా. కారు ఎక్కినప్పుడు డ్రైవర్ పేరు.. హోటల్‌కి వెళ్లినప్పుడు వెయిటర్ పేరు అడిగి తెలుసుకొని, వాళ్లను పేరుతో పిలవటం నాకు అలవాటు. చిన్నప్పుడు చదివిన డేల్ కార్నేజీ పుస్తకాల ప్రభావం ఇంకా పూర్తిగా పోలేదు! 'డీజిల్, రెంట్ పోను రోజుకు యావరేజ్‌గా ఆరొందలు దాకా మిగులుతుంది మేడమ్' అన్నాడు. అంటే నెలకు 18 వేలు. 'అంతేనా!' అన్నా అప్రయత్నంగా. యాదగిరి నవ్వాడు. 'ఈ కంపెనీ హైదరాబాద్‌లో పెట్టినప్పుడు ట్రిప్పుకు ఐదొందలు ఇచ్చేవారు. ఎన్ని ట్రిప్పులేస్తే అన్ని ఐదొందలు. కస్టమర్ దగ్గర వసూలైంది పట్టుకొని మిగిలింది ఇచ్చేసేవారు. ఇప్పుడు కమీషన్ తగ్గింది. ఇప్పుడు బయట నడుపుకుంటేనే ఎక్కువొస్తోంది' అన్నాడు.

### వ్యసనంగా మారింది

కస్టమర్స్‌కు అలవాటయ్యే దాకానే ఏ కంపెనీ అయినా ఒదిగి ఉంటుంది. ఒక్కసారి అలవాటైతే లాభాల వేట మొదలెడుతుంది. టూత్‌పేస్ట్ నుంచి ఉబర్ దాకా ఇదే సూత్రం. ట్రాఫిక్ కొద్దిగా పలచబడింది. కారు వేగం పుంజుకుంది. 'మాది నల్గొండ మేడమ్. ఖేతీ అచ్చిరాలే. ఫ్రెండ్ ఉబర్ నడుపుతుంటే నేను వచ్చి జాయినయ్యా. మొదట్లో 30 వేలొచ్చేవి. ఇప్పుడు 18 వేలొస్తున్నాయి. శ్రమ అదే. రోజుకు పన్నెండు గంటలు తోలాలి..' అన్నాడు.

'నువ్వెన్ని ట్రిప్పులేస్తే అన్ని డబ్బులొస్తాయి కదా.. అది కాకుండా సర్జ్ ఫేర్‌లని డబ్బులు దోచేస్తున్నారుగా..' అన్నా కోపంగా. ఈ మధ్య కాలంలో చాలామందికి క్యాబ్ ఒక వ్యసనంగా మారింది. ఒకప్పుడు ఆటోల్లో తిరిగేవాళ్లు కూడా క్యాబ్‌నే వాడటం మొదలుపెట్టారు. 'అర్థం చేసుకోండి మేడమ్.. ఒకప్పుడు కంపెనీ తక్కువ కమీషన్లు తీసుకునేది. మాకు ఎక్కువ డబ్బులొచ్చేవి. మొదలు పెట్టినప్పుడు ఒక ట్రిప్పుకు ఐదొందలు ఇచ్చారు మేడమ్. ఇప్పుడు 20 ట్రిప్పులేస్తే 650 రూపాయలు ఇస్తున్నారు. సర్జ్ ఫేర్‌లో 50 రూపాయలే మాకిస్తారు. మిగిలినదంతా కంపెనీకే..' అన్నాడు.

### కంపెనీల కంట్రోల్‌లోనే...

యాదగిరితో మాట్లాడుతుంటే ఈ కంపెనీల బిజినెస్ మోడల్ నెమ్మదిగా అర్థం అవుతోంది. అందరికీ క్యాబ్‌లు అలవాటయ్యే దాకా ఇటు డ్రైవర్లను, అటు కస్టమర్లను హ్యాపీగా ఉంచాయి. ఒక్కసారి అలవాటైన తర్వాత డ్రైవర్లు తమ వృత్తిని వదిలి పోలేరు. అటు కస్టమర్లు క్యాబ్‌లు ఎక్కకుండా ఊరుకోలేరు. అయినా నాకెందుకో యాదగిరి మీద జాలి కలగటం లేదు.

'ఇందులో ఎక్కువ డబ్బులు రాకపోతే మానేసి వేరే వ్యాపారం ఏదైనా చేసుకోవచ్చు కదా.. అయినా హైదరాబాద్‌లో 80 వేల క్యాబ్‌లున్నాయట. కొందరు మానేసినా ఏమీ కాదు..' అన్నా. నా గొంతులో తీవ్రత నాకే ఆశ్చర్యం కలిగించింది. యాదగిరి మొహంలో ఎక్కడో బాధ కనిపించింది. 'హైటెక్ సిటీ నుంచి సాయంత్రం ఎప్పుడైనా క్యాబ్ బుక్ చేశారా మేడమ్' అన్నాడు. 'సాయంత్రం నాలుగు నుంచి రాత్రి ఎనిమిది దాకా క్యాబ్‌లు దొరకవు. అన్ని లక్షల మంది ఉన్నారు కదా..' అన్నా. నా మాటలు విని చిన్నగా నవ్వాడు యాదగిరి.

'సిటీలో సగానికి పైగా క్యాబ్‌లు ఈ కంపెనీల కంట్రోల్‌లోనే ఉంటాయి మేడమ్. నాలా సొంతంగా కారు కొనుక్కొని నడిపేవారు సగం మంది ఉంటారు. సాయంత్రం కార్లు బయటకు వదలరు. తక్కువున్నాయని సర్జ్ ప్రైస్ పెడతారు. క్యాబ్‌లు దొరకవు కాబట్టి ఎంత ప్రైస్ ఉన్నా బుక్ చేసుకుంటారు. మాకు ఎక్కువ డబ్బులు ఇచ్చామని తర్వాత తిట్టుకుంటారు' అని తత్వం వివరించాడు. ఆ మాటలు వింటే నాకు చాలా ఆశ్చర్యమేసింది. క్యాబ్ సర్వీసుల వెనక కూడా ఇన్ని వ్యూహాలుంటాయని నాకు తెలియదు.

### వాళ్ల చేతుల్లోనే ఉంది

ట్రాఫిక్ పూర్తిగా తగ్గిపోవటంతో క్యాబ్ వేగం పుంజుకుంది. 'మీ ఆఫీసులో డ్రైవర్ ఉద్యోగం ఉంటే చూడండి మేడం.. వచ్చేస్తా' అన్నాడు యాదగిరి. 'చూస్తా. కానీ మా దగ్గర ఎక్కువ జీతాలుండవు' అన్నా. 'పర్వాలేదు మేడమ్. స్థిరత్వం అయితే ఉంటుంది కదా..' అన్నాడు. 'అయినా నువ్వు బానే సంపాదిస్తున్నావు కదా.. నీ క్యాబ్‌కు నువ్వే రాజావి. కావాలంటే వెళ్లచ్చు.. లేకపోతే మానేయవచ్చు..' అని రెట్టించా. 'అలా అనుకోకండి మేడం. నా లైఫ్ మీద నాకు కంట్రోల్ లేదు. యాప్‌లో చూపించిన రూట్‌లోనే వెళ్లాలి. రోజుకు పది ట్రిప్పులు తప్పనిసరిగా చేయాలి. ఎక్కువసార్లు డిక్లైన్ కొట్టకూడదు. పైగా మీరు పెట్టే స్టార్స్ మీదే మా ఇన్‌సెంటివ్స్ ఉంటాయి. మా జీవితమంతా కంపెనీ చేతిలోనే ఉంది మేడం..' అన్నాడు. ఇంతలో మా ఇల్లు వచ్చేసింది. కిందకి దిగి డబ్బులు ఇచ్చేశా. యాదగిరి ఇంకా నా కేసే చూస్తున్నాడు. 'ఆల్ ది బెస్ట్' అని చెబుదామనుకున్నా. ఎందుకో గొంతులో నుంచి ఆ మాటలు రాలేదు. బహుశా యాదగిరి భవిష్యత్తు మీద నాకు కూడా పెద్దగా ఆశ లేదేమో!

**–సీత**

**email: fbackfm@gmail.com**

# బుల్లిపెట్టెలో బ్లూవేల్ ఛాలెంజ్

గేమ్ బారిన పడి ప్రపంచదేశాల్లో 130 మందికిపైగా మరణించారు. ఈ క్రమంలో ఆ గేమ్ ఏంటి, దానిబారిన పడకుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో మీరూ చదివేయండి!

**ఆటలు పిల్లలకు ఆహ్లాదం కలిగిస్తాయి. ఆరోగ్యాన్నిస్తాయి... మన చుట్టూ ఉన్న సమాజాన్ని, సంప్రదాయాలను, భాషను పరిచయం చేస్తాయి. అసలు ఆటంటే జనం భాషలో వ్యాయామం. ఆటంటే విజ్ఞానం. ఆటంటే ఓ సాహసం, ఓ ఆత్మవిశ్వాసం. చాలామంది గెలవడం కోసమే ఆటలాడుతారు. ఒకవేళ ఓడిపోయినా ఆటనుంచి వచ్చే స్ఫూర్తితో మరింత ప్రయత్నిస్తారు.**

కానీ....ఇప్పుడు కొందరు సైకోలు ఆటకు వికృత భాష్యం చెప్పారు. ఆట అంటే ప్రాణాంతకం! అంటూ ఇంటర్నెట్ సామ్రాజ్యంలో నూతన ఆవిష్కరణల పేరిట మృత్యుక్రీడకు తెరతీశారు. అభంశుభం తెలియని పిల్లల ప్రాణాలు బలి తీసుకుంటున్నారు. ఇంతకు ముందు 'పోకెమాన్ గో' గేమ్ వల్ల చాలా మంది చనిపోయిన సంగతి మనకు తెలిసిందే. అలాంటిదే ఇంకో గేమ్ ఇప్పుడు ప్రపంచాన్ని భయపెడుతోంది. ఆ ఆట పేరే 'బ్లూవేల్'. ఇప్పటికే ఈ

## మృత్యుక్రీడ

నేటికాలంలో ఆటవిడుపుకోసం ఉపయోగించే యాప్‌లు ఆత్మహత్యలకు దారితీస్తున్నాయి. ప్రతి ఇంట్లో పిల్లలు ఏడుపు మానడానికి తల్లిదండ్రులు వాళ్లకు సెల్‌ఫోన్లలో గేమ్‌లు డౌన్‌లోడ్ చేసి ఇస్తున్నారు. ఈ గేమ్స్ ఉచ్చులోపడిన పిల్లలు ప్రపంచాన్నే మరచిపోతున్నారు. ఇందులో కొన్ని గేమ్స్ ఆహ్లాదపరుస్తుంటే, మరికొన్ని ఆత్మహత్యలకు ప్రేరేపిస్తున్నాయి. పిల్లల ప్రాణాలు తీస్తున్న మృత్యుక్రీడ బ్లూవేల్ బారినపడి 10 – 20 ఏళ్ళ మధ్య వయసు పిల్లలే ఎక్కువమంది మరణిస్తున్నారు. ఇతర దేశాలలో దీని ప్రభావం ఎక్కువగా ఉండగా, గడచిన రెండు నెలలుగా ఈ ఆట మనదేశంలో కూడా మహమ్మారిలా మారిపోయింది.

## అసలేంటీ ఆట?

రష్యన్ విశ్వవిద్యాలయంలో సైకాలజీ చదివే ఫిలిప్ బుడికిన్ అనే రష్యన్ విద్యార్థి 2013లో దీన్ని తయారు చేశాడు. ఆ తర్వాత దీన్ని 2015లో రష్యాలోని అతిపెద్ద సోషల్ నెట్‌వర్కింగ్ సైట్‌లో "death group of VKontakte" అనే గ్రూప్‌లో ప్రవేశపెట్టాడు. దీంతో ఇతగాడిని యూనివర్సిటీ నుంచి బహిష్కరించారు. 2015వ సంవత్సరంలో ఈ గేమ్ వల్ల మొదటి ఆత్మహత్య నమోదైంది. బుడికిన్ వల్ల రష్యాలో మొత్తం 16మంది ఆత్మహత్యలకు పాల్పడ్డారు. పోర్చుగల్‌లో కనీసం 90 మంది ఈ ఆట బారిన పడ్డారు.

## క్యూరేటర్ ఎవరు?

ఈ బ్లూవేల్ గేమ్‌ను యాభై రోజులు ఆడాలి. యాభై రోజుల్లో రోజుకో టాస్క్ చొప్పున పూర్తి చేయాలి. టాస్క్ పూర్తయిన తర్వాత మరో టాస్క్‌ని ఇస్తాడు క్యూరేటర్. అలాగే మీరుచేస్తున్న టాస్క్‌లను ఎప్పటికప్పుడు యాప్‌ద్వారా ఫోటోలు తీసి, వీడియోలు తీసి క్యూరేటర్‌కు తెలియజేయాలి. ఇంతకీ క్యూరేటర్ ఎవరంటారా? ఇతను మన గేమ్‌ను ఎప్పటికప్పుడు పరిశీలిస్తూ ఉంటాడు. ఆటకు ఓ బాస్‌లాంటివాడు అని అనుకోవచ్చు. క్యూరేటర్ ఇచ్చే టాస్క్‌లను పూర్తిచేయకుండా మధ్యలో ఆపేస్తే గేమ్‌లో ఓడిపోయినట్లే. ఇక్కడే పిల్లలు ఆటవైపు ఆకర్షితులై, వారిలో గెలవాలన్న పట్టుదల పెరిగిపోతుంది. మొదట్లో చిన్నచిన్న టాస్క్‌లు ఉంటాయి. అంటే ఉదయాన్నే లేవడం, చీకట్లో కూర్చోవడంలాంటివి. ఆ తర్వాత రిస్క్‌శాతం పెరుగుతూ ఉంటుంది. అంటే చేతిమీద కత్తితో తిమింగలం బొమ్మ గీసుకోవడం, బ్లేడుతో పెదాలు కోసుకోవడం, దయ్యం వేషం వేసుకుని అందరినీ భయపెట్టడం, ఇలా ఉంటాయి. ఇక చివరి టాస్క్‌కి వచ్చేసరికి రైలు







పట్టాలపై పడుకోవడం, మేడమీద నుంచి కిందకి దూకి చనిపోమ్మని ఉంటుంది. ఒకవేళ అలా చేయక పోతే ఓడిపోయినట్లే. భావావేశంతో సాగిపోయే ఈ ఆట మోజులో పడి చాలామంది తమ ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు.

### బ్లూవేల్‌తో బలవన్మరణం

విజయవంతంగా టాస్కులు పూర్తిచేసినవారు సోషల్ మీడియాలో పోస్టింగ్స్ పెట్టడంతో కొత్త వారు తాము కూడా చెయ్యాలని ఉత్సాహ పడి దీని బారినపడుతు న్నారు. ఇలా ఇది మన దేశంలో వ్యాపించింది. మన దేశంలో మధ్య ప్రదేశ్, పశ్చిమబెంగాల్, ముంబై, అంధేరీ, ఇండోర్, షోలాపూర్, వెస్ట్ మిడ్నాపూర్, తిరువనంతపురంలలో అనేకమంది ఈ బ్లూవేల్ ఛాలెంజ్ టాస్క్‌ల బారిన పడి మరణించారు. ఎక్కువగా సంపన్న కుటుం బాల పిల్లలే ఈ గేమ్‌కు బానిసలై మృత్యుకౌగిలి లోకి చేరుతున్నారు.



### చెప్పిమరీ ఆత్మహత్య

ముంబై అంధేరీ ప్రాంతానికి చెందిన 14 ఏళ్ళ విద్యార్థి మన్‌ప్రీత్ ముందుగానే అందరికీ చెప్పిమరీ భవనంమీద నుంచి దూకి మరణించాడు. 50వ రోజు క్యూరేటర్ ఇచ్చిన టాస్క్ ప్రకారం తాను భవనంమీద నుంచి దూకుతున్నట్టు స్నేహితులకు మెసేజ్‌లు పెట్టాడు. దీన్ని వాళ్ళు లైట్‌గా తీసుకు న్నారు. కానీ మన్‌ప్రీత్ అన్నంతపనీ చేశాడు. షోలాపూర్‌కు చెందిన మరో విద్యార్థి సుధీర్ క్యూరే టర్ ఆదేశం మేరకు ఇంట్లోంచి పారిపోయాడు. తనకోసం వెతకవద్దని, ఆత్మహత్య చేసుకుంటున్నా నని తల్లిదండ్రులకు లేఖరాసి పెట్టాడు. తల్లి దండ్రులు పోలీసులను ఆశ్రయించగా, వారి గాలింపులో సుధీర్ ఎట్టకేలకు దొరికాడు. టాస్క్‌లో గెలిచేందుకే తాను ఆత్మహత్య చేసుకోదలిచానని అతడు పోలీసులకు చెప్పాడు. తిరువనంతపురానికి చెందిన పదహారేళ్ళ మనోజ్ బ్లూవేల్ టాస్క్ చెప్పిన ప్రకారం ఉరివేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. పిల్లాడు చాలా రోజులుగా ఒంటరిగా ఉండటం, మౌనంగా ఉండటం చూసి అనారోగ్యంవల్ల అలా ఉన్నాడని తల్లి భావించిందట.

ఇప్పటికే డ్రగ్స్, మత్తుమందులు వంటివి స్కూళ్లవరకు ప్రవేశించడంతో తల్లిదండ్రులు తమ పిల్లలను ఎలా కాపాడుకోవాలో తెలియక భయాం దోళనకు గురవుతున్నారు. ఇప్పుడు కొత్తగా పులి మీద పుట్రలా బ్లూవేల్ ఛాలెంజ్ రావడంతో దీన్ని ఎలా ఎదుర్కోవాలో తెలియక తల్లిదండ్రులు గందర గోళంలో పడిపోతున్నారు. ఈ పరిస్థితుల్లో తల్లి దండ్రులపైనే ఎక్కువ దృష్టి కేంద్రీకరించాలని నిపు ణులు భావిస్తున్నారు. అందుకై తగిన చర్యలు తీసుకుంటున్నారు.

### గూగుల్‌మాతకే వదిలేయకండి

తల్లి, తండ్రి, గురువు, దైవం అనేవారు పూర్వం. ఇప్పుడు ఆ జాబితాలో వీరందరినీ తలదన్నేలా గూగుల్‌మాత వచ్చి చేరింది. ఇంటర్నెట్ సమాచా రాన్నే ప్రామాణికంగా స్వీకరిస్తోంది నేటి యువత. దీనివల్ల తల్లిదండ్రులు చెప్పే విషయాలతో ఒక్కొ క్కసారి విభేదిస్తున్నారు కూడా. అదేకాకుండా రోజు వారీ కార్యక్రమాల్లో బిజీగా ఉండడం వల్ల కొందరు పేరెంట్స్ శ్రద్ధతో ప్రతి చిన్న విషయాన్ని నేర్పించే అవకాశాలు లేకపోవడం వల్ల పిల్లలకు, పేరెంట్స్‌కి మధ్య ప్రేమానురాగాలు పటిష్ఠం కావడం లేదు. వారమంతా అలసిపోయే తల్లిదండ్రులు వీకెండ్‌లో తమదైన ఎంటర్‌టైన్‌మెంట్ వెతుక్కోవడం, దొరికిన సమయంలో పిల్లలపై దృష్టి పెట్టలేకపోవడం కూడా పెద్ద సమస్యగా మారిందని నిపుణులు అంటున్నారు. దాంతో వారు ఒంటరై ఇలాంటి గేమ్స్ పట్ల ఆకర్షి తులవుతున్నారు. అందువల్ల తల్లిదండ్రులు పిల్లల భారమంతా గూగుల్‌మాతకే వదిలేయకుండా పిల్లల కోసం ప్రత్యేక సమయం కేటాయించడమే ఏకైక పరిష్కారమని నిపుణులు సూచిస్తున్నారు.

### తల్లిదండ్రులకు గైడెన్స్

* తల్లిదండ్రులు ఎప్పటికప్పుడు పిల్లల్ని కని పెడుతూ, వారికి సమయం కేటాయించాలి. ఎప్పుడూ వారిని వారిగదులకే పరిమితం చేయ కుండా పదిమందిలో ఎక్కువసేపు గడిపేలా చూడాలి.
* పిల్లలు తమ కనుసన్నల్లో ఉండేలా చూసుకోవాలి.
* ఆఫీసులలో ఉండే తల్లిదండ్రులు ఆధునిక సదుపాయాలు ఉపయోగించుకోవడం ద్వారా స్కైప్‌లో పిల్లలను మానిటర్ చేస్తూ ఉండాలి. వారికి ఎప్పటికప్పుడు ఆదేశాలు జారీ చేస్తూ ఉండాలి.
* పూర్వపు కుటుంబ పద్ధతులను అవలంబిం చడం ద్వారా పిల్లల్ని తమ కంట్రోల్‌లోకి తెచ్చు కోవాలి. అంటే వారితో కలిసి భోజనం చేయడం, స్కూల్లో ఏం జరిగింది? ఈ రోజు ఎలా ప్రవర్తిం చారు? వారి ఫ్రెండ్స్‌తో ఎలా గడిపారు? లాంటి విషయాలు చాకచక్యంగా ప్రశ్నిస్తూ వారికి కొత్త అభిరుచులను నేర్పించాలి.
* కేవలం మొబైల్ గేమ్స్ కాకుండా శారీరకంగా, మేధస్సుకు పదునుపెట్టే విషయాలను కూడా వారికి నేర్పించాలి.

-రామ్మోహన్

## ఊచలు లెక్కెడుతున్న బుడికిన్



బ్లూవేల్ మృత్యుక్రీడను సృష్టించిన ఫిలిప్ బుడికిన్‌ను రష్యన్ పోలీసులు అరెస్టు చేశారు. మే 11న న్యాయస్థానం అతడికి మూడేళ్ళు కఠినశిక్ష విధించింది. ఇప్పుడతను సైబీరియా జైలులో ఊచలు లెక్కపెడుతున్నాడు. మొదట్లో ఈ ఆట ఆడేందుకు ఆతడే అంతర్జాలంలో స్వయంగా టాస్కులు ఇస్తూ ఆదేశాలు జారీ చేసేవాడు. అతడు అరెస్టయ్యాక ఆ క్యూరేటర్ పని ఎవరు చేస్తు న్నారో తెలియడంలేదు. ఇప్పుడు కూడా అంతర్జా లంలో క్యూరేటర్ టాస్కులు ఇస్తున్నాడు. #bluwhalechallenge, #curatorfind me #i_am_whale act లాంటి హ్యాష్ ట్యాగ్‌లతో క్యూరేటర్ నుంచి సూచనలు వస్తున్నా యట. సమాజాన్ని ప్రక్షాళన చేయడమే ఈ సైకో బుడికిన్ లక్ష్యమట. అరెస్టయిన తర్వాత కూడా అతడు తనను తాను సమర్థించుకుంటున్నాడు.

## ఇంటర్నెట్ వినియోగం

ప్రాణాంతకమైన బ్లూవేల్ గేమ్‌లింక్‌ను అన్ని సైట్స్ నుంచి తొలగించాలని ప్రభుత్వం ఇప్ప టికే కట్టడి చేసింది. మరోవైపు సెంట్రల్ బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ (సి.బి.ఎస్.ఇ) కూడా మార్గ దర్శకాలు జారీ చేసింది. సురక్షితమైన ఇంటర్నెట్ వినియోగంపై పిల్లలకు అవగాహన కల్పించాలని పేర్కొంది. స్కూళ్ళలో ఇంటర్నెట్ వినియోగంపై దృష్టి సారించి, ఎప్పటికప్పుడు పరిశీలిస్తుండాలని తెలిపింది.

పిల్లల వయసుకు తగినట్టు ముందుగా ఎంపిక చేసిన వెబ్‌సైట్లను చూసేవిధంగా అనుమ తించాలనీ, ఇంటర్నెట్ వినియోగంపై బోధన, బోధ నేతర సిబ్బందితోపాటు తల్లిదండ్రులకు కూడా అవ గాహన కల్పించాలని సూచించింది. పాఠశాల ఆవరణలో, తరగతి గదుల్లో సెల్‌ఫోన్ల వినియో గాన్ని రద్దుచేస్తూ 2009లో జారీచేసిన తమ మార్గదర్శకాలను తు.చ తప్పకుండా అమలు చేయాలని కూడా ఆదేశించింది. సీడాక్ కూడా దీనిపై తల్లిదండ్రులకు హెచ్చరికలు చేసింది. పిల్లల్ని ఒంటరిగా కూర్చోవడం, ఒంటరిగా కూర్చుని ఏడ వడం, గంటలు గంటలు ఏకాంతంగా గడపడం వంటి వాటికి దూరంగా ఉంచాలని పేర్కొంది.






## బేబీ వాకర్లు వద్దు



పిల్లలకి నడక వచ్చే సమయంలో వారికి వాకరు అలవాటు చేస్తారు తల్లిదండ్రులు. వారు అందులో కూర్చుని ఇల్లంతా తిరుగుతుంటే చూసి మురిసిపోతారు. తల్లిదండ్రులకి ఆనందాన్నీ, పిల్లలకి సౌకర్యాన్నీ అందించే ఈ వాకరు అంత మంచిది కాదంటున్నారు పరిశోధకులు. పిల్లలకి వాకరు అలవాటు చేయడం వలన వారిలో ఎదుగుదల తగ్గిపోతుందని ఇంగ్లాండ్ పరిశోధకులు చెబుతున్నారు. దాదాపు 190 మంది చిన్నారుల మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరిని వాకరులో తిరగనిచ్చారు. మరికొందరికి వాకరు ఇవ్వలేదు. కొన్ని నెలల అనంతరం ఈ పిల్లల ఎదుగుదలను గమనించారు. వాకరు వాడని పిల్లలు త్వరత్వరగా కూచోవడం, నిలబడడం, నడవడం నేర్చుకుంటే వాకరు ఉపయోగించిన పిల్లలు పై మూడు విషయాల్లో వెనుకపడ్డారు. దీనికి కారణం వారిని వాకరులో కూచోపెట్టడమే అంటున్నారు అధ్యయనకారులు. పిల్లలు అన్ని విషయాలను స్వతహాగా నేర్చుకున్నప్పుడే వారిలో ఎదుగుదల సక్రమంగా ఉంటుందని స్పష్టం చేస్తున్నారు.

## సెల్ఫీతో ముడతలు

సెల్ఫీ దిగడం ఇప్పుడు ఒక ఫ్యాషన్. ఎక్కడున్నా ఏ పని చేస్తున్నా సెల్ఫీ దిగడం చాలామందికి అలవాటు. ఈ అలవాటు ముఖం మీద ముడతలకు కారణం అవుతుంది అంటున్నారు బ్రిటన్ నిపుణులు. సెల్‌ఫోన్ నుంచి వెలువడే రేడియేషన్ కారణంగా చర్మం ముడతలు పడుతుందనీ, ఏ వైపు సెల్ఫీ తీసుకుంటున్నారో ఆ వైపు ముఖం మీద చర్మం ముడతలు పడుతుందనీ వారు హెచ్చరిస్తున్నారు. ఫోన్ల నుంచి వెలువడే నీలిరంగు కాంతి చర్మానికి హాని కలిగిస్తుందని వారు చెబుతున్నారు. అంతే కాకుండా ఫోను నుంచి వెలువడే ఎలక్ట్రో మాగ్నేటిక్ రేడియేషన్ కారణంగా డీఎన్ఏ దెబ్బతినే ప్రమాదం కూడా పొంచి ఉందని వారు హెచ్చరిస్తున్నారు. అందువలన ఎంతో అవసరం అయితే తప్ప సెల్ఫీలు దిగకుండా ఉంటేనే మంచిదని వారు సూచిస్తున్నారు.



## మందుతో జ్ఞాపకశక్తి!

వినడానికి ఇది ఆశ్చర్యంగా ఉన్నా నిజమే అంటున్నారు ఇంగ్లాండులోని ఓ యూనివర్సిటీ అధ్యయనకారులు. మద్యానికీ, జ్ఞాపకశక్తికీ ఉన్న సంబంధాన్ని పరిశీలించాలని అనుకున్నారు. ఇందుకోసం 88 మందిని ఎన్నుకున్నారు. వీరికి కొన్ని కొత్త పదాలను నేర్పించారు. అనంతరం కొందరిని పరిమిత మొత్తంలో మందు తాగమన్నారు. మరికొందరిని తాగవద్దని చెప్పారు. అనంతరం వీరి జ్ఞాపకశక్తిని పరిశీలించగా, మందు తాగిన వారు నేర్చుకున్న కొత్త పదాలను గుర్తు పెట్టుకోగా, తాగనివారు ఆ పదాలను గుర్తుపెట్టుకోలేకపోయారు. మందు తాగే సమయంలో మెదడులో ఏ సమాచారమూ నిక్షిప్తం కాదనీ, కేవలం అంతకుముందు నేర్చుకున్నదీ, విన్న సమాచారమే గుర్తు ఉంటుందనీ వీరు చెబుతున్నారు. మెదడులోని హిప్పోకేంపస్ దీర్ఘకాలిక జ్ఞాపకాల మీద కేంద్రీకరిస్తుందనీ వారు అంటున్నారు. అలాగని జ్ఞాపకశక్తి కోసం మందుని ఆశ్రయించడం మంచిది కాదని కూడా వారు చెబుతున్నారు. ఈ విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని అంటున్నారు.

## గురకతో మతిమరుపు?



గురక ఇతరులను ఇబ్బంది పెట్టడమే కాకుండా గురక పెట్టేవారిని కూడా తీవ్ర ఇబ్బందులకు గురి చేస్తుందంటున్నారు అమెరికా పరిశోధకులు. పెద్ద శబ్దంతో గురక పెట్టేవారిలో మతిమరుపు వస్తుందన్న విషయం వీరి అధ్యయనాల్లో వెల్లడైంది. మతిమరుపుతో పాటు వీరిలో ఆలోచనా శక్తి కూడా సన్నగిల్లుతుందని అంటున్నారు. అమెరికాలోని హార్వర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన పరిశోధకుల బృందం 68 సంవత్సరాల వయస్సు కలిగిన సుమారు 1800 మంది మీద అధ్యయనం నిర్వహించింది. వీరిలో చాలామందికి పెద్ద శబ్దంతో గురక పెట్టే అలవాటు ఉంది. వీరిలో క్రమేపీ మతిమరుపు, ఆలోచనాశక్తి సన్నగిల్లడాన్ని వీరు గుర్తించారు. సాధారణంగా 80 సంవత్సరాల తరువాత కనిపించే ఈ లక్షణాలు వీరిలో త్వరగా కనిపించడానికి గురకే కారణమని చెబుతున్నారు. వీరిలో కనిపించిన పై లక్షణాలకూ గురకకూ కచ్చితంగా సంబంధం ఉందా? లేదా? అన్న విషయం మీద ఇంకా అధ్యయనాలు నిర్వహించాలని వారు స్పష్టం చేస్తున్నారు.

—అవినాష్






## ఇన్‌స్టాల్‌మెంట్ స్టోర్

కార్పొరేట్ విద్య సామాన్యుడికి అందని ద్రాక్ష! ఫీజులు ఆకాశమంత పెరుగుతున్నా తల్లిదండ్రులు తమ పిల్లలను కార్పొరేట్ స్కూళ్ళు, కాలేజీల్లోనే చేర్పిస్తు న్నారు. ఫీజులు, పుస్తకాలు, ఎక్విప్‌మెంట్లు సమకూర్చ డానికి నానాతంటాలు పడుతున్నారు. జీతాల మీద బతుకుబండిని నడిపేవారికయితే, నెలమధ్యలో వారి చదువు అవసరాలు తీర్చడం చాలా కష్టం. సరిగ్గా ఈ సమస్యని బేస్ చేసుకుని పుట్టిందే క్రేజీబీ స్టార్టప్. ఇది విద్యార్థులకు వాయిదాల పద్ధతి మీద పర్సనల్ లోన్లు అందిస్తుంది. అంతేకాదు ఇండియాలోనే మొట్టమొదటి సారిగా విద్యార్థుల కోసమే పెట్టిన ఆన్‌లైన్ ఇన్‌స్టాల్ మెంట్ స్టోర్ క్రేజీబీ. దీన్ని మధుసూదన్ స్టార్ట్ చేశాడు. ఈ స్టార్టప్ ఏర్పాటుకి దోహదం చేసింది మాత్రం చైనా లోని యూనికార్న్ ఫెన్నెల్ సంస్థ. అది కూడా అక్కడి విద్యార్థులకు వాయిదాల రూపంలో పర్సనల్ లోన్లు




ఆఫర్ చేస్తుంది. విచిత్రం ఏంటంటే ఫెన్నెల్ సంస్థ సీఈవో క్రేజీబీకి రెండు మిలియన్ డాలర్ల సీడ్ క్యాపిటల్ సమకూర్చాడు. అదే కాకుండా క్రేజీబీతో రుణాలిచ్చే ఆరు సంస్థలు టై అప్ అయ్యాయి.

ఇవాళ రేపు ఉద్యోగం చేసి, నెలకు ఠంచనుగా జీతం బ్యాంకులో పడ్డా, కనీసం పర్సనల్ లోన్ ఇవ్వడానికి కూడా సవాలక్ష ఆంక్షలు పెట్టే రోజులివి. అలాంటిది ఏ సంపాదనా లేకుండా కేవలం చదువుకునే కుర్రాళ్లకు లోన్లు ఇచ్చే సంస్థలు చాలా తక్కువ. అలాంటి వాటిలో ఒకటి క్రేజీబీ. కేవలం విద్యార్థి అయితే చాలు.. ఎలాంటి క్రెడిట్ హిస్టరీ లేకుండా లోన్ ఇస్తారు.

సెమిస్టర్ ఫీజులకు, ఎలక్ట్రానిక్ గ్యాడ్జెట్లు అంటే పర్సనల్ కంప్యూటర్లు, ల్యాప్‌టాప్‌లకు, టూవీలర్ లోన్లు ఇస్తారు. స్టూడెంట్ పేకార్డ్ ప్రోడక్ట్ విత్ వాలెట్ లైసెన్స్ సౌకర్యాన్ని కల్పిస్తున్నారు. అంటే ఎంత మొత్తం లోన్ ఇవ్వాలనుకుంటారో అంత 'అమౌంట్ కార్డు' విద్యార్థికి ఇస్తారు. అంటే క్రెడిట్ కార్డులాగానన్నమాట. ప్రస్తుతం క్రేజీబీ నాలుగు నగరాల్లో విజయవంతంగా పని చేస్తోంది. బెంగళూరు, పుణె, మైసూరు, వేలూరులో బ్రాంచీలున్నాయి. మరో పది నగరాల్లో విస్తరించాల న్నది ప్లాన్. హైదరాబాద్ సహా, ముంబై, చెన్నయ్, నాగ్‌పూర్, నాసిక్, మణిపాల్‌లలో క్రేజీబీ కార్యకలాపాలు సాగించాలని చూస్తోంది. క్రేజీబీలో 80 మంది సభ్యులు ఉన్నారు. ఎడ్యుకేషనల్ ఇకో సిస్టమ్‌లో ప్రతీ విద్యార్థికి అందుబాటులో ఉండాలన్నదే వీరి లక్ష్యం.

—లక్ష్మీశ్రీ నర్మద

## పుస్తక సమీక్ష



**కామెడీ కథలు**
కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు
**ధర:** 150 రూపాయలు, **పేజీలు:** 234

**మృగతృష్ణ** కథల సంపుటి
కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు
**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 166

**ఓం శాంతి! ఓం శాంతి!**
కొచ్చర్లకోట వెంకట సుబ్బారావు
**ధర:** 125 రూపాయలు, **పేజీలు:** 184
**ప్రతులకు:** రచయిత, ఇంటినెంబరు 5, పదవ వీధి, న్యూ కాలనీ, భారతీనగర్, విజయవాడ–08
**సెల్:** 94405 44614

యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ వంటి యోగ్యుడైన గొప్ప శిష్యుణ్ణి పొందిన గురువు, కథ, నవల, నాటక రచయిత, అనువాదకుడు కొచ్చర్లకోట వెంకట సుబ్బారావుగారు. ఆయన రాసిన మూడు కథా సంపుటాలివి. వీటిల్లో మొదటిది కామెడీకథల సంపుటి. రాజకీయ, హాస్య వ్యంగ్య రచయితగా ఆయన సత్తాచాటిన పాతిక కథలివి. మరొకటి 32 కథలున్న 'మృగతృష్ణ' కథల సంపుటి. మాన, ప్రాణాపద సమయంలో సైతం సంఘ కట్టుబాట్లు పాటించిన స్త్రీ ఆలోచనలకు దర్పణం టైటిల్ కథ 'మృగతృష్ణ'. విలువలకు పెద్దపీట వేసిన కథలే ఇవన్నీ. ఇంకొకటి 17 కథలున్న 'ఓం శాంతి! ఓం శాంతి!' కథల సంపుటి. ఇవన్నీ పలు పత్రికల్లో వచ్చినవే. ఇందులోని టైటిల్ కథ ఒక వ్యవస్థ వైఫల్యాన్ని కళ్ళకు కడుతుంది. వ్యంగ్యధోరణి కథలివి.



భారతీయ సాహిత్య నిర్మాతలు
**ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ**
**రచన:** సి.భవానీదేవి
**ధర:** 50 రూపాయలు
**పేజీలు:** 132
**ప్రతులకు:** సాహిత్య అకాడమీ, రవీంద్రభవన్, ఫిరోజ్‌షారోడ్, న్యూఢిల్లీ–01
http://www.sahitya-akademi.gov.in

ఆధునిక సాహిత్యచరిత్రలో కనకాభిషేకం పొందిన ఏకైక రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ గారు. సాహితీరుద్రమగా చిరస్మరణీయురాలు. ఆంధ్రసరస్వతి, అపర వాగ్దేవి, కళాప్రపూర్ణగా కీర్తి గాంచిన బహుముఖ ప్రజ్ఞాశాలి, స్వాతంత్ర్య సమర యోధురాలు. సంస్కృత కావ్యాలతోపాటు తెలుగులో ఎన్నో ప్రక్రియల్లో రచనలు చేశారు. ఆమె జీవిత యానమే ఈ పుస్తకం.

**సహనాభవతు**
విరించి
**ధర:** 150 రూపాయలు, **పేజీలు:** 264
**ప్రతులకు:** సాహితి ప్రచురణలు, 29–13–53, కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావుపేట, విజయవాడ–02 **ఫోన్:** 0866–2436643

సమాజ శ్రేయస్సును కోరుకునేవాడు రచయిత. తన రచనలతో సమాజాన్ని రిపేరు చేసేవాడు రచయిత. 'విరించి' కలంపేరిట ప్రసిద్ధికెక్కిన తల్లాప్రగడ గోపాలకృష్ణ కథలు చదివితే ఇలాగే అనిపిస్తుంది. విరించి ఈ తాజా పుస్తకంలోని 25 కథలు చదివితే మనం ఎదుర్కొనే, మనకు తెలియని సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయి.



టైటిల్‌కథ 'సహనాభవతు' ట్విస్టులమీద ట్విస్టులతో సాగే కథ. ఇంటిని చక్కదిద్దే ట్రబుల్‌షూటర్‌గా ఇందులో అమ్మలుపాత్ర మనల్ని ఆకట్టుకుంటుంది.

## స్వీకారాలు

**గునుగు పూల పొద్దు**
హైదరాబాద్ కవుల వేదిక
**ధర:** 60 రూపాయలు, **పేజీలు:** 128
**ప్రతులకు:** డా.ఏనుగు నరసింహారెడ్డి, **సెల్:** 89788 69183, పాలపిట్టబుక్స్, విజయ సాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట, హైదరాబాద్–36 **ఫోన్:** 040–27678430.

**అంతర్వాణి**
కొసరాజు కృష్ణప్రసాద్
**ధర:** 40 రూపాయలు
**పేజీలు:** 122
**ప్రతులకు:** జ్యోతి వలబోజు, జె.వి.పబ్లికేషన్స్, హైదరాబాద్ **సెల్:** 80963 10140
రచయిత **సెల్:** 73278 18298

**విప్లవ సూర్యుడు**
జాని బాషా చరణ్, తక్కెడశిల
**ధర:** 100 రూపాయలు
**పేజీలు:** 104
**ప్రతులకు:** జ్యోతి వలబోజు, హైదరాబాద్ **సెల్:** 80963 10140, అన్ని ప్రధాన పుస్తక దుకాణాలు

—లలితా త్రిపురసుందరి

# కంచికి చేరిన కథ

-ఎం.వి.వి.సత్యనారాయణ

**సరళ అయోమయంగా చూసింది.**

**తన భర్త ఏం మాట్లాడతాడో ఆమెకు ఎన్నడూ అర్థం కాదు. అతడిని తన భర్త అనకూడదేమో! అవును. ఇంకా నూటికి నూరుశాతం తనకు భర్తకాదు. "మనం పెళ్ళి చేసుకుందాం!" అని గత రాత్రే అడిగింది సరళ. ఆరునెలలనుంచీ ఆమె పెళ్ళిగురించి పోరుపెడుతూనే ఉంది. కాని ప్రసాదరావే ఒప్పుకోవడం లేదు. రాత్రికూడా అలాగే అన్నాడు.**



"ఎందుకంతగా తినేస్తావు! ఇప్పుడు మనకి పెళ్ళి తంతు అంత అవసరమా?" అన్నాడు ప్రసాదరావు.

"ఆరునెలలైంది, నన్ను పెళ్ళి చేసుకుంటానన్నావు కాబట్టే నీతో సహజీవనానికి ఒప్పుకున్నాను. ఏ రోజు కారోజు వాయిదావేస్తూ పోతున్నావు!" అంది సరళ.

'అతడితో కలిసి బతకడానికి ఒప్పుకుని తాను తప్పు చేయలేదుకదా! తాను ఎందువల్ల అంత తొందర పాటు నిర్ణయం తీసుకుంది!' లోపల్లోపల ఆమెకు సంకోచంగానే ఉంది.

సరళను తనవైపు తిప్పుకున్నాడు ప్రసాదరావు. ఆమె అయిష్టత ప్రదర్శించింది. అయినా అంత సులువుగా ఒప్పుకునే రకం కాదు. కానీ లైంగికవాంఛ తీర్చుకోవడంలో అతడు ప్రదర్శించే ఒడుపే వేరు. పావు గంట తర్వాత ఆమె నీళ్ళగదికి పోయివచ్చింది.

"పశుబలం ప్రదర్శించడం గొప్ప అనుకుంటున్నావు!" ఆక్షేపించింది సరళ. నిజానికి అతడు పసికట్టింది ఆమె బలహీనతనే. అతడితో సుఖపడటంలో ఆమె వెనుకంజ వేయదు.

ఆమె చెక్కిళ్ళు సుతారంగానొక్కి వదిలిపెట్టాడు.

"నేనంటే నీకు ప్రాణం కదూ!" అన్నాడు ఆమె కురులు సవరిస్తూ.

"పెళ్ళి సంగతి మాట్లాడవేం?" అడిగింది సరళ అతడి నుండి విడిగా జరిగి.

"నా మీద నీకు నమ్మకం లేదా?"

"నమ్మకం తగ్గిపోతోంది"

"ఒక్కమాట చెప్పు సరళా! ఇప్పుడు మనం పెళ్ళి చేసుకోవడం అంత ముఖ్యమా? చేసుకుని ఎవరిని నమ్మించాలి? ఎవరిని కలుపుకోవాలి?"

"సమాజంలో మనకు గౌరవం అక్కర్లేదా?"

"గౌరవం! ఇప్పుడు మనల్ని ఎవరు గౌరవించాలి? మనం ఎవరి నుండి మర్యాద ఆశించాలి? ఇప్పుడు పెళ్ళి చేసుకుని, ఇంత కాలం సహజీవనం చేశాం అని తెలియచెప్పాలా? ఇక ఇప్పటినుంచీ మనం కొత్తగా కనిపించాలా?"

అతడి వాదన సరళకు ఎప్పుడూ అర్థంకాదు. మనుషులు జతకట్టడానికి వివాహబంధం ఒక గౌరవప్రదమైన వ్యవస్థ. అలాంటి వ్యవస్థను గడ్డిపరకలా తీసిపారేస్తాడు ప్రసాదరావు. 'అయితే తనను పెళ్ళి చేసుకోడా ఏం? అదే నిజమైతే తమ శారీరక సంబంధం కేవలం వ్యభిచారం అవ్వదా!' అతడికి చెప్పదగిన సమాధానం ఆమెదగ్గర ఉంది. ఎన్నోసార్లు ఇచ్చే సమాధానం అదే. కాని ఇప్పుడు మాత్రం అదే సమాధానం ఆమె తిరిగి ఇవ్వలేదు.

"మాట్లాడవేం?" అడిగాడు ప్రసాదరావు.

ఆమె మంచం దిగింది. తన మనస్సు మొత్తం ఖాళీ అయిపోయిన భావన ఆమెను కలవరపెడుతోంది. ప్రసాదరావు తనను చాలా దారుణంగా లొంగదీసుకున్నాడు. ఒకరకంగా తన తప్పుకూడా ఉందని ఆమెకు తెలుసు. తమ ఇద్దరికీ పెళ్ళి ఎలా జరుగుతుందో మాత్రం ఆమెకు తెలియడం లేదు.

"రేపు ఉదయం మనం ఆశ్రమానికి వెళ్తున్నాం!"

అన్నాడు ప్రసాదరావు.

"అలాగే. ఎంత త్వరగా గడిచిపోయింది వారం!" అంది సరళ.

"ఎందుకు గడవదూ. మనం సుఖంగా బతుకుతున్నాం కాబట్టి కాలం చాలావేగంగా పరుగులు తీస్తుంది. నువ్వు ఈ ఇంట్లో అనుభవిస్తున్న దర్జా అంతా ఆమెది! నిన్ను ఆమె స్థానంలోకి రప్పించడానికి అనేక రకాల సర్దుబాట్లు చేసుకుంటున్నాను!"

సరళ చురుకుగా చూసింది. 'అతడి మొదటి భార్య అనుభవించవలసిన దర్జా అంతా తాను అనుభవిస్తోందా! అంటే ఆమె హోదాను తాను దోచుకోవాలని వచ్చిందా! అతడి ప్రమేయం లేకుండానే తాను ఈ ఇంటి పెత్తనానికి వచ్చిందా! అతడు ఎంత క్రూరమైన ఆలోచనలతో, నమ్మకాలతో ఉన్నాడు?' మగవాడు పగవాడు అని ఆమె నిర్ధారణకు వచ్చేలోగా నిద్రలోకి జారుకుంది.

పెదవాల్తేరు గ్రామంలో సముద్రం వారగా ఉంది ఆశ్రమం. ఇసుకపర్రల మీద సరుగుడు తోటల మధ్య మనోహరమైన దృశ్యాల నేపథ్యంలో నిర్మితమైన ఆశ్రమం అది.

ఆశ్రమ ద్వారం ఇవతల పార్కింగ్‌స్థలంలో కారు ఆపాడు ప్రసాదరావు. సరళ దిగింది. కారుదిగి కారుకు తాళంపెట్టి ప్రసాదరావు ఆమెతో కలిసి ఆశ్రమంలోకి నడిచాడు. లోపలికి దారితీసే బాటకు ఇరువైపులా కాడమల్లెచెట్లు బారులుతీరి నిలబడ్డాయి.

మొక్కలకు పాదులు చేస్తోంది కాంతామణి. వేళ్ళవరకూ క్షీణించిపోయిన చేతులతో మొక్కలకు పాదులు చేస్తోంది. ఆమె చేతులు మొండిగా ఒక కొయ్య గరిటెను పట్టుకున్నాయి. తన రెండు అర చేతుల్లోని శక్తిని కేంద్రీకరించి మరీ పాదులు చేస్తోంది కాంతామణి. ఆమె అంతకుముందే ఏర్పాటుచేసిన బోదెలలోంచి నీరు ప్రవహిస్తోంది.

మధ్యమధ్య నీటిని కొయ్యగరిటెతో దారి మళ్లిస్తోంది. ఒకటీ అరా మొక్కలు ఒరిగిపోతూంటే వాటిని నిలబెట్టి కుదుళ్లదగ్గర మట్టిని చేరుస్తోంది. ఆమె రెండు పాదాలకూ పాతబడిపోయిన మట్టి రంగు గుడ్డబూట్లున్నాయి. మోచేతులకూ, చీలమండలకూ గుడ్డలతో కట్లు ఉన్నాయి. మొహంమీద కూడా ముక్కుపుటాలూ, పెదిమలూ కనిపించకుండా గుడ్డ పొరలు కట్టి ఉన్నాయి.

ఒక తోటమాలి హడావుడిగా వాళ్ళవైపు వచ్చాడు. 'ఎవరు కావాలండీ?' అన్న తరువాత ప్రసాదరావును గుర్తుపట్టి దారిచ్చి తప్పుకున్నాడు. కాంతామణిని సమీపించారు ప్రసాదరావు, సరళ.

"ఎలా ఉన్నారు?" అడిగింది కాంతామణి.

వాళ్ళు నవ్వారు. ఆమెను చెయ్యిపట్టుకుని, దగ్గరకు తీసుకుంటూ నడిపించింది సరళ. సరుగుడు వనంలో ఒక సిమెంట్ బల్లమీద ముగ్గురూ కూర్చున్నారు. కాంతామణి వాళ్ళమధ్యలో కూర్చుంది. ఆమె సంకోచంతో ముడుచుకుపోతోంది.

"భోజనం బాగా సహిస్తోందా?" అడిగాడు ప్రసాదరావు.

కాంతామణి తాత్వికభావనతో నవ్వు తెచ్చుకుంది. అదే నవ్వు కొనసాగుతుండగా, "మందులు వాడుతున్నాను కదా! నాలుక రుచి తప్పింది!" అంది. ఆమె మొహంలో విషాద ఛాయలు వెతుక్కున్న ప్రసాదరావుకది విఫలప్రయత్నమే అయ్యింది. అతడు సంతోషించాడు.

ప్రసాదరావు తన చేతిలోని అట్టపెట్టె తెరచి ఒక మిఠాయితీసి ఆమె నోటి దగ్గరుంచి, "నోరు తెరు!" అన్నాడు మృదువుగా.

కాంతామణి మిఠాయి తింటోంది. సరళ ఆమె చేత మంచినీరు తాగించింది. కాంతామణి లేచింది. ముగ్గురూ కలిసి ఆమెకు కేటాయించిన కాటేజీలో కూర్చున్నారు.

"చెల్లెలిని మీరు ఎప్పుడు పెళ్ళి చేసుకుంటున్నారు?" అడిగింది కాంతామణి.

'తెలియనివాడికి కూడా తెలియచెప్పినట్టవుతుంది కదా!" అన్నాడతడు.

ఆడవాళ్ళిద్దరూ తెల్లబోయి చూశారు.

"తెలివితేటలు మీ ఒక్కరిసొత్తే అనుకుంటున్నారా? ఆరు నెలలుగా ఆమె మన ఇంట్లోనే ఉంటోంది. చూసేవాళ్ళు ఏమను కుంటారు?" అడిగింది కాంతామణి.

ప్రసాదరావు మొహం మాడిపోయింది.

"అర్జంటుగా నాకు విడాకులిచ్చెయ్యండి. మీరు ఎంత ప్రభుత్వ ఉద్యోగి అయినా మొదటి భార్య అనుమతి ఇచ్చినా రెండోపెళ్ళి చేసుకునే వీలు లేనంత ప్రముఖమైన ఉద్యోగం కాదు. న్యాయవాదిని అడిగి మీకు కావలసిన పద్ధతిలో నాచేత అంగీకార పత్రం రాయించుకోండి!"



కాంతామణి మాటలువిని ప్రసాదరావుకు నోట మాట పడిపోయింది.

"సరళను మీకు పరిచయం చేసింది నేనే. ఆమెకు ఒక ఆశ్రయం అవసరం కాబట్టే మీతో పెళ్ళికి ఒప్పించాను. సొంతభార్య కంటే మిన్నగా మీరు ఆమెతో కలిసి సంసారం చేస్తున్నారు. పెళ్ళికి మాత్రం చొరవ చూపించడం లేదు!"

"అవుననుకో! ఇప్పుడు ఇక్కడే పంచాయితీ

పెడతావా?" అన్నాడతడు.

"పంచాయితీ కాదు. ఒక ఆడదానివైపు ఉండి ఆలోచించండి"

"సరళ కూడా వదిలిపెట్టడం లేదు కదా? ఆ విషయమే ఆలోచించాను!"

"అవునా? ఇంకేం! లాయర్‌ని తీసుకురండి. లేదా మనమే వెళ్దాం. నా మాట పొల్లు పోనివ్వకండి"

సరళకు ఆమె మీద గౌరవం రెట్టింపయ్యింది. సాటి ఆడదానిపట్ల ఆమెకున్న ఆదరణ గొప్పది. ఆ హృదయమృదుత్వంతోనే కాంతామణిని దగ్గరకు హత్తుకుంది. అదే సమయంలో ప్రసాదరావు కప్పదాటు ప్రవర్తనపై కూడా అవలోకనం చేస్తోంది. ప్రసాదరావును మరో రకంగా దారికి తెచ్చుకోవడం సాధ్యమా? అసలుసిసలు భార్యాభర్తలు మాట్లాడుకుంటూంటే మధ్యలో మౌనంగా ఉండిపోయింది సరళ. అక్షరాలు చెరిగిపోయిన కాగితం మాదిరిగా ఉండిపోయింది ఆమె మనస్సు. 'తాను ఇప్పటి వరకు ఒక ఉంపుడుగత్తెగానే మిగిలిపోయిందా? సభ్యసమాజం తనను ఒక గృహిణిగా గౌరవించదా?' వెంటనే ఆమెకు గోపాల్ గుర్తుకొచ్చాడు. 'అలాంటి గౌరవం నేను కలగజేస్తాను' అంటున్నాడతను. మధ్యలో. ఈ గోపాల్ ఒకడు. తనను డిస్టర్బ్ చేస్తున్నాడు. అతడి మాటలు తనకు జీర్ణం కావడంలేదు, తన పాలిట పులిమీద పుట్రలాగా తయారయ్యాడు అనుకుంది. ఆశ్రమానికి వస్తూ వెళుతున్న క్రమంలో గోపాల్ దృష్టిలో పడింది సరళ.

***

'నేను మీకెలా తెలుసు?' అడిగింది సరళ. అప్పటికే ఆమె ప్రసాదరావు ఇంటికివచ్చి మూడునెలలు గడిచింది.

"మీరూ తెలుసు. ప్రసాదరావూ తెలుసు. కాంతామణికి పెద్దవ్యాధి సోకిందనీ తెలుసు. మిమ్మల్ని ప్రసాదరావుకు జత కలిపింది కూడా కాంతామణే అని కూడా తెలుసు" చెప్పాడు గోపాల్. కుష్ఠు రోగుల ఆశ్రమంలో కాంతామణి చేరిన సంగతి గోపాల్‌కి ఎలా తెలిసిందో అనే సందేహం సరళకు చప్పునే తీరిపోయింది. గోపాల్ ఆశ్రమసలహా మండలి సభ్యుడు. గోపాల్ తమమీద ఎందుకంత నిఘాపెట్టాడో ఆమెకు అర్థం కాలేదు. తన నుంచి అతడేం ఆశిస్తున్నాడు? దయతో కూడిన అతని చూపులూ, ఆత్మీయత చిలకరించే మాటలూ సరళకు భయాందోళనలే పెంచుతూ వస్తున్నాయి.

ఆమె నివ్వెరపాటుచూసి గోపాల్ మరోఅడుగు ముందుకేశాడు. "ప్రసాదరావు సంగతి నాకు బాగా తెలుసు. అతడు మీకు తాళి కట్టడు. మీకంటే ముందుగా అతడికి ఇద్దరు ఆడవాళ్ళతో సంబంధాలు ఉన్నాయి. ఒకామె వాళ్ల ఆఫీసులోనే పని చేస్తోంది!" అన్నాడు.

**అతడితో సహజీవనం చేస్తోంది ఆమె. అతణ్ణి పెళ్ళికి ఒప్పించాలని శతవిధాల యత్నిస్తోంది. ఎప్పటికప్పుడు చాలా ఒడుపుగా కోరికలు తీర్చుకోవడంతప్ప పెళ్ళికి మాత్రం అతడు ఒప్పుకోవడంలేదు. అతడి మొదటిభార్య కూడా చెప్పి చూసింది!! అయినా ససేమిరా అంటున్నాడు. సిసలైన భార్యాభర్తల మధ్య ఉంపుడుగత్తెగా మిగిలిపోయిన భావనకు గురవుతోంది ఆమె. పులిమీద పుట్రలా అంతలోనే ఆమెకు.....**

మతిపోయింది సరళకు, నమ్మలేనట్టు చూస్తోంది గోపాల్‌వైపు.

సిబిఎం కాంపౌండ్‌లోని ఒక ఇంటి చిరునామా ఇచ్చాడతడు. "ఈ ఇంటి దగ్గర కాపలా కాయండి. విషయం మీకే తెలుస్తుంది" అని కూడా చెప్పాడు. ఆ ఇల్లు చేరుకునే దారి వివరాలు గుర్తులతోపాటు రాసిచ్చాడు. అతని మాటలపై సరళకు గురి కుదిరింది. ప్రసాదరావును నిలదీయాలనిపించింది. ఎలా నిలదీయాలో అర్థంకాలేదు. అతడి జీవితంలోకి తాను అడుగుపెట్టకముందే వాళ్ళు అతడితో సంబంధం కలుపుకున్నారు. నిలదీసినా అతడు ఆ మాటే చెబుతాడు. ఒక ఆడదాని చిరునామా దొరికింది. రెండో ఆడదెవరు? ఎవరైతేమాత్రం తెలుసుకుని తాను ఏం చేయగలదు?

ఇలాంటి తర్జనభర్జనల్లో ఉండగానే వారం రోజులు గడిచిపోయాయి. ఒకసారి బీచ్ ఒడ్డుకు వెళ్ళిన సరళకు గోపాల్ తారసపడ్డాడు.

"ఎలా ఉన్నారు?" ఆత్మీయంగా చూస్తూ అడిగాడు.

నవ్వి తల ఊపింది. అతడు దారి చూపిస్తే సిమెంట్ బెంచీవైపు నడిచింది సరళ. బెంచీకి రెండు చివరలా కూర్చున్నారు వాళ్ళిద్దరు.

"మీతో ఒక విషయం మాట్లాడాలి!" అన్నాడు గోపాల్.

"నా మనస్సేం బాగుండలేదు. కాస్సేపు ప్రశాంతంగా గడుపుదామని ఇక్కడికి వచ్చాను" అన్నదామె.

"అందుకే నేను చెప్పేది విని తీరాలి మీరు!" అన్నాడు గోపాల్.

ఆమె వింటోంది.

"మీ గతం నాకు అక్కరలేదు. మీరు అంగీకరిస్తే మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను."

ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

"మా బంధువులకు కూడా వివరించి చెప్పాను. మా ఆవిడ కాలంచేశాక ఆమెతరపు బంధువులే నన్ను రెండోపెళ్ళికి ఒత్తిడి చేస్తున్నారు. మాకు పిల్లలు కలగలేదు. ఆ దిగులుతోనే పోయింది మా ఆవిడ".

"ప్రసాదరావుతో నేను సహజీవనం చేస్తున్నాను" అంది సరళ.

"అభ్యంతరం లేదు."

"తరువాత రాదన్న హామీ ఏమీలేదు."

గోపాల్ నవ్వి "సమాజసేవా కార్యక్రమాల్లో పాల్గొంటున్నాను. నన్ను ఇలాంటి అంశాలు అంతగా బాధించవు. అయినా నేనే కోరి అడుగుతున్నాను. పెళ్ళికి ఒప్పుకోండి. అంతగా అనుమానం ఉంటే అంగీకారపత్రం రాసుకుందాం" అన్నాడు. ఆమె పేరిట అయిదు లక్షల రూపాయలు బ్యాంక్‌లో డిపాజిట్ చేస్తానన్నాడు.

"నేను తప్పించి మీకు మరో ఆడదే దొరకలేదా?"

"ఎందుకు దొరకరూ, మీరు నాకు బాగా అర్థమయ్యారు. అందుకని,"

"దూరపుకొండలు నునుపు! కలిసి బతకడం మొదలుపెడితేనే గానీ లోపాలు తెలియవు!"

"సరే, ఆలోచించుకోండి! ప్రసాదరావుకంటే నేను మెరుగని నమ్మితే నా జీవితంలోకి సంతోషంగా రండి!"

సరళకు ఈ మగవాళ్లు తీసుకునే చొరవ ఒక పట్టాన అర్థం కావటంలేదు. ఆమెకు భయాందోళనలు పెరుగుతున్నాయి. ఒకపట్టాన కోపం కూడా.....

కబుర్లు సాగుతున్నాయి.

అతడి భార్య చనిపోయి ఒక సంవత్సరం అయిందట. ఈ సంవత్సరంపాటు దాచుకున్న నిగ్రహం సరళను చూశాక జారుకోవడం మొదలైందట. సరళ వింటోంది. ఉన్నది ఉన్నట్టు మాట్లాడుతున్నాడు గోపాల్. లేనిపోని భేషజాలు పోవడంలేదు.

సరళకు క్రమంగా తన జీవితంమీద భయం తొలిగిపోతోంది. పెళ్ళి కోసం ఎదురు చూసీచూసీ తన ముప్ఫైఅయిదో ఏట ఆమె ప్రసాదరావును ఆశ్రయించింది. ప్రసాదరావు తన జీవితంతో ఎలా ఆడుకుంటున్నదీ ఈ మధ్యకాలంలో బాగా అర్థమవుతూ వస్తోంది. ఎంతసేపూ అతడు తనవైపే ఆలోచిస్తాడుతప్ప ఒక ఆడదానికి ఎలాంటి మర్యాద అవసరమవుతుందో అతడికి తెలియదు. తనకు కాంతామణి సహాయ సహకారాలున్నాయి కాబట్టి ఈ మాత్రమైనా నిబ్బరం కలుగుతోంది.



ప్రసాదరావుకంటే ఇతడే ముందుగా పరిచయమై ఉంటే ఎంత బాగుండేది? ఆ మాటే అంది గోపాల్‌తో.

ప్రసాదరావుతో కలిసి సరళ ఆశ్రమానికి రావడం వల్లే ఆమె గురించిన వివరాలు గోపాల్‌కి తెలిశాయి. అందువల్ల ఆమె ఊహకు పునాదిలేదు. "థాంక్స్, ముందు మీరు ప్రసాదరావుతో తెగతెంపులు చేసుకోండి" అన్నాడు గోపాల్.

ఇప్పుడు బంతి ఆమె కాలివద్దనే ఉంది.

"ఆలోచనల్లో ఈత కొడుతున్నావు, ఏమిటి సంగతి?" పరధ్యానంగా ఉన్న సరళను అడిగాడు ప్రసాదరావు. ఆమె వర్తమానంలోకి వచ్చేలోపే మళ్ళీ మోచేయి పట్టుకుని ఊపాడు ప్రసాదరావు. ఆ క్రమంలో ఆమె ఛాతీమీద వేళ్ల తగిలించాడు.

అంతలో డాక్టరూ, నర్సూ ఆశ్రమం కాటేజీ లోపలికి వచ్చి కాంతామణిని పరిశీలించారు. వైద్య పరీక్షలు చేశారు.

బిస్కట్లూ, కూల్‌డ్రింకూ తెచ్చాడు ఆశ్రమం ఉద్యోగి.

ఒక అరగంట తర్వాత అటునుంచి అటే ఆఫీసుకు వెళ్ళిపోయాడు ప్రసాదరావు. సరళను ఆటో ఎక్కించాడు. సరళ నేరుగా ఇంటికిపోలేదు. ఆమె ఆటోలో ఉండగానే మొబైల్‌కి ఫోన్‌కాల్ వచ్చింది.

'గోపాల్!' ఆమె పెదిమలు మందహాసం చేశాయి.

***

"మీ మాటే నిజమైంది. రకరకాల కారణాలు చెప్పి పెళ్ళి వాయిదా వేస్తున్నారు ప్రసాదరావు" అంది సరళ.

గోపాల్ హృదయోల్లాసానికి లోనయ్యాడు. తన మాట నిజమైనందుకో లేక ఆమెకూడా తనమాదిరిగా ప్రసాదరావుమీద ఒక అభిప్రాయానికి వచ్చినందుకో. వాళ్ళిద్దరూ ఎప్పుడూ కలుసుకునే రెస్టారెంట్లోనే ఎదురెదురుగా కూర్చున్నారు. సమశీతోష్ణ వాతావరణం వాళ్లకు మనోహరంగా సోకుతోంది. ఆమె ఈసారి అతడి కళ్ళల్లోకి ధైర్యంగా చూస్తోంది. వాళ్ల క్యూబికల్‌లోకి ప్రవేశించాడు వెయిటర్.

"నేను ఆర్డరిస్తాను" అంది సరళ.

భుజాలు చరచుకుని గోపాల్ విచిత్రంగా చూశాడు.

ఉప్మా ఉల్లి పెసరట్టు, ఐస్‌క్రీమ్ ఆర్డరిచ్చింది సరళ.

"పెసరట్టు పదకొండు గంటలవేళలో కూడా తింటారని ఇప్పుడే తెలిసింది!" నవ్వాడు గోపాల్.

"ఒక ఆడది తాను సంసారం చేయబోయే వ్యక్తులను ఇలా కూడా వెతుక్కోవచ్చునని నా జీవితమే రుజువుచేసింది. అందువల్ల ఇలాంటి సమయంలో ఉప్మాపెసరట్టు తినడం అంతకంటే విచిత్ర సందర్భం కాబోదు!" సరళ కూడా నవ్వింది.

ఆర్డర్ తెచ్చి సర్వ్ చేశాడు వెయిటర్. ఇద్దరూ తింటున్నారు.

ఆరోజు ఉదయం లేచింది లగాయితూ ఆశ్రమం నుండి తిరిగి బయటికి వచ్చేవరకు జరిగిందంతా గోపాల్‌కి చెప్పుకొచ్చింది సరళ.

"అప్పటికీ కాంతామణి అతడిమీద ఒత్తిడి తెచ్చింది. ఇంతకు ముందుకూడా చాలాసార్లు ఒత్తిడి చేసింది. ఆమెకే అభ్యంతరం లేనప్పుడు ఈయనకు అభ్యంతరం ఎందుకో నాకు అర్థంకావడం లేదు. మీరన్నదే నిజం కాబోతోంది" అంది సరళ.

"సిబిఎం కాంపౌండ్ యువతికి ఒక బిడ్డ కూడా పుట్టాడు. ఆ యువతి తల్లి దగ్గర పెరుగుతోంది ఆ బిడ్డ" కొత్త విషయం చెప్పాడు గోపాల్.

సరళకు ఎక్కడో కలుక్కుమంది. నోరంతా పుల్లగా ఊరింది. ఆమెకు శరీరమంతా ఒకరకమైన వికారం ఆవరించింది. చప్పునలేచి ఆమె వాష్‌బేసిన్‌ను సమీపించి అందులో వాంతి చేసుకుంది. మొహం తిరిగినట్టయ్యింది. రెండుచేతులతోనూ వాష్‌బేసిన్ పట్టుకుని నిలదొక్కుకుంది.

ప్రమాదం ఊహించాడు గోపాల్. చప్పునపోయి ఆమెను పట్టుకున్నాడు. గోపాల్ మీదికి వాలిపోయింది సరళ. ఆమెకు అంతే తెలుసు.

***

కళ్ళు తెరచి చూస్తోంది సరళ. ఆస్పత్రివార్డు అని చూడగానే ఆమెకు అర్థమైపోయింది.

దానికితోడు మందులవాసన, ఫినాయిల్‌వాసన ఆమె ముక్కు పుటాలకు సోకాయి. ఆమె మొహానికి దగ్గరలో గోపాల్ మొహం ప్రత్యక్షమైంది.

"ఏమైందండీ నాకు?" అడిగింది సరళ.

గోపాల్ తటపటాయించి "చెబుతాను. ఇప్పుడు మీ ఒంట్లో ఎలా ఉంది?" అన్నాడు.

"బాగానే ఉంది!" అని సరళ బెడ్ దిగింది. నీళ్ళ గదికి పోయి తిరిగి వచ్చింది.

ఆలోపుగా నర్స్ వచ్చి ఆమె చేతిలో కాగితం ఉంచి, "మిమ్మల్ని డిశ్చార్జ్ చేశారు" అంది.

గోపాల్‌తో పాటు బయటికివచ్చింది సరళ. టాక్సీ మాట్లాడి ఆమెను ఇంటికి పంపించే ప్రయత్నం చేశాడు గోపాల్.

"నాకెందుకు వాంతి కాబోయింది? పెసరట్టు సహించలేదా? లేక ఫుడ్ పాయిజనైందా?" అడిగింది సరళ.

"వాంతి సహజంగానే జరిగింది!" అన్నాడు గోపాల్.

టాక్సీ డ్రైవర్ వాళ్ళిద్దరి మాటలు అన్యమనస్కంగా వింటున్నాడు.

'అంటే?'

"మీకు నెల తప్పింది"

***

రెండురోజుల తర్వాత సరళ మొబైల్ ఫోన్ మోగింది. గోపాల్ ఎప్పటిలాగానే ఫోన్ చేశాడు.

"ఎలా ఉంది ఒంట్లో?" అడిగాడు.

"బాగానే ఉంది!"

"ప్రసాదరావు ఎలా స్పందించారు?"

కొన్నిక్షణాలు సరళ మౌనంగా ఉండిపోయింది.

"మాట్లాడరేం?" రెట్టించాడు గోపాల్.

"సంతోషించారు. ఇప్పటికైనా పెళ్ళి చేసుకోండి అని బతిమాలాను!" అంది సరళ.

"ఊ!"

"ఆయన మాట్లాడలేదు!"

'......!'

"పెళ్లికాకుండా తల్లిని కావడంలో అర్థం లేదు."

"అందుకని"

"గర్భస్రావం....!"

"వద్దు...!"

"మరి!"

"నా జీవితంలోకి వచ్చెయ్ సరళా. రేపే మా బంధువుల సమక్షంలో తాళికడతాను" అతడి మాటల్లో విశ్వసనీయత.

ఆమెకు కలో నిజమో తెలియడం లేదు. "గోపాల్....!" అంది.

*సెల్: 80196 22396*

## అస్సలు పట్టించుకోదట

గతాన్ని తలచుకుంటూ బాధపడుతూ కూర్చుంటే భవిష్యత్తు ఉండదని అంటోంది టాలీవుడ్ చందమామ కాజల్ అగర్వాల్. యాభై చిత్రాల మైలురాయిని దాటిన కాజల్, తాను ఇంకా ఎన్నో చిత్రాలు చేయాలని, తన సినీరంగ ప్రయాణం ఇంకా ఉందనీ అంటోంది. చిత్రం జయాపజయాలను తానస్సలు పట్టించుకోనని చెబుతోంది. 'నేనే రాజు నేనే మంత్రి' విజయంతో మంచి ఊపు మీద ఉన్న కాజల్ తాను అనుభవపూర్వకంగానే చాలా విషయాలు తెలుసుకున్నానని, ఎవరి నుంచీ నేర్చుకోలేదని ఫిలాసఫీ చెబుతోంది.






**బైట వర్షం మరింత పెద్దదైంది. ఉరుములు.. భయం గొలిపేలా... తను ఖాళీ కప్పులు తీసుకుని వంటగదిలోకి వెళ్ళింది.**

**అదే సమయంలో కరెంట్ పోయింది. చిమ్మచీకటి.**

**"ఒక్కక్షణం.. అక్కడే కూచో. కదలకు. కొవ్వొత్తి వెలిగించి తెస్తాను" అందామె కిచెన్‌లోంచి.**

ఒక చేత్తో వెలుగుతున్న కొవ్వొత్తిని పట్టుకుని మరో చేతిని అది ఆరిపోకుండా అడ్డుపెట్టి తెస్తుంటే నా కళ్ళకు ఫ్లారెన్స్ నైటింగేల్లా కన్పించింది.

కరుగుతున్న మైనాన్ని కుర్చీమధ్యలో వేసి, దాన్లో కొవ్వొత్తిని నిలబెట్టి, తను సోఫాలో కూచుంది.

"చీకటంటే భయమా?" అంది.

"లేదు. నాకు వెలుతురంటే భయం.."

"ఆశ్చర్యంగా ఉందే. తమసోమా జ్యోతిర్గమయా అని కదా అంటారు. చీకట్లోంచి వెలుతురులోకి నడిపించమని కదా మనం దేవుణ్ణి ప్రార్థిస్తాం".

"తెలిసిన మనుషులెవరైనా ఎదురుపడి ఆ వెలుతురులో నన్ను గుర్తుపడతారన్న భయం".

"నువ్వేమీ దొంగవో ఖూనీకోరువో కాదుగా. గుర్తుపడితే ఏమవుతుంది?"

"వాళ్ళ కళ్ళలో కనిపించే జాలిని తట్టుకోలేను".

ఎందుకు జాలి? అని అడిగితే ఏం చెప్పాలా అని ఆలోచించాను. ఆమె ఆ ప్రశ్న వేయకుండా "మీ నాన్నగారు ఏం చేస్తారు?" అని అడిగింది.

"వ్యవసాయం చేసేవాడు. చనిపోయాడు, ఆత్మహత్య చేసుకుని".

"అయ్యో అలానా... దేశంలో ప్రతిచోటా రైతుల ఆత్మహత్యలు పెరిగిపోయాయి. ప్రభుత్వాలు పట్టించుకోవు. ఇదంతా మన దౌర్భాగ్యం. అమ్మ ఎక్కడుంటారు?"

"అమ్మ కూడా చనిపోయింది. నా చిన్నప్పుడే".

"ఓ అందుకా మనుషుల జాలి చూపులంటే భయం.. నేనో సలహా ఇవ్వనా? నువ్వా కాంప్లెక్స్ నుంచి ఎంత తొందరగా బైటపడితే అంతమంచిది. వాళ్ళెవరికోసమో నువ్వు చీకట్లోనే ఉండాలని కోరుకోవటం ఆరోగ్య లక్షణం కాదు".

నేనేమీ మాట్లాడలేదు.

వర్షం తగ్గే సూచనలు కన్పించడం లేదు. కొత్త వ్యక్తులతో నేను తొందరగా కలిసిపోలేను. నీళ్ళ నుంచి బైటపడ్డ చేపలా ఊపిరాడక ఇబ్బందిపడతాను. అక్కడినుంచి ఎప్పుడెప్పుడు బైట పడాలా అని ఆరాటపడసాగాను.

"వర్షం తగ్గేలా లేదు. సమయం తొమ్మిది కావస్తోంది. ఆకలి వేయటం లేదా?" అంది.

నేనేమీ బదులివ్వలేదు. నిజంగానే చాలా ఆకలిగా ఉంది. మధ్యాహ్నం లంచ్‌బాక్స్ తెచ్చుకోలేదు. క్యాంటీన్‌లో ఏదైనా తిందామనుకున్నాను. తీరా అక్కడికెళ్ళాక తినాలనిపించక మళ్ళా క్లాస్‌కెళ్ళిపోయాను.

"నీకు చపాతీలు చేసిపెడతానుండు" అంది ఆమె లేచి.

"వద్దండీ. నేను వెళ్ళిపోతాను" అన్నాను నేనూ లేచి నిలబడి.

చొక్కా కొద్దిగా ఆరినట్టుంది. దాన్ని గబగబా తొడుక్కున్నాను.

ఆమె తలుపుని ఓ లిప్తపాటు తెరిచి వెంటనే మూసేసింది. ఆ కొద్దిసేపటికే జల్లు ఇంట్లోకి కొట్టింది.

"ఇంతవర్షంలో బైట కరెంటు కూడా లేకుండా నువ్వు వెళ్తానన్నా నేను వెళ్ళనివ్వను. ఎంత ప్రమాదమో తెలుసా? మీ అమ్మ బతికుంటే ఇలాంటి వర్షంలో చీకటిలో నిన్ను బైటికి పంపుతుందా చెప్పు".

అమ్మ బైటికి పంపి ఉండేదో లేదో తెలియదుగానీ తనే బైటికెళ్ళిపోయిందిగా అనుకున్నాను.

"కూర్చో... పది నిమిషాల్లో వేడివేడిగా చపాతీలు చేసిపెడతాను" అంది.

ఆ గొంతులో మళ్ళా ఏదో అధికారం... కాదనలేని బలహీనత... కూచుండిపోయాను.

వంటగదిలో మరో క్యాండిల్ వెలిగించుకున్నట్టు తెలుస్తోంది.

ముక్కూమొహం తెలీని వ్యక్తిని ఇలా లోపలికి పిలిచి అమ్మలా ఆదరించేవాళ్ళు కూడా ఉంటారా? ఆ వ్యక్తి చెడ్డవాడైతే... దొంగో దుర్మార్గుడో అయితే? మనుషుల మంచితనం మీద అపారమైన నమ్మకం ఉన్నప్పుడే ఇది సాధ్యం.

ఈమె నన్ను లోపలికి పిలవకుండా ఉంటే నా పరిస్థితి ఎలా ఉండేదో... అంత వర్షంలో సైకిల్ తొక్కడం కూడా కష్టమే. చీకట్లో ఏ గోతిలోనో పడిపోతే ఎంత కష్టం.

నాకు ఆకలిగా ఉందని ఎలా తెలిసిందో? అమ్మకే బిడ్డ ఆకలి గురించి తెలుస్తుందంటారు. ఈమె ఒంటరిగా ఉందంటే పిల్లలు లేరనే అర్థం. ఉండి ఉంటే ఇలాంటి అమ్మ ఉన్నందుకు ఎంత అదృష్టవంతులయ్యేవాళ్ళో...

ఆమె ఓ ప్లేట్‌లో రెండు చపాతీలు, ఆలూ కూర వేసుకుని వచ్చింది.

"మరి మీరో..." అన్నాను.

"కంపెనీ లేకపోతే తినవా ఏంటి? సరే... నేనూ చపాతీ తెచ్చుకుంటాను" అని తన ప్లేట్లో కూడా చపాతీలు పెట్టుకుని వచ్చి కూర్చుంది. "ఈరోజు శనివారం కదా. నేను అన్నం తినను. టిఫిన్‌తో సరిపెట్టుకుంటాను. గురువారం కూడా అంతే" చపాతీలోంచి చిన్నముక్క తుంపి నోట్లో పెట్టుకుంటూ అంది.

"మీరేమీ అనుకోనంటే ఒకమాటడగనా?"

"అడుగు."



"నేనెవరో తెలియకుండా లోపలికి పిలిచారు కదా. ఒకవేళ నేను దుర్మార్గుడినై ఉంటే మీకు ప్రమాదం కదా?"

ఆమె మెత్తగా నవ్వింది. "చాలా అమాయకు రాలిలా కన్పిస్తున్నానా? కాదులే. నిన్ను మా ఇంటి ముందు నుంచి వెళ్తుంటే చాలాసార్లు చూశాను. ఈ రోజుల్లో సైకిల్ వాడే కుర్రాళ్ళు అరుదు కదా. చివరికి కూలి చేసుకునేవాళ్ళు కూడా వాయిదాల మీద స్కూటర్లు కొనుక్కుంటున్న కాలంలో కదా ఉన్నాం. అందుకే నిన్ను ఆసక్తిగా గమనించేదాన్ని. నువ్వు కాలేజీ స్టూడెంట్‌వని నాకు తెలుసు. తలుపు తెరవగానే నిన్ను గుర్తుపట్టాను. అందుకే లోపలికి రమ్మని పిలిచాను".

ఒక అనుమానం తీరిపోయింది. "అయినా స్టూడెంట్ అయినంత మాత్రాన చెడ్డవాడు కాకూడదని ఉందా?" అన్నాను.

"నిజమే. ఒప్పుకుంటా. నేను స్కూల్ టీచర్ని.. బీయస్సీ బియెడ్ చదివాను. ప్రతి యేడూ కొన్ని వందల మంది పిల్లల్ని గమనిస్తుంటాను. మొహం చూడగానే వాడు మంచివాడో కాదో తెలిసిపోయే విద్య బాగానే పట్టుబడిందిలే. నిన్ను చూడగానే అర్థమైంది, నువ్వు చాలా బుద్ధిమంతుడి వని".

చపాతీలు తినడం పూర్తయ్యే లోపు కరెంట్ వచ్చింది. వర్షం కూడా తగ్గుముఖం పట్టింది. సింక్ దగ్గర చేయి కడుక్కుని "ఇక వెళ్తానండి" అన్నాను.

మరోసారి తలుపు తీసి చూసింది. వర్షం సన్నగా పడుతోంది.

"ఒక్కక్షణం ఉండు" అని బెడ్రూంలో కెళ్ళింది. కొన్ని నిమిషాల తర్వాత చేతిలో రెయిన్‌కోట్‌తో వచ్చింది.

"ఇది మా ఆయనది. వేసుకెళ్ళు. రేపు తెచ్చివ్వు" అంది.

"పర్లేదు. వెళ్ళిపోతాను" అన్నాను మొహమాటపడ్తూ.

"అబ్బా... ఎన్నిసార్లు పర్లేదని అంటావు? అలా అనకు. నాకు నచ్చదు. వేసుకెళ్ళు. తడవకుండా ఉంటావు. సైకిల్‌ని మెల్లగా నడుపు".

"పర్లేదండి. మెల్లగానే వెళ్తాను".

ఆమె హాయిగా నవ్వింది. "పర్లేదండీ... జాగ్రత్తండీ" అంది అనుకరిస్తూ.

"ఇంటికెళ్ళంగానే నాకు ఫోన్ చేయి" అంటూ తన సెల్ నెంబర్ చెప్పబోయింది.

"నాకు సెల్‌ఫోన్ లేదండి" అన్నాను.

"అదేమిటి? వింతగా ఉందే. ఈ రోజుల్లో కూరగాయలమ్మేవాడి దగ్గరా, రిక్షావాడి దగ్గర కూడా సెల్‌ఫోన్లు ఉంటున్నాయిగా".

"నాకెందుకో సెల్‌ఫోన్ ఇష్టముండదండి. అంత అర్జంట్‌గా మాట్లాడాల్సిన విషయాలు ఏముంటాయి చెప్పండి?"

"నేను ముందే చెప్పానా నువ్వు చాలా బుద్ధిమంతుడివని... మీ ఇంట్లో ఎవరిదగ్గరా సెల్‌ఫోన్ లేదా?"

"ఉందండి. మా అత్త కూతురి దగ్గర".

"సరే... ఆ ఫోన్లోంచి నాకు ఫోన్ చేసి చెప్పు. లేకపోతే నేను కంగారు పడతాను".

"ఎందుకండి కంగారు? కొద్ది దూరమేగా. ఇరవై నిమిషాల్లో వెళ్ళిపోతాను".

"వర్షానికి ఒక్కోసారి కరెంట్ వైర్లు తెగిపడి ఉంటాయి. గుంటలు కన్పించవు. పడితే దెబ్బలు తగలవా? అందుకే ఇంటికి వెళ్ళగానే ఫోన్ చేయి" అంది.

ఇంటికి వెళ్ళాక కాత్యాయని ఫోన్లోంచి ఆమెకు ఫోన్ చేసి భద్రంగా చేరినట్టు చెప్పాను.

"ఎవరీ శాల్తి?" అని అడిగింది కాత్యాయని.

"శిరీష గారు" ఆ నెంబర్‌ని కాత్యాయని ఫోన్‌లో సేవ్ చేశాక చెప్పాను.

"ఏం చదువుతోంది?"

"స్టూడెంట్ కాదు.. టీచర్... బయాలజీ టీచర్".

"వయసులో ఉన్న కూతుర్లున్నారా?"

"ఆమెకి పిల్లలు లేరు."

## జరిగిన కథ

రామక్రిష్ణ తల్లి వసుధ ఎవరితోనో వెళ్ళిపోతుంది. తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు. దాంతో రామక్రిష్ణ బాధ్యతను వాళ్ళ పెదనాన్న తీసుకుంటాడు. ఒంగోలు కాలేజీలో డిగ్రీలో చేరిన రామక్రిష్ణ, మోహిత్‌తో స్నేహం చేస్తాడు. మోహిత్ ఎక్కువగా సుఖాల గురించి, అమ్మాయిల గురించే మాట్లాడటం రామక్రిష్ణకి నచ్చదు. ఒక రోజు కాలేజీనుంచి ఇంటికెళుతుండగా వర్షం పడుతుంది. ఓ ఇంటిముందు ఆగుతాడు రామక్రిష్ణ. ఓ స్త్రీమూర్తి తలుపు తెరిచి అతన్ని లోపలికి రమ్మంటుంది.

ఆ తర్వాత....

"హమ్మయ్య... ఇప్పుడు మనసు ప్రశాంతంగా ఉంది. ఇదుగో బావా! ఓ విషయం గుర్తు పెట్టుకో. నువ్వు నాకాబోయే మొగుడివి. వేరే అమ్మాయిలతో వెధవ్వేషాలు వేశావా... చెవి మెలి తిప్పి గుంజీలు తీయిస్తా జాగ్రత్త" అంది.





## ఘాటైన సమాధానం

ప్రపంచ సుందరి ఐశ్వర్యారాయ్ తన అందంతోనే కాక నటనతోనూ ఎంతో మంది అభిమానులను ఆకట్టుకుంది. పెళ్లయిన తర్వాత కొద్దికాలం సినిమాలకు దూరంగా ఉన్నా, తిరిగి సరబ్జీత్‌తో ప్రేక్షకులను అలరించింది. అయితే పెళ్ళి తరువాత ఐష్ మునుపట్లా నటించలేకపోతోందని బాలీవుడ్ జనాలు విమర్శిస్తున్నారు. అయితే తాను బ్యూటీలోనే కాకుండా యాక్టింగ్‌లో కూడా అదరగొట్టగలననీ, అందుకు తాను పెళ్లి తర్వాత నటించిన సరబ్జీత్, యే దిల్ హై ముష్కిల్ సినిమాలే సాక్ష్యాలని చెబుతూ విమర్శకులకు ఘాటుగానే సమాధానమిచ్చిందీ బ్యూటీ.

"దయచేసి పెళ్ళి విషయం ఎత్తకు. నాకు ఆ మాటంటేనే అసహ్యం".

"అంటే ఏంటి? నేను పెళ్ళి కాకుండా ఇలా ఉండిపోవాలనా?"

"అది నీ సమస్య... నాది కాదు".

"నా సమస్య నీది కాదా?"

"అలా ఎందుకవుతుంది? ఎవరి సమస్య వారిదే".

"కానీ నీ ప్రతి సమస్య నాదే! నువ్వంటే నాకు పిచ్చి ఇష్టం బావా. నువ్వు లేకపోతే చచ్చి పోవాలనిపించేంత ఇష్టం".

"నోర్మూసుకుని ఇక్కడి నుంచి వెళ్ళు. నాకు నిద్రొస్తోంది" అన్నాను.

"ఎప్పుడూ ఇంతే. మనసు విప్పి మాట్లాడవు. నన్ను మాట్లాడనీయవు. ఎంత బాధ పడతానో తెలుసా?"

"ప్లీజ్... నిజంగానే నిద్రొస్తోంది" అన్నాను ఆవులిస్తూ.

"సరే బావా.. నీ కోసం ఏమైనా చేస్తాను. ఎంతటి త్యాగాన్నైనా! ఈ చిన్నకోరిక తీర్చలేనా? గుడ్‌నైట్" అని కాత్యాయని వెళ్ళిపోయింది.

రాత్రి పడుకునే ముందు శిరీషగారి గురించే చాలాసేపు ఆలోచించాను. చాలా రోజుల తర్వాత ఎందుకో ప్రశాంతంగా నిద్ర పట్టింది. దేనికోసమైతే వెతుకుతున్నానో అది దొరికాక కలిగే నిశ్చింత...

***

మరునాడు ఉదయం వాతావరణంలో పెద్దగా మార్పేమీలేదు. ముసురు పట్టినట్టు వర్షం పడుతూనే ఉంది.

"ఈ వర్షంలో ఏం వెళ్తావు? కాలేజీ మానేయి బావా" అంది కాత్యాయని.

"చాలా ముఖ్యమైన క్లాసులున్నాయి. వెళ్ళాలి" అన్నాను.

"మానేయి ప్లీజ్... నేనూ కాలేజీకి డుమ్మాకొడుతున్నా. ఇద్దరం ఎంచక్కా ఇంట్లో కూచుని వేడి వేడి కబుర్లు చెప్పుకుందాం".

అదిప్పుడు ఇంజనీరింగ్ రెండో సంవత్సరంలో ఉంది. అదృష్టం కొద్దీ నేను ఇంజనీరింగ్‌లో చేరలేదు. లేకపోతే కాలేజీలో కూడా ప్రాణాలు కొరుక్కుని తినేది.

"వేడి వేడి కబుర్లేమిటి? చల్లటి కబుర్లు వేడి కబుర్లు అని ఉంటాయా?"

"ఐ మీన్.. మనం కబుర్లు చెప్పుకుంటుంటే అమ్మ వేడివేడి పకోడీలు చేసి తెచ్చిపెడుతుంది. అవి తింటూ మనం చెప్పుకునే కబుర్లన్నమాట".

కాత్యా నాతో ఎలా మాట్లాడినా అత్త ఏమీ అనదు. పైపెచ్చు ప్రోత్సహిస్తుందనుకుంటా.

"మీ బావా మరదళ్ళ కబుర్ల మధ్య నేను రావడం బావుండదులేవే. పకోడీలు చేసి పెడతాను. నువ్వే వచ్చి తీసుకెళ్ళు" అంది అత్త.

"లేదత్తా. ఈ రోజు కాలేజికి వెళ్ళాల్సిందే" అన్నాను రెయిన్‌కోటుని తొడుక్కుంటూ.

"నాకర్థమైందిలే నీ ముఖ్యమైన క్లాసేంటో... ఈ రెయిన్‌కోట్ ఇచ్చిన శిరీషని కలుసుకోవాలి. అంతేగా" అంది కాత్య.

"కలుసుకోవడం ముఖ్యం కాదు. ఈ రెయిన్‌కోట్ తిరిగివ్వడం ముఖ్యం. ఇది ఆమె చనిపోయిన భర్తది".

"ఓ... నిన్న ఈ విషయం చెప్పలేదే నువ్వు. అంటే ఆమెకు భర్త లేడన్నమాట. ఇంట్లో ఎవరెవరుంటారు?"

"ఎవరూ ఉండరు. ఆమె ఒంటరిగా ఉంటుంది".

"తన భర్త జ్ఞాపకంగా ఉన్న కోటుని నీకెందుకు ఇచ్చిందబ్బా! ఆలోచించాల్సిన విషయమే" తల పైకెత్తి గాల్లోకి చూస్తూ అంది కాత్య.

"చాల్లే నోర్ముయ్... అల్లరికి కూడా ఓ హద్దుంటుంది" అన్నాను కోపంగా.

"కట్టుకోబోయే మొగుడితో చేసే అల్లరికి హద్దుండాల్సిన అవసరం లేదు".

నేనేదో అనబోయే లోపల అత్త కల్పించుకుని "ఏమోరా బాబూ... ఏ పుట్టలో ఏ పాముందో? ఎవరు ఎలాంటివారో ఏం చెప్పగలం? మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది" అంది.

"పుట్టలో పాములుంటాయి. గుళ్లో దేవతలుంటారు. ఆమె చాలా మంచిదత్తా" అన్నాను సైకిల్ తీస్తూ.

"ఒక్కరాత్రి పరిచయంతోనే ఆమె దేవతైపోయిందా? ఏం మహిమ చూపించిందబ్బా" అంది కాత్య. ఆమె గొంతులో వెటకారం.

మనుషులింత అసహ్యంగా ఎందుకాలోచిస్తారో? ఓ ఆడా ఓ మగాడి మధ్య అది తప్ప వేరే సంబంధం వీళ్ళకు తోచదా? వీళ్ళ మనసుల నిండా దుర్గంధపూరితమైన ఆలోచనలే ఉంటాయనుకుంటా. అందుకే శారీరక సంబంధాలు తప్ప ఆరోగ్యకరమైన సంబంధాలు వీళ్ళ కళ్ళకు కనిపించవు.

మధ్యాహ్నం లంచ్ విరామ సమయంలో 'రెయిన్‌కోట్ చాలా బావుంది. ఎక్కడ కొన్నావు? ఎంతయింది?" అని అడిగాడు మోహిత్.

"కొన్లేదు. నిన్న ఒకావిడ ఇచ్చింది".

"ఎవరావిడ? బంధువులా..."

"కాదు" అంటూ నిన్న జరిగిందంతా చెప్పాను.

"అందుకేగా నిన్ను బుద్ధావతారం అనేది. ఆడవాళ్ళ ఆంతర్యాలు నీకెప్పటికీ అర్థం కావు. ఎంతటి గోల్డెన్ ఛాన్స్ వదులుకున్నావో తెలుసా?" అన్నాడు.

"ఆమెతో పరిచయం కలగటమే గొప్ప అదృష్టం... నేనా గోల్డెన్ ఛాన్స్‌ని వదులుకోలేదు".

"అసలావిడ నిన్నెందుకు లోపలికి పిలిచిందనుకున్నావు?"

"మానవత్వం వల్ల... వర్షంలో ఓ మనిషి తడిసిపోతుంటే చూసి, ఇబ్బంది పడుతున్నాడని లోపలికి పిలిచింది".

**పడుకున్నాడన్నమాటే కానీ నిద్రపట్టడం లేదతనికి. ఆలోచనలన్నీ ఆమె చుట్టూనే తిరుగుతున్నాయి. చాలా ఉన్నతంగా కనిపించసాగిందామె. మనసులో ఉన్న ద్వేషం పటాపంచలైన భావన... ప్రశాంతంగా, హాయిగా అనిపించింది. నిశ్చింతగా ఉంది. దేనికోసమైతే అతను వెతుకుతున్నాడో అది లభించినప్పుడు కలిగే నిశ్చింత అది. అసలతను ఎవరి గురించి ఆలోచిస్తున్నాడు?**

"అక్కడే పప్పులో కాలేశావు. మనం ఎన్ని సినిమాల్లో చూళ్ళేదూ. ఓ వర్షం కురుస్తున్న రాత్రి... చలిచలిగా వాతావరణం.. లోపల వెచ్చగా ఆవిర్లు చిమ్ముతూ ఆలోచనలు... గదిలో ఒంటరి ఆడది. ఓ మగాడు చూరుకింద నిలబడి వర్షం తగ్గడం కోసం

ఎదురుచూస్తుంటాడు. ఆమె లోపలికి రమ్మని పిలుస్తుంది. తుడుచుకోమని టవల్ ఇస్తుంది. అంతలో కరెంట్ పోతుంది. అప్పుడే దూరంగా ఎక్కడో పిడుగు పడిన శబ్దం... ఆమె భయంతో కెవ్వుమని అరిచి అతన్ని అల్లుకుపోతుంది. ఆ తర్వాత ఏం జరుగుతుందో నీకు నేను చెప్పనవసరం లేదు".

"అందరు ఆడవాళ్ళు నువ్వనుకునేలా ఉండరు మోహిత్. చాలా ఉదాత్తమైన ఆడవాళ్ళు కూడా ఉంటారు. ఆమె చాలా ఉన్నత జాతికి చెందిన స్త్రీ".

మోహిత్ విలాసవంతంగా నవ్వాడు. "ఏ జాతి స్త్రీకయినా కొన్ని బేసిక్ అవసరాలుంటాయి. ఆకలి, నిద్ర, మైథునం వీటినుంచి ఎవరూ తప్పించుకోలేరు".

"ఆకలీ నిద్రా రెండూ తప్పకుండా తీర్చుకోవాల్సిన అవసరాలే. కానీ మైథునం అలా కాదు. అది లేకుండా హాయిగా బతకొచ్చని మహామహులెందరో రుజువు చేశారు".

"అందరూ మహామహులు కాలేరు రామక్రిష్ణా! ఆమె కూడా సాధారణమైన స్త్రీయే. ముప్పయ్యేళ్ళు దాటిన వయసు... భర్తలేడు. ఆమె ఏమీ హిమాలయాల్లో తపస్సు చేసుకుంటున్న యోగిని కాదుగా. మనలానే ఉప్పూకారాలూ తినే మనిషి. కోరికలు ఉండటం సహజం. మధ్యలో కరెంట్ పోయిందన్నావుగా. అసలావిడే కరెంట్ మెయిన్ స్విచ్ ఆపేసిందేమో... నీలో చలనం లేదని గ్రహించి మరలా స్విచాన్ చేసి ఉంటుంది".

"తప్పు మోహిత్! నీకు ఆడదనగానే ఆ కోరిక తప్ప మరొకటి గుర్తుకు రాదా? ఆమె తను ప్రేమించిన భర్త జ్ఞాపకాలనే ఊపిరిగా బతుకుతున్న స్త్రీ. నా ఉద్దేశంలో మరో మగాడికి సంబంధించిన ఆలోచన కూడా ఆమె తన మనసులోకి రానివ్వదు. ఎందుకంటే ఆమె మనసు నిండా ఆమె భర్త నిండి ఉన్నాడు కాబట్టి".

"అవును పాపం... నువ్వామె మనసులోకి దూరి చూసొచ్చావు కదా. చూడు రామక్రిష్ణా... మాంసం తింటున్నామని ఎవరూ ఎముకల్ని మెళ్లో వేసుకుని తిరగరు".

"పచ్చకామెర్ల వాడికి లోకమంతా పచ్చగా కనిపిస్తుందట. నువ్వింతే. మారవు. నీ ఆలోచనా ధోరణి మారదు" అన్నాను.

సాయంత్రం క్లాసులైపోయాక ఆమె ఇంటికి బయల్దేరాను. సమయం ఐదున్నర. ఈపాటికి ఆమె స్కూల్ నుంచి ఇంటికొచ్చి ఉంటుంది.

వర్షం సన్నగా కురుస్తోంది. రోడ్డుమీద వెళుతున్న మనుషులు వర్షం నుంచి రక్షణ కోసం రకరకాల ప్రయత్నాలు చేస్తున్నారు. కొంతమంది తలమీద గోనెపట్టాని కప్పుకుని పోతుంటే, కొంతమంది ప్లాస్టిక్ కవర్లని నెత్తిమీద పెట్టుకుని పోతున్నారు. కొంతమంది గొడుగులు వేసుకుని వెళుతున్నారు. అందులోకూడా ఎంత వైవిధ్యమో... కొంతమంది రెయిన్‌కోట్ తొడుక్కుని ఉన్నారు. రకరకాల రెయిన్ కోట్లు... కొంతమంది తడుస్తూనే వెళుతున్నారు, మనుషుల్లో ఉన్న ఆర్థిక వ్యత్యాసాలు కళ్ళకు కట్టేలా....

ఒకామె చక్రాల బండి మీద వేరుశనక్కాయలు అమ్ముతోంది. బాణలిలో ఉన్న ఇసుకలో వేడి చేసిన శనక్కాయలు... నాకు చాలా ఇష్టం. వేరుశనక్కాయల్ని ఒలిచి, వాటితో పాటు బెల్లం ముక్క నంజుకుని తింటుంటే ఎంత బావుంటుందో... మా పల్లెటూరు గుర్తుకు వస్తుంది. నా బాల్యం నాలుక మీద రుచి రుచిగా నాట్యం చేస్తుంది.

వేరుశనక్కాయలు కొనుక్కుని అవి తడవకుండా పొట్లాన్ని ప్యాంట్ జేబులో పెట్టుకున్నాను. పైన కోటుకూడా ఉంది కాబట్టి తడిసే అవకాశమే లేదు.

తలుపు తట్టగానే శిరీష తలుపు తీసి "ఓ నువ్వా... రా లోపలికి" అంది.

లోపలికెళ్ళి కోటు విప్పదీసి కుర్చీమీద వేసి, మరో కుర్చీ లాక్కుని కూర్చున్నాను. ఆమె నా ఎదురుగా సోఫాలో కూర్చుంది.

"మీకు వేరుశనగపప్పులు తినడం ఇష్టమా?" అని అడిగాను.

"చాలా ఇష్టం. వర్షం పడుతోంది కదా. వేయించిన పప్పులు తింటుంటే ఎంత బావుంటుందో" అందామె.

"హమ్మయ్య.... బతికించారు. నేను పల్లీలు కొనుక్కొచ్చానని తెలిసి నవ్వుతారేమోనని భయపడ్డా" జేబులోంచి పల్లీల పొట్లం తీసి ఆమె పక్కన పెట్టాను.

## మనమీదేనర్రోయ్!

సరసి





"ఇవంటే నాకిష్టమని నీకెలా తెలుసు?" అందామె చిన్నపిల్లలా సంబరపడిపోతూ.

"నాకూ ఇష్టమే. అందుకే తెచ్చాను".

"ఒక్క క్షణం ఉండు. ఇంట్లో బెల్లం ఉంది. దాంతో నంజుకుని తిందాం" అంటూ లోపలి నుంచి బెల్లం ఉండ తెచ్చి దాన్ని రెండు ముక్కలు చేసింది.

"అక్కడ కూర్చుంటే ఎలా... ఇక్కడికిరా.. తిందాం" అంది తన పక్కన సోఫాలో చోటు చూపిస్తూ.

బిడియపడుతూనే వెళ్ళి ఆమె పక్కన కూర్చున్నా. మా ఇద్దరి మధ్యలో పల్లీల పొట్లం విప్పదీసి పెట్టింది. ఓ బెల్లం ముక్క నా చేతికిచ్చింది.

"నీకు అక్కలూ చెల్లెళ్ళూ లేరా?"

"లేరు"

"అందుకే అంత మొహమాటం నా పక్కన కూచోడానికి... నాలాంటి అక్క ఉండి ఉంటే నాలుగు మొట్టి పక్కన కూర్చోబెట్టుకునేది".

తొందరగా దాన్ని వదిలించుకో".

"పరిచయమై ఒక్కరోజు కూడా కాకుండానే చనువు తీసుకుంటే ఏమైనా అనుకుంటారని..."

"పరిచయం ఒకరోజుదా లేక ఏడాదిదా లేక జీవితకాలం పరిచయమా అనేది ముఖ్యంకాదు. ఆ పరిచయం ఎంత గాఢమైందీ అనేదే ముఖ్యం. నువ్వు నాకు చాలా యేళ్ళ నుంచి పరిచయం ఉన్న వాడిలా అనిపిస్తావు తెలుసా?"

"మీ వారు ఎలా చనిపోయారు?"

ఆమె నా వైపు కొన్ని క్షణాలు చూసి దీర్ఘంగా నిట్టూర్చింది.

"మా పెళ్ళయ్యేనాటికి ఆయనకు ఆరోగ్యస మస్య ఉండింది. గుండెకు సంబంధించిన ఏదో జబ్బు. గుండె కండరాలు బలహీనపడే తీవ్రమైన జబ్బు. దానికి మందులు లేవట. అది ముదిరిపోతే గుండె పనిచేయటం ఆగిపోయి చనిపోవటం




ఖాయమని చెప్పారు డాక్టర్లు.

"మీకా విషయం పెళ్ళికి ముందు తెలియదా?"

"తెలుసు. మాది ప్రేమవివాహం. ఇద్దరం ఒకే కాలేజీలో చదువుకున్నాం. మేము ప్రేమించుకునే రోజుల్లోనే ఓసారి స్పృహతప్పి పడిపోతే నేనే దగ్గ రుండి ఆస్పత్రికి పిల్చుకెళ్ళాను. అప్పటికే కండరాలు బాగా బలహీనపడ్డాయని, మరో ఐదేళ్ళకు మించి బతక్కపోవచ్చని డాక్టర్లు చెప్పారు. తన అనారోగ్యం గురించి తెలుసుకుని నిరాశలో కుంగిపోయాడు. పెళ్ళి చేసుకుందామని అడిగితే ఒప్పుకోలేదు. ఆరో గ్యంగా ఉండే వ్యక్తిని చేసుకుని సుఖపడొచ్చుగా అన్నాడు. నేనే పట్టుబట్టి చేసుకున్నాను. ప్రేమనేది చాలా అపురూపమైన భావన రామక్రిష్ణా. అందులో స్వార్థం ఉండదు త్యాగం తప్ప. 'ఎప్పుడు చనిపోతానో తెలియని నన్ను చేసుకుని ఎందుకు పోయిపోయి కష్టాల్ని, కన్నీళ్ళని కౌగిలించుకుంటావు? ప్రేమలూ త్యాగాలూ లాంటి సెంటిమెంట్స్ వదిలిపెట్టు. ఇంకె వర్నయినా చేసుకుని సుఖంగా ఉండు' అన్నాడు. 'సుఖమైనా సంతోషమైనా నీతోనే' అన్నాను. చివరికి నా చేతుల్లో నవ్వుతూ ప్రాణాలు విడిచాడాయన".

"ఆయన పేరేమిటి?"

"వాళ్ళది మా కులం కాదు. మన మతమూ కాదు. వాళ్ళు క్రిస్టియన్లు. ఆయన పేరు జోసెఫ్.

నాకు మా అమ్మ గుర్తొచ్చింది. నాకిష్టమని పల్లీలు వేయించి పెట్టేది. ఇద్దరం వసారాలో కింద కూర్చుని పల్లీలు వల్చుకుని తింటూ మధ్య మధ్యలో బెల్లం ముక్క కొరుక్కునే వాళ్ళం. అమ్మనెంత అస హ్యించుకున్నా, ఆమె జ్ఞాపకాలు మాత్రం ఎప్పటికీ వదలవు.

"నాకో విషయం సంతోషంగా ఉంది తెలుసా. పిజ్జాల్లో, బర్గర్‌ల్లో, హోటల్ తిండో కాకుండా పల్లీలు తెచ్చావు చూడు. ఐ లైక్డ్ ఇట్. నేను నిన్ననే చెప్పాగా. నువ్వు చాలా బుద్ధిమంతుడివని. డౌన్ టు ది ఎర్త్ అంటారే. నీ ఇష్టాలు, ఆలోచనలు, అభి ప్రాయాలు... చాలా సింపుల్ జీవితాన్ని ఇష్టపడ తావు. సింపుల్ లివింగ్ హైథింకింగ్ అంటారే... నువ్వు చాలా గొప్పవాడివవుతావు".

"నాలో అలాంటి గొప్పతనం ఏమీలేదులెండి. అతి సామాన్యుడిని. చదువూ అంతంత మాత్రమే. ఫెయిలయ్యే బాపతు" అన్నాను.

"చదువుకీ గొప్పతనానికీ సంబంధం లేదు. చూస్తూ ఉండు. ఏదో రోజు నువ్వు గొప్పవాడివవుతావు".

పల్లీలు తింటూ కొద్దిసేపు నిశ్శబ్దంగా గడిపాక ఆమెవైపు చూస్తూ "మీరేమీ అనుకోనంటే ఓ మాట అడగనా?" అన్నాను.

"ఇంకా నీకు మొహమాటం పోలేదబ్బాయ్.

ఎంతమంచివాడో... అతన్నిచూస్తే కరుణామయు డైన ఏసుక్రీస్తు మరలా జన్మించాడేమో అనేలా ఉండేవాడు. అతనికి తెలిసిన విషయాలు రెండే. ప్రేమా, కరుణా... కళ్ళలో నిరంతరం కనిపించే ఆర్ద్రత... మనుషుల మీద అపారమైన ప్రేమ.. నన్ను అతని వైపుకి ఆకర్షించిన లక్షణాలు ఇవే".

"పెళ్ళికి మీ పెద్దవాళ్ళు ఒప్పుకున్నారా?"

"ఒప్పుకుంటే వాళ్ళు పెద్దవాళ్ళెలా అవుతారు? మేం బ్రాహ్మలం. వాళ్ళు క్రిస్టియన్లు. దానికి తోడు అతను ఎక్కువకాలం బ్రతకడన్న విషయం కూడా మా వాళ్ళకు తెలిసిపోయింది. బాగా గొడవలైనాయి. 'అల్పాయుష్కుని చేసుకుని నువ్వేం సుఖపడ్తావే' అన్నాడు నాన్న. 'వైధవ్యాన్ని ఏ ఆడదీ కోరుకోదే. సుమంగళిలా చావాలనుకుంటుంది. నువ్వేమిటో నీ తలరాతని నువ్వే ఇలా రాసుకుంటున్నావు?' అంటూ అమ్మ ఏడ్చింది. ఇద్దరం కూడబలుక్కుని ఎవ్వరికీ చెప్పకుండా ఈ ఊరికొచ్చేశాం".

"పెళ్ళి చర్చిలో చేసుకున్నారా?"

"లేదు".

"గుళ్ళోనా?"

"కాదు. అలా చేసుకుంటేనే పెళ్ళా? ఈ తాళి కూడా ఆయన కట్టలేదు. నేనే మెళ్ళో వేసుకున్నా... ఈ సమాజం కోసం. స్త్రీ పురుషుల్ని భార్యాభర్తల్ని చేసేది ఈ పసుపుతాళ్ళో, మంత్రాలో, చర్చిలో ఫాదరో, గుళ్ళో పూజారో కాదు. వాళ్ళిద్దరి మనసు... వాటిలో ఉండే గాఢమైన అనుభూతి. జోసెఫ్ నా భర్త. నేనతని భార్యని."

"పిల్లలు..." అంటూ సగంలో ఆపేశాను.

"మేమే వద్దనుకున్నాం. జోసెఫ్‌కున్న సమస్య జెనెటిక్ సమస్య. అది వంశపారంపర్యంగా పిల్లల కొచ్చే అవకాశం ఉంది. అందుకే... ఈ విషయంలో కూడా జోసెఫ్ బాధపడేవాడు. 'నేను లేకున్నా కనీసం పిల్లలైనా ఉంటే నీకు తోడుండేవారు శిరీ. ఒంటరిగా ఎలా బతుకుతావో ఏమిటో' అంటూ కన్నీళ్ళు పెట్టుకునే వాడు".

"మీరు చాలా గొప్పవారు".

"అలా అనుకోవడం తప్పు. నన్ను గొప్పదాన్ని అంటున్నావంటే జోసెఫ్‌ని తక్కువ చేసినట్టు కాదా? జోసెఫ్ చాలా గొప్పవాడు. ఏసుక్రీస్తులానే చిన్న వయసులో పరలోకానికెళ్ళి పోయాడు".

"మీరు చేసిన త్యాగం ఎవ్వరూ చేయలేరు".

"అది త్యాగం కాదు... ఇష్టం... ప్రేమ".

నాకు ఆమె మీదున్న గౌరవం ఎన్నో రెట్లు పెరి గింది. "ఈ క్షణం నాకేమనిపిస్తుందో తెలుసా? మీ కాళ్ళకు మొక్కాలని" అన్నాను.

ఆమె పెద్దగా నవ్వింది. "నాకేమనిపించిందో తెలుసా? జోసెఫ్ కాళ్ళకు మొక్కాలని. జోసెఫ్‌ని చూస్తే దేవుడే మనిషి జన్మ ఎత్తాడేమో అనిపించేది".

నేను వెళ్ళబోతున్నప్పుడు "మళ్ళా ఎప్పుడొస్తావు?" అందామె.

"మీరు గుర్తొచ్చినప్పుడు" అన్నాను.

ఆమె నవ్వి "రేపొస్తావన్నమాట" అంది.

*(ఇంకా వుంది)*



# సంగతులూ! సందర్భాలూ! 8



-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

# యోగక్షేమాలు

**యోగం అంటే–**
**మనకి లేనిది వచ్చిచేరడం.**
**క్షేమం అంటే–**
**మనకి ఉన్నది చేజారిపోకుండా నిలవడం.**

ఒకనాటిరాత్రి నీలాల వెన్నెల, లోకానికి చల్లచల్లగా వింజామరలు వీచేవేళ ఆకాశంలో ఒక హంసలగుంపు తెల్లని కెరటాల మాదిరి ఊగులాడుతూ ప్రయాణిస్తోంది. వాటిభాషలో చమత్కారాలుపోతూ మాట్లాడుకుంటున్నాయి కూడాను.

దబాటుగా తన పక్కకి జరిగి రెక్కలార్చుతూ కూనరాగాలు తీస్తున్న మరొకహంసతో ఒక హంస మాట కలిపింది. "ఒయ్యోయి భల్లాక్ష! – అలా క్రిందికొకసారి చూడు – అదే ఆ రాజప్రాసాదం పైభాగాన స్తిమితంగా అటూఇటూ పచార్లు చేస్తున్నాడే ఆయన జానశ్రుతి అనే మహారాజు. గొప్ప దాత. మొక్కుబడిగా కాకుండా ఎందరికో ఉదారంగానూ, గౌరవంతోనూ ఎన్నో దానాలు చేశాడు. ధారాళంగా అన్నదానాలు చేశాడు. ప్రతిచోట సత్రాలు నిర్మించి "ప్రజలంతా నా అన్నమే తినాలి" అని మనసారా కోరుకున్నాడు. నీకు ఇప్పుడు చెప్పొచ్చే మాట ఏమిటంటే, ఈ జానశ్రుతి కీర్తికి సంబంధించిన తేజస్సు, పగటి వెలుగంత వెల్లడిగా స్వర్గం దాకా ప్రసరిస్తుంది. ఒళ్లు జాగ్రత్త. అటువైపు ఏమరుపాటుగా వెళ్లావో, మాడిపోతావు" అంటూ హెచ్చరించింది.

అది విని భలాక్షం బెదిరిపోలేదు. పైగా చిరునవ్వు నవ్వి గొంతు సవరించుకుని, "అరే! అలాగా! అయితే ఈ జానశ్రుతిగారు రైక్వుడనే బండివాడి కంటే గొప్పవాడా ఏమిటి?" అంటూ టొకాయించింది.

"ఓహో! ఏం ఆ బండివాడు అంతగొప్పవాడా?" అంటూ సందేహం వెలిబుచ్చింది మొదటి హంస.

"విషయం చెపుతా విను. పాచికల ఆటలో 'కృత' పాచికను గెలుచుకున్నవాడికి, దానికంటే తక్కువ పాచికలన్నీ దక్కిపోయే మాదిరి, ఈ లోకంలో ప్రాణులంతా చేసే మంచిపనుల గొప్ప ఫలితాలన్నీ, బండివాడు రైక్వుడికి చెందుతాయి. ఇంకో తమాషా విను. రైక్వుడికి ఏమి తెలుసునో తెలుసుకున్న వాళ్లకి కూడా ఆ మంచిపనుల ఫలితాలు దక్కేస్తాయి."

"విచిత్రంగానే ఉంది. 'కృత'పాచిక గెలవడం అంటున్నావు. ముందు అదేమిటో చెప్పు భల్లాక్షా!"

"ఏమీ మర్మం లేదు మిత్రమా! పాచిక నాలుగు పలకలుగా ఉంటుంది. నాలుగు అంకె ఉన్న వైపునకు 'కృత' అని పేరు. మూడంకె వైపు త్రేత. రెండంకెవైపు ద్వాపర. ఒకటి అంకె ఉన్న వైపు కలి, 'కృత' అన్నిటికంటే ఎక్కువ. అది పడి పందెం గెలిచిన వాడికి, మిగిలిన పాచిక భాగాలన్నీ చెందిపోతాయి. అదీ! బండివాడు రైక్వుడిస్థాయి" అంటూ భలాక్షం విశదం చేసింది.

ప్రాసాదం పైనే విహరిస్తున్న జానశ్రుతి ఈ మాటలు విన్నాడు. తనకి అందుబాటులో కాస్త దూరంగా నిలబడి ఉన్న పరిచారకుణ్ణి దగ్గరగా పిలిచి, "క్షత్తా! నేను ఆ బండి వాడు రైక్వునితో సమానుణ్ణేనా? ఈ రైక్వుడు ఎక్కడ ఉంటాడు?" అని ఆత్రుతగా అడిగాడు.

అడిగాడంటే వెదకమనే అర్థం.

ఆ క్షత్త దేశానపడి తెగ వెదికాడు. రైక్వుడు ఎక్కడా కనబడలేదు. అదే మాట తిరిగివచ్చి జానశ్రుతికి చెప్పాడు.

"క్షత్తా! వెదకడం అలాగ కాదు. రైక్వుడు బ్రహ్మవేత్త అయి ఉంటాడు. అటువంటివాడు జనసందోహం మధ్య జీవించడు. ఒంటరిగా ఉంటాడు. అటువంటి చోట్ల వెదుకు" అంటూ మళ్ళీ పంపించాడు.

క్షత్త తిరగ్గా తిరగ్గా, చేతులమీద చిడుం పొక్కులు గోక్కుంటూ ఒక బండికింద కూర్చున్న వ్యక్తి కనిపించాడు. "అయ్యా, రైక్వుడంటే మీరేనా?" అని అడిగాడు క్షత్త. "అవున్నాయనా, నేనే. ఏమి కావాలి?" అని ప్రశ్నించాడు. "ఇప్పుడే వస్తాను" అంటూ వెళ్ళి, ఆరువందల ఆవులు, ఒక బంగారు మెడగొలుసు, కంచరగాడిదలు లాగే ఒక రథాన్ని జానశ్రుతి మహారాజు వెంటబెట్టుకుని వెళ్ళి రైక్వుణ్ణి కలుసుకునే తక్షణ ఏర్పాట్లు చేశాడు క్షత్త.

"రైక్వుడా! ఈ కానుకలు స్వీకరించి, నువ్వు ఉపాసించే తత్త్వం ఏమిటో నాకు ఉపదేశించు" అంటూ జానశ్రుతి వేడుకున్నాడు. "ఏమయ్యా పాలకుడా! ఆ కానుకలేవో నువ్వే ఉంచుకో" అని మౌనం వహించాడు అతడు.

జానశుత్రి పట్టువదలకుండా, ఆవులసంఖ్య వేయికి పెంచి, బంగారుమెడగొలుసు, కంచర గాడిదల రథంతో బాటు ఈసారి తన కూతురిని కూడా తెచ్చి రైక్వుణ్ణి వేడుకున్నాడు.

"ఒయ్యోయి దుఃఖితుడా! నీ కూతురును నాకు ఇస్తానంటూ, ఇవన్నీ నాకోసం తెచ్చావు. నన్ను తప్పక మాట్లాడేలాగ చేస్తున్నావు, సరే" అన్నాడు రైక్వుడు. అప్పుడు జానశ్రుతి మహావర్షంలోని గ్రామాలన్నింటినీ అతడికి అరణంగా ఇచ్చేశాడు. తరువాత ఆ దేశమే రైక్వపర్ణంగా ప్రసిద్ధి పొందింది. రైక్వుడు తన భార్యతో కలిసి అక్కడ జీవించాడు.

ఇప్పుడు రైక్వుడు మాట్లాడడానికి ఉపక్రమించాడు.

"దుఃఖితుడా! ఉన్న విషయం విను. 'సంసర్గా'లని రెండు విశేషాలున్నాయి. ఒకటి దేవతలకు సంబంధించినది. మరొకటి మన శరీరాలకు సంబంధించినది.

ముందు దేవతా సంబంధమైనదేదో చెపుతాను. 'గాలి' అంటే వాయువు ఉంది చూశావు! అది అన్నింటినీ తనలోకి పీల్చుకుంటుంది. నిప్పు ఆరిపోయిందనుకో అది కలిసిపోయేది గాలిలోనే. సూర్యుడు అస్తమించాక కలిసిపోయేది గాలిలోనే. చంద్రుడు అస్తమించాక కలిసిపోయేది గాలిలోనే. నువ్విక్కడ గ్రహించవలసిన సత్యం: వాయువు చలనం కలిగించేశక్తి. అందువల్ల దానిని "పీల్చుకునేదానిని"గా "తనలో పోగు చేసుకునే దానిని"గా ఉపాసించు.

ఇక రెండవది: శరీరానికి సంబంధించిన సంసర్గం. మన శరీరంలో "పీల్చుకునే" (తనలో కలుపుకునే) శక్తి కలది ప్రాణం. ఉదాహరణ చెపుతా, విను. ఒక మనిషి నిద్రించేవేళ వాక్కు (మాట) ప్రాణంలో కలుస్తుంది. కన్ను ప్రాణంలో కలుస్తుంది. చెవి ప్రాణంలో కలుస్తుంది. మనస్సు ప్రాణంలో కలుస్తుంది. అంటే మన శరీరంలో ప్రాణం వీటినన్నిటిని పీల్చుకుంటుందన్న మాట, దాన్ని ఉపాసించు.

అసలైన లోకతత్త్వం రెండింటిలోనే ఉంది. ఆ రెండిటి స్వభావం "తమలోకి పీల్చుకోవడం." అవి దేవతల్లో 'వాయువు', జ్ఞానేంద్రియాలలో ప్రాణం. ఇంతకుమించిన పర్యవతత్త్వమంటూ ఏమీ లేదు.

రైక్వుడి బోధ ముగిసింది. జానశ్రుతికి బోధపడిన విశేషాలు రెండు.

తన దానధర్మాల ద్వారా తనకింతకాలం దక్కినది యోగం.

ప్రపంచ మూలతత్త్వం గ్రహించిన రైక్వుడి జ్ఞానం, క్షేమం!

ఈ విశేషం తేల్చి చెపుతుంది ఛాందోగ్యోపనిషత్తు. నవ్య



# సౌభాగ్య చక్రం

**ఆగస్టు 30 నుంచి సెప్టెంబర్ 5 వరకు**

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధ, గురువారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాల్లో సత్ఫలితాలు సాధిస్తారు. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 1, 2 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రమోషన్లు, గౌరవపదవులకు అవకాశం ఉంది. 3, 4, 5 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యంకోసం ఖర్చులు అధికం. ఆర్థిక విషయాల్లో సహోద్యోగులు మొహమాట పెట్టే అవకాశం ఉంది.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, వృత్తి వ్యాపారాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. 1, 2 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. శుభవార్త అందుకుంటారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. 3, 4, 5 తేదీల్లో చిన్నారుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వేడుకలు, ప్రయాణాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 1, 2 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. గృహరుణాల కోసం ప్రయత్నిస్తారు. 3, 4, 5 తేదీల్లో వేడుకల్లో అసౌకర్యానికి గురయ్యే అవకాశం ఉంది. బదిలీ ప్రయ త్నాలు ఫలించకపోవచ్చు. దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. రక్షణ, న్యాయ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారికి ప్రోత్సాహకరం. విందుల్లో పాల్గొంటారు. 1, 2 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. ప్రియతములతో ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 3, 4, 5 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లోపిస్తుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. పూర్వ మిత్రులను కలుసుకుంటారు.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

అదనపు ఆదాయం, పెట్టుబడులు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. చిట్‌ఫండ్లు, బ్యాంకింగ్ రంగాల వారికి ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో వృత్తి వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 3, 4, 5 తేదీల్లో సెక్యులేషన్లు లాభించకపోవచ్చు. ఆర్థిక వ్యవహారాల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకల్లో పాల్గొంటారు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు కొత్త ఆలోచనలు చేస్తారు. బదిలీలు, మార్పులపై దృష్టి సారిస్తారు. ఫర్నీచర్ కొనుగోలుకు అనుకూలం. 1, 2 తేదీల్లో పొదుపు పథకాలపై ఆశించిన ప్రతిఫలం అందుకుంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులకు శుభప్రదం. 3, 4, 5 తేదీల్లో కృషి రంగంలో పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. హోటల్, వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో దూరప్రయాణాలు, ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. చర్చలు సత్ఫలితాలనిస్తాయి. రహస్య సమాచారం అందుకుంటారు. 1, 2 తేదీల్లో కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం. 3, 4, 5 తేదీల్లో విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించాలి. ఒక సమాచారం కలవరపెడుతుంది.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 1, 2 తేదీల్లో సోదరీ సోదరుల వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. విలువైన పత్రాలు అందుకుంటారు. విద్యాసంస్థలతో పనులు పూర్తవుతాయి. స్నేహానుబంధాలు బలపడతాయి. 3, 4, 5 తేదీల్లో ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు జాగ్రత్తలు పాటించాలి. గృహరుణాల మంజూరులో ఆటంకాలు ఎదురవుతాయి.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, అదనపు ఆదాయం, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రముఖుల సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 1, 2 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. అదనపు ఆదాయం లభిస్తుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 3, 4, 5 తేదీల్లో ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఒక శుభవార్త ఉల్లాసం కలిగిస్తుంది. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వ్యూహాలు, విద్య, ఆర్థిక విషయాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. న్యాయ, బోధన, రక్షణరంగాల వారికి ప్రోత్సాహకరం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. 1, 2 తేదీల్లో ప్రణాళికలు ఫలిస్తాయి. రక్షణ, న్యాయ, బోధన రంగాల వారికి కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. సంకల్పం ఫలిస్తుంది. 3, 4, 5 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా లేకపోవడం వల్ల నష్టపోతారు. ఖర్చులు అధికం. పారితోషికాలు అందుకుంటారు. దూరప్రయాణాలకు అనుకూలం. ఆర్థిక విషయాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

ఆర్థిక వ్యవహారాలు, రుణప్రయత్నాలు, ఆరోగ్య విషయాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. రుణాలు మంజూరవుతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 1, 2 తేదీల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 3, 4, 5 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. గత స్మృతులు నెమరువేసుకుంటారు. వాయిదా పద్ధతిపై వస్తువులు సమకూర్చుకుంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపడం మంచిది.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. భాగస్వామి సహకారంతో వృత్తి వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. గౌరవ పదవులు అందుకుంటారు. 1, 2 తేదీల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకలు, సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. స్నేహానుబంధాలు బలపడతాయి. 3, 4, 5 తేదీల్లో ప్రియతములు, బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రియతముల మధ్య దాపరికాలు తగవు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు.

నవ్య



# అతనెంతో ప్రత్యేకం!




కొంతమంది హీరోయిన్లు సినిమా ముచ్చట్లే కాక, తమ వ్యక్తిగత విషయాలను కూడా ఏమాత్రం సంకోచించకుండా తమ అభిమానులతో పంచుకుంటుంటారు. అలాంటివారిలో ముందుంటుంది గోవా బ్యూటీ ఇలియానా. బాద్‌షాహో చిత్ర ప్రమోషన్‌లో భాగంగా తన ప్రియుడు ఆండ్రూ నిబోన్ గురించి ప్రత్యేకంగా చెప్పుకొచ్చింది ఇల్లీబేబి. పెళ్లితో చాలా మంది జీవితాల్లో ఎన్నో మార్పులు చోటుచేసుకుంటాయనీ, కానీ తన విషయంలో అలా ఎప్పటికీ జరగదనీ, తన మనసులో ఆండ్రూ పట్ల ఉన్న కమిట్‌మెంట్స్ ఎప్పటికీ మారవనీ అంటోంది. పెళ్లికి సహజీవనానికి పెద్ద తేడా ఏమీ లేదని, తన జీవితంలో అతనెంతో ప్రత్యేకమని అందరి ముందూ తన మనసులోని ప్రేమను వెల్లడించింది ఇలియానా.

## 34ఏళ్ల తరువాత...

ఏ సినిమా అయినా సరే వీలైనంత త్వరగా ప్రేక్షకుల ముందుకు తీసుకురావాలని నిర్మాతలు కోరుకుంటారు. కానీ ఈ సినిమా మాత్రం 34 సంవత్సరాల తర్వాత విడుదలకు నోచుకుంది. నసీరుద్దీన్ షా, షబానా ఆజ్మీ భార్యాభర్తలుగా నటించిన లిబాస్ అనే బాలీవుడ్ సినిమాను 34ఏళ్ల తర్వాత తొలిసారిగా థియేటర్లలో విడుదల చేయబోతున్నారు. ఈ సినిమా కథారచయిత, దర్శకుడు గుల్జార్‌కు, సినిమా నిర్మాత వికాస్ మోహన్‌కు మధ్య తలెత్తిన వివాదం కారణంగా ఈ సినిమా విడుదల ఆగిపోయింది. గత సంవత్సరం వికాస్ మరణించారు. దాంతో సినిమా నిర్మాణ బాధ్యతలు తీసుకున్న ఆయన కుమారుడు అముల్ మోహన్ ఈ సినిమాను విడుదల చేయాలని నిర్ణయించారు. గుల్జార్ రాసిన 'సీమ' అనే కథ ఆధారంగా ఈ చిత్రాన్ని నిర్మించారు. ఇందులో సీమగా షబానా ఆజ్మీ నటించగా, ఆమెకి భర్తగా నసీరుద్దీన్‌షా నటించారు. అతి త్వరలో ఈ సినిమాను విడుదల చేస్తామని అముల్ మోహన్ చెప్పారు.



## 'ప్రస్థానం' రీమేక్?

శర్వానంద్, సందీప్ కిషన్, సాయికుమార్ ప్రధాన పాత్రల్లో నటించిన చిత్రం ప్రస్థానం. 2010లో విడుదలైన ఈ చిత్రం మంచి పేరు తెచ్చుకుంది. అయితే ఈ సినిమా ఖల్‌నాయక్ సంజయ్ దత్‌కి తెగ నచ్చేసిందట. అందుకే నిర్మాతగా మారి ఈ సినిమాని హిందీలో రీమేక్ చేయాలనుకుంటున్నాడట. సాయికుమార్ పోషించిన పాత్రలో సంజయ్ నటించనున్నట్లు బాలీవుడ్ వర్గాల సమాచారం. ప్రస్తుతం సినిమా హక్కులపై ప్రస్థానం దర్శకుడు దేవ కట్టాతో సంప్రదింపులు జరుగుతున్నాయని, త్వరలోనే క్లారిటీ వస్తుందని అంటున్నారు.



## బాహుబలి 2 తర్వాత ఇదే...

ఇటీవలి కాలంలో బాహుబలి 2 తర్వాత అంతటి భారీ స్థాయిలో విజయాన్ని సాధించిన సినిమాలేవీ బాలీవుడ్‌లో రాలేదనే చెప్పవచ్చు. బాహుబలి 2 తర్వాత ఈమధ్యకాలంలో అత్యధిక వసూళ్లు సాధించిన చిత్రంగా 'టాయిలెట్ ఏక్ ప్రేమ్‌కథ' సినిమా నిలిచింది. ఇప్పటికే ఈ చిత్రం అందరి మన్ననలను అందుకుని 100 కోట్ల మార్కుని దాటి, రికార్డు సృష్టిస్తోంది. అయితే ఈ సినిమాలో అక్షయ్‌కుమార్ నటించటంపై కొన్ని విమర్శలు తలెత్తాయి. ప్రభుత్వ ప్రచారం కోసమే అక్షయ్ ఈ సినిమాలో నటించాడని కొందరు బహిరంగంగానే విమర్శించారు. అలాంటివారికి తన ట్విటర్ ద్వారా సమాధానమిచ్చారు అక్షయ్. విమర్శించినవారే ఇప్పుడు థియేటర్లలో విజిల్స్ వేస్తున్నారని ట్వీట్ చేశారు. అలాగే దేశంలో ఈ సినిమా ఒక మార్పును తీసుకురావాలని కోరుకుంటున్నట్లు చెప్పారు.



## కొత్తవాళ్లతో చేయడట!

నూతన నటీనటులను వెండితెరకు పరిచయం చేసే దర్శకులలో తేజ ముందువరుసలో ఉంటారు. అయితే తేజ ఇక కొత్తవాళ్ళతో సినిమా చేయనని నిర్ణయం తీసుకున్నట్లు సినీవర్గాల సమాచారం. విభిన్న ప్రేమకథలతో కొత్త ట్రెండ్‌ని సృష్టించిన తేజ, తన సినిమాల్లో ఎక్కువగా కొత్తముఖాలనే పరిచయం చేస్తుంటారు. అయితే వాళ్ళకి నటన నేర్పిస్తూ, అనుకున్న అవుట్‌పుట్ రావడానికి చాలా సమయమే తీసుకుంటుందని, దానివల్ల సమయం వృథా అవుతోందని వాపోతున్నాడట. అందుకే ఇకమీదట కొత్తవాళ్లతో ప్రయోగాలు చేసి సమయం వృథా చేసుకోకూడదనే నిర్ణయానికి తేజ వచ్చాడని అంటున్నారు. కథలు సిద్ధం చేసుకుంటూ, క్రేజ్ ఉన్న హీరో హీరోయిన్లతో మాత్రమే సినిమాలు చేస్తూ ముందుకు వెళతానని సన్నిహితులతో చెబుతున్నారట. ఇదిలా ఉంటే తేజ తీసుకున్న నిర్ణయంలో తప్పేమీ లేదని ఫిల్మ్‌నగర్‌లో టాక్ వినిపిస్తోంది.





# నచ్చితేనే చేస్తా

## -తాప్సీ పన్ను

**ఉంగరాల జుత్తుతో... పాల నురగలాంటి మోముతో....గలగల నవ్వులతో 'గుండెల్లో గోదారి'ని తలపించే అందం ఆమెది. ఆమె మరెవరో కాదు ఢిల్లీపాప తాప్సీ పన్ను. 'ఝుమ్మంది నాదం' అంటూ తెలుగులోకి దూసుకొచ్చిన తాప్సీ కొన్ని సంవత్సరాల పాటు తన అందచందాలతో దక్షిణాదివారిని అలరించి ఆ తరువాత బాలీవుడ్ బాట పట్టింది. మిగతా భాషల్లో ఎంత బిజీగా ఉన్నా తనను ఆదరించిన టాలీవుడ్ ప్రేక్షకులకు వినోదాన్ని అందించడానికి 'ఆనందోబ్రహ్మ' అంటూ వచ్చిన తాప్సీతో.....**

### తెలుగులో నటించడానికి చాలా సమయం తీసుకున్నట్టున్నారు?

తెలుగులో నాకు వచ్చిన అవకాశాలన్నీ దాదాపు ఒకే విధంగా ఉండేవి. ఒకటి నవ్వనన్నా నవ్వాలి... లేదా ఏడవాలి. ఈ రెండు భావాలు పలికించి పలికించి నాకే విసుగనిపించింది. ఇక ప్రేక్షకులకు ఎంత బోర్ కొట్టి ఉండాలి? ఒప్పుకుంటూ పోతే ఇలాంటి పాత్రలే వస్తాయని నటనకు బ్రేక్ ఇద్దామనుకుంటున్న సమయంలో బాలీవుడ్‌లో మంచి ఆఫర్ వచ్చింది. నా మొదటి సినిమాలో డిఫరెంట్ క్యారెక్టర్‌తో అక్కడివారికి పరిచయమయ్యాను. అక్కడ వరుసగా సినిమాలు చేయలేదు. కానీ చేసిన సినిమాలన్నీ మాత్రం వెరైటీ క్యారెక్టర్లే. మూస పాత్రలు కానే కావు. ఇక తెలుగు సినిమాల్లో కనిపించవా అంటూ చాలామంది నన్ను అడిగేవారు. నాకు ఇక్కడ ఓ సినిమా చేయాలన్న కోరిక ఉంది. అనుకోకుండా 'ఆనందోబ్రహ్మ' రూపంలో ఓ మంచి పాత్ర దొరికింది.

### బాలీవుడ్‌లో బిజీగా ఉండి, ఈ సినిమాకి ఎలా డేట్లు ఇవ్వగలిగారు?

చెప్పానుగా వెరైటీ కథ వస్తే బాగుండుననుకుంటున్న సమయంలో ఏడాది కిందట ఈ సినిమా దర్శకులు నన్ను కలిశారు. హారర్ కామెడీ అని చెప్పారు. ఆల్రెడీ ఇలాంటి సినిమాలు తెలుగు, తమిళంలో చేశాను. మళ్ళీ అదే స్టోరీనా? అని నాకు నీరసం వచ్చేసింది. కానీ కథ చెప్పడానికి వచ్చిన వారిని నిరుత్సాహ పరచడం ఇష్టంలేక చెప్పమన్నాను. కథ వింటూంటేనే వెరైటీ సినిమా అని అర్థమైపోయింది. కానీ ఆ సమయంలో వారు అడిగిన డేట్లు నా దగ్గర ఖాళీ లేవు. అదే మాట చెప్పాను. కథ నాకు ఓకే. కానీ డేట్లు లేవు. సారీ అన్నాను. ఏడాది తరవాత దర్శకులు నన్ను మళ్ళీ కలిశారు. నా కోసమే ఆగిపోయామని చెప్పారు. నాకు చాలా ఆశ్చర్యం అనిపించింది. ఈ పాత్ర చేయడానికి తెలుగు, తమిళంలో చాలా మంది హీరోయిన్లు ఉన్నారు. కానీ నా మీద అంత నమ్మకం పెట్టుకున్న వారిని కాదనకూడదని వెంటనే ఓకే చెప్పేశాను.

### ముంబయి టు హైదరాబాద్ కష్టమనిపించలేదా?

ఇష్టంతో చేసే ఏ పనైనా కష్టమనిపించదు. ఈ సినిమా విషయంలో అదే జరిగింది. నా సినిమాలకు వస్తున్న ఆదరణ చూస్తున్న తరువాత నేను పడిన కష్టం మరిచిపోతుంటాను. ప్రస్తుతానికి నా షటిల్ సర్వీస్ బాగానే ఉంది.

### సాఫ్ట్‌వేర్ అమ్మాయి నటి ఎలా అయింది?

నా జీవితంలో ఇదొక అనుకోని ప్రయాణం. ఢిల్లీలో బుద్ధిగా ఉద్యోగంలో సెటిల్ అవుదామనుకుంటున్న సమయంలో తెలుగులో అవకాశం వచ్చింది. ఇక ఉద్యోగం అన్న ఆలోచనకు టాటా చెప్పేసి సినీ ప్రయాణం మొదలు పెట్టాను.

### తిరిగి ఉద్యోగం చేసే ఆలోచన ఉందా?

ఇంత పేరొచ్చిన తరువాత ఉద్యోగం చేయాలన్న ఆలోచన ఎవరికైనా వస్తుందా? ఎవరి సంగతో నాకెందుకు? నాకైతే తిరిగి ఉద్యోగం అనే చట్రంలో ఇరుక్కునే ఆలోచన అస్సలు లేదు. అయినా నాకు అంత అవసరం కూడా లేదు. ఓ వైపు నటన, మరో వైపు వ్యాపారం. రెండూ ఉన్నాయి. ఉద్యోగం చేయాల్సిన అవసరం లేదు. ప్రస్తుతానికి నేనే కొంతమందికి ఉద్యోగం ఇచ్చాను. భవిష్యత్తులో మరికొంతమందికి ఇస్తానేమో!

### గ్లామర్ క్యారెక్టర్ల నుంచి పక్కకు వచ్చారు కదా? మాస్‌కి దూరం అవుతానేమో అన్న భయం లేదా?

సినిమా చూసే ప్రేక్షకులలో మాస్ మాత్రమే కాదు. క్లాస్ వాళ్ళు కూడా ఉంటారు. కథ బాగుంటే అన్ని వర్గాల ప్రేక్షకులు సినిమా చూస్తారు. గ్లామర్ అంటే దానికి అంతే లేదు. ఒక సినిమాలో నేను అందంగా, గ్లామర్‌గా కనిపిస్తే మరొక సినిమాలో మరో హీరోయిన్ నాకన్నా అందంగా, గ్లామర్‌గా కనిపించవచ్చు. హీరోయిన్ గ్లామర్ చూసి సినిమాను ఆదరిస్తారంటే నేను ఒప్పుకోను. గతంలో ఆ పరిస్థితి ఉండేదేమో నాకు తెలియదు. ప్రస్తుతం ప్రేక్షకుల అభిరుచిలో చాలా మార్పు వచ్చింది. ఆ మార్పు సినిమా సక్సెస్‌లో బాగా కనిపిస్తోంది.



### గ్లామర్ క్యారెక్టర్లకు ఫుల్‌స్టాప్ పెట్టేసినట్టేనా?

పెట్టేసినట్టేనా కాదు. వాటిని చేయను. చెప్పాను గా. కథ నచ్చితేనే చేస్తా. వెరైటీ కథలు ఉన్న వారే నా దగ్గరకు వస్తారు. నాతో చేస్తారు. అలాంటివి రాకపోతే సినిమాలు చేయడం మానేస్తాను తప్ప మనసు చంపుకోను.

### హీరోయిన్ ఓరియెంటెడ్ సినిమాలు అయితేనే చేస్తానంటారు?

మరీ అంత బరువైన సినిమాలంటే కష్టం. మొత్తం సినిమా అంతా నా మీద వేసుకుని నడిపించే శక్తి నాకు లేదేమో అనిపిస్తుంది. ప్రస్తుతానికి అలాంటివి చేయాలని అనుకోవడం లేదు. వెరైటీ కథల్నే ఎంచుకుంటున్నాను.

### తాప్సీకి పొగరు ఎక్కువ అంటూంటారు. ఎంత వరకు నిజం?

నాది పొగరు కాదు. ఆత్మవిశ్వాసం. నిజాన్ని నిర్భయంగా అడిగినా, చెప్పినా దాన్ని పొగరు అంటే ఎలా? చిన్నతనం నుంచీ నాకు కాస్త ధైర్యం ఎక్కువే! మా పేరెంట్స్ నన్నూ, నా చెల్లినీ అలా పెంచారు. మనసులో ఉన్నది ఉన్నట్టు మాట్లాడతాను. బయటకి ఒకటి మాట్లాడి, లోపల మరొకటి అనుకోవడం నాకు చేతకాదు. నాకు న్యాయం అనిపించింది చేస్తాను. అన్యాయం జరిగితే ధైర్యంగా అడుగుతాను. ఎదిరిస్తాను. ఇవన్నీ చూసి తాప్సీకి పొగరు అన్న బిరుదు ఇచ్చేస్తున్నారు. వాస్తవానికి నేను ఏమిటి? అన్నది నాతో పనిచేసే వారికి బాగా తెలుసు. నాతో పనిచేసిన వారెవ్వరూ నాకు అలాంటి బిరుదు ఇవ్వరు.

### స్టార్ హీరోలతో చేయలేదన్న బాధ లేదా?

స్టార్ హీరో లేదా స్టార్ హీరోయిన్ అన్న బిరుదు ఎలా ఇస్తారో నాకు తెలియదు. వరుస సినిమాలు హిట్టయితే స్టార్ బిరుదు ఇస్తారా? లేదా ఎక్కువ మంది అభిమానులుంటే ఇస్తారో నాకు అర్థం కాదు. నాకు తెలియని విషయాల గురించి నేను ఎక్కువగా ఆలోచించను. నాకు కథ ముఖ్యం కానీ చిన్న హీరోనా? పెద్ద హీరోనా? అన్నది సమస్య కాదు. ఆ మాటకొస్తే నేనేమీ పెద్ద హీరోయిన్‌ని కాదు. అలాగని ఫ్లాప్ హీరోయిన్‌ని కాదు. నా సినిమాలేవీ నా వలన ఫ్లాప్ కాలేదు. ఇప్పుడు చిన్న హీరోల సినిమాలు కూడా వరుసగా భారీ విజయాల్ని సొంతం చేసుకుంటున్నాయి.. స్టార్ అన్న మాట కొందరు సృష్టించిందే తప్ప ప్రేక్షకులకు అలాంటి ఫీలింగ్స్ ఉండవని అనుకుంటున్నాను.

Taapsee Pannu

### తోటి హీరోయిన్లు అడ్వర్టైజ్‌మెంట్ల విషయంలో దూసుకుపోతుంటే మీరు మాత్రం వెనుకపడడానికి కారణం?

అడ్వర్టైజ్‌మెంట్ల విషయంలో నేను వెనుకపడ్డానని ఇప్పటివరకూ ఎప్పుడూ అనుకోలేదు. నేను కొన్ని ఉత్పత్తులకు ప్రచారం చేస్తున్నాను కదా! ఏ ఉత్పత్తికి అయినా నేను ప్రచారం చేయాలంటే ముందు దాన్ని నేను నమ్మాలి. ఉదాహరణకు ఫెయిర్‌నెస్ క్రీముల ప్రకటన గురించి నన్ను అడిగారు. వీటి మీద నాకు పెద్దగా నమ్మకం లేదు. అవి రాసుకుంటేనే తెల్లగా మారతారని నేను నమ్మను. నాకే నమ్మకం కలగని విషయం గురించి నేను ప్రజలకు ఎలా చెబుతాను? సినిమాలైనా, ప్రకటనలైనా నాకు నచ్చితేనే చేస్తాను. లేకపోతే లేదు.

### ఫ్యూచర్ ప్లాన్ గురించి....

ఫ్యూచర్ ప్లాన్లు అంటూ నాకు లేవు. నిన్న జరిగింది గుర్తు పెట్టుకునే అలవాటు లేదు. రేపు ఏం జరుగుతుందో తెలియనప్పుడు దాని గురించి ఆలోచించడం అనవసరం. ప్రస్తుతం ఏం జరుగుతుందో దాని గురించే ఆలోచిస్తాను.

—స్పందన రెడ్డి



# నూరుకట్ల పిశాచం కథలు ౯

-వసుంధర

**పూర్వం ఒక ఊళ్లో సుబ్బమ్మ అనే విధవరాలు ఉండేది. ఒక్కగానొక్క కొడుకు నందనుణ్ణి ప్రాణానికి ప్రాణంగా చూసుకునేదామె. అతడేమంటే అది జరిపిస్తూ తల్లి, అతి గారాబంగా పెంచడంవల్లనేమో, నందనుడు చెడు సావాసాలుపట్టి చెడిపోయాడు. కొడుకుని మార్చాలని సుబ్బమ్మ ఎన్నో ప్రయత్నాలు చేసింది. ఒక్కటీ ఫలించలేదు. పెళ్ళి చేస్తే మారతాడని కొందరు పెద్దలు సలహా ఇచ్చారు. అదీ చూద్దామని ఓ మంచి అమ్మాయినిచూసి కొడుక్కి పెళ్ళి చేసింది. కానీ నందనుడు బాగుపడలేదు సరికదా, రోజూ తాగి ఇంటికివచ్చి భార్యను కొట్టేవాడు. అయినా సుబ్బమ్మలో ఆశచావలేదు. కోడలు కడుపున ఓ కాయ కాస్తే కొడుకు మారతాడని ఆశ పడింది.**

## సుబ్బమ్మ మనుమడు

సుబ్బమ్మ కోడలు పండంటి కొడుకుని కన్నది. సుబ్బమ్మ వాడికి చంద్రయ్య అని పేరు పెట్టింది. నందనుడిలో మాత్రం మార్పేమీ లేదు. పైగా కొడుకును కూడా తనంతటివాణ్ణి చేస్తానంటూ ఆ చంటి వాడి నోట్లో సారాయిచుక్కలు పోసేవాడు. భార్య అడ్డువస్తే చితక బాదేవాడు. సుబ్బమ్మ కోడలు ఈ బాధలు భరించలేకపోయింది. ఆమె ఒకరోజు ఊరు చివర ఏట్లోదూకి, ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయింది. ఆ తర్వాత కొద్దిరోజులకే నందనుడు కొందరు దుష్టులతో పెద్దగొడవ పెట్టుకున్నాడు. ఆ గొడవలో వాళ్ల నందనుణ్ణి చంపేశారు. ఇక సుబ్బమ్మకు మనుమడు చంద్రయ్య ఒక్కడే మిగిలాడు. వాడుకూడా చెడిపోతాడని ఆమె భయం. అందుకని వాణ్ణి బయటకు వెళ్ళనిచ్చేది కాదు. ఎవరితోనూ ఆడుకోనిచ్చేది కాదు. బడికి వెడితే కూడా చెడిపోతాడని భయపడి, వచ్చినంతలో చంద్రయ్యకు తానే అన్నిరకాల చదువులూ నేర్పుతూ పెంచి పెద్ద చేసింది. నాయనమ్మ అడుగుజాడల్లో పెరిగి పెద్దయ్యాడు చంద్రయ్య. కానీ అతడికి ప్రపంచజ్ఞానం శూన్యం. వాళ్ళింటి పెరట్లో రకరకాల పళ్ళ చెట్లు, పూలమొక్కలు ఉన్నాయి. వాటిని ఎలా సంరక్షించాలో చంద్రయ్యకి నేర్పింది సుబ్బమ్మ. ఏం నేర్పినా వాడి తెలివి అంతంతమాత్రమే కావడంతో సుబ్బమ్మకి వాడితో చాలా అవస్థగా ఉండేది. రోజూ ఉదయం నిద్రలేస్తూనే ముందు పెరట్లో మొక్కలకు నీళ్ళు పోయమని సుబ్బమ్మ మనుమడికి చెప్పింది.

చంద్రయ్య అలాగే చేసేవాడు. ఒకరోజు పెద్దగా వాన పడుతోంది. ఆ వానలో తనూ తడుస్తూనే మొక్కలకు నీళ్ళు పోశాడు చంద్రయ్య. సుబ్బమ్మ అది చూసి, “వాన పడుతుంటే మొక్కలకు నీళ్ళెలాగూ దొరుకుతున్నాయిగా, మళ్లీ నువ్వు నీళ్ళు పోయటమెందుకూ?” అంది. “ఇది నాకు తట్టనే లేదు. నీకు ఎన్ని తెలివితేటలే నానమ్మా!” అంటూ చంద్రయ్య ఆశ్చర్యపోయాడు. ఆ ఇంటి పెరట్లో కాసిన పళ్ళు, పూసిన పువ్వులు కోసుకునేందుకు ప్రతిరోజూ మాధవయ్య అనే మారుబేరగాడు వచ్చేవాడు. మాధవయ్య ఇచ్చిన డబ్బుతో వారికి రోజులు హాయిగా గడిచిపోయేవి. ఓరోజు మాధవయ్య రాలేదు. రోజు గడిచేదెలా? అని సుబ్బమ్మ కంగారు పడింది. కారణం తెలుసుకు రమ్మని చంద్రయ్యకి చెప్పింది. అయితే వాడక్కడ ఏం సమస్య తెస్తాడో నన్న భయంతో చంద్రయ్య వెళ్ళేప్పుడు, “ఒరేయ్, అక్కడ మాధవయ్య ఏం చెబితే దానికి నువ్వు ఔను అనాలితప్ప దేనికీ కాదనకూడదు, తెలిసిందా?” అని సుబ్బమ్మ మరీమరీ మనుమణ్ణి హెచ్చరించింది. చంద్రయ్య అలాగేనని తలూపి వెంటనే బయల్దేరాడు. మాధవయ్య ఇల్లు కాస్త దూరం కావడంతో చేరుకునేందుకు కాస్త సమయం పట్టింది.

మాధవయ్య చంద్రయ్యను చూస్తూనే, “ఈ రోజు మా ఇంటికి చుట్టాలొచ్చారు. ఇంట్లో కాస్త హడావుడిగా ఉంది. పళ్ళు, పువ్వులు కాస్త ఆలస్యంగా వచ్చి తీసుకుని వెడతాను. పాపం, నువ్వు శ్రమపడి అనవసరంగా ఇంతదూరం నడిచి వచ్చావు. ఈ విషయం మీ ఇంటికి ముందుగా కబురు పంపించాలని గట్టిగా అనుకున్నాను. కానీ మరచిపోయాను. నేను ఉత్త మతిమరుపు వెధవని” అని నొచ్చుకున్నాడు.

“ఔను” అన్నాడు చంద్రయ్య వెంటనే. దాంతో మాధవయ్యకి చెప్పలేనంత కోపం వచ్చింది. ఆ కోపంలో తన ఇంట్లో చుట్టాలున్నారన్న మాట కూడా మరచిపోయాడు. అప్పటికప్పుడు హుటాహుటిన బయల్దేరి సుబ్బమ్మ ఇంటికి వెళ్ళాడు. “చూశావమ్మా, నీ మనుమడి వ్యవహారం! నన్ను మతిమరుపు వెధవ అంటున్నాడు” అన్నాడు మాధవయ్య సుబ్బమ్మతో. సుబ్బమ్మ ఆశ్చర్యపడింది. “అలా ఎందుకన్నావురా?” అని చంద్రయ్యని నిలదీసింది. చంద్రయ్య వెంటనే, “నువ్వేకదా మాధవయ్య ఏమన్నా ఔననమన్నావ్. ఆయనే తాను మతిమరుపు వెధవనని అన్నాడు. నువ్వు చెప్పినట్లే వెంటనే ఔనన్నాను. ఎందుకో మరి, ఆయనకు కోపం వచ్చింది” అన్నాడు. సుబ్బమ్మకి విషయం అర్థమైంది. ఆమె మాధవయ్యకి పూలూపళ్ళూ ఇచ్చి మంచిమాటలతో సమాధానపరచి పంపింది. తర్వాత ఆమె మనుమడితో, “నేనేది చెబితే అది చేయడం కాదురా, చంద్రయ్యా! ఎవరైనా ఏదైనా అంటే వెంటనే ఔననకూడదు. కాస్త ఆలోచించి చెప్పాలి” అంది. మర్నాడు సుబ్బమ్మ ఏదో పనిమీద బయటకు వెళ్ళింది. ఆ సమయంలో షావుకారు పద్దయ్య వాళ్ళింటికి వచ్చాడు. చంద్రయ్య “రండి, రండి” అంటూ ఆయన్ని మర్యాదగా లోపలికి ఆహ్వానిం



